# బగ్ జార్గల్

మూలం:

విక్టర్ హ్యూగో

అనువాదం:

పింగళి లక్ష్మీకాంతం

కాటూరి వేంకటేశ్వరరావు



పబ్లిషర్స్:

కాటూరి కవితాలత

దుర్గా అగ్రహారం

విజయవాడ-2.

ప్రథమ ముద్రణ 1929
ద్వితీయ ముద్రణ జూన్ 1965
తృతీయ ముద్రణ జూలై 1967


ప్రచురణ — 3
వెల: నాలుగు రూపాయలు

దేశిప్రెస్, విజయవాడ-2.

# మున్నుడి

ప్రపంచ ప్రఖ్యాత నవలా రచయితలలో అగ్రశ్రేణికి చెందినవాడు విక్టర్ హ్యూగో. అతని రచనలకు జయపతాక యనదగినది బగ్‌జార్గల్. వర్ణాంతర సంఘర్షణము ఇందభివర్ణితము. నీగ్రోలకు, శ్వేత జాతులకు నడుమ రగిలిన సంఘర్షణమున సంకటులు పడిన పాట్లను రచయిత ఇందు ప్రత్యేకముగా వర్ణించెను.

'డామింగో' వెస్టు ఇండీస్ దీవులలో నొకటి. నేడది డొమినికన్ రిపబ్లిక్ అనబడుచున్నది. బగ్‌జార్గల్ నీగ్రో యువరాజు. లియోపాల్డ్ అవర్నీ ఫ్రాన్స్ దేశస్థుడు. ఒక వంక నీగ్రోలకు శ్వేతజాతులకు నడుమ భయంకరాహవము జరుగుచుండ, మరియొక వంక ఈ భిన్నవర్ణీయులు ఉదాత్తమైత్రిని నెరపినట్లు వర్ణించుట రచయితకు గల విశ్వ మానవ సౌభ్రాతృత్వ సిద్ధాంతము నందున్న విశ్వాసమును వ్యక్తము చేయుచున్నది.

రచన లన్నింట ధీరులు-వీరులు- క్రూరులు- ఉండుట సహజమే. కాని, ప్రత్యేక వ్యక్తిత్వము గల్గిన పాత్రలు అరుదు. అట్టి పాత్రలను సృష్టింప గలిగిననూ ఉచితరీతిని విజయవంతము చేయుట మిక్కిలి అరుదు. విక్టర్ హ్యూగో రచన లన్నింట అట్టి విలక్షణమైన పాత్రలు ఎదురగుచుండును. బగ్‌జార్గల్ నవలలో 'బైసో' పాత్ర యట్టిది.

బైసో మాటకారి- వ్యవహార దక్షుడు. కాపట్యము; క్రౌర్యము వాని మాటయందు ధ్వనించును. వాని స్వరము భయరహితము. వాని పద విన్యాసమున గొడ్డళ్ళు పెఠీలు మనును. వాని నిర్ణయములు కొండరాళ్ళు. ఇన్ని భయంకర స్వభావము లున్నను వాని పలుకుబడిలో వ్యంగ్య వైభవము చిరుగుంటలై మ్రోగును. అది వానికి, పాఠకునకును మాత్రము అనుభవైకవేద్యము. బైసోను చుట్టియున్న పాత్రలకు మాత్రము గుండె దడ పుట్టించును.

"బైసో ఈ మాటలు నిజముగనే యనెనో హేళనగనే యనెనో వాకు గోచరింపలేము." అనిన అవర్నీ అభిప్రాయము నూరుపాళ్ళ సత్యము.
"ఈ అర్థశాస్త్రజ్ఞుడు మాటల పొదు పెరుగడు" అను వాక్యము బైసో వ్యంగ్య గర్భిత మిత భాషణమునకు ప్రతీక.
ఒక తెల్లవాడు బైసోకు పావదాసునిగ నుండు వైచ్యమునకు పాల్పడెను. కాని బైసో అందు కంగీకరింవక తన కాతనిపై ఎంతేని గౌరవముగల దనుచు, వానికి మరణ దండనము విధించి, తన కాతనిపట్లగల గౌరవ మును నిరూపించుకొనును. ఒక సైనికుడు చినిగి బురద కొట్టుకొనిన గుడ్డలతో సైనిక విన్యాసమున పాల్గొని నేరమునకు వానిని పిలిచి "ఈ చినుగు గుడ్డలతో నా సైన్యము నెట్లు చేర సాహసించితివో చెప్పుము. పొమ్ము. నా మాటగా చెప్పి తుపాకి వాత పడుము" అనిన బైసో మాటలకు పాఠకుడు ఝల్లుమనును. ఇది వాని చండశాసకత్వమునకు మచ్చు.

అనువాదకులు శ్రీ పింగళి లక్ష్మీకాంతం; కీ॥ శే॥ కాటూరి వేంకటేశ్వరరావు గారలను గూర్చి మాకు తెలిసిన దానికంటె, తెలుగు లోకమునకు తెలిసినదే ఎక్కుడని మా విశ్వాసము.

లియోపాల్డ్ అవర్నీ నాటినుండి నేటి కెనడీ దనుక నిరంతరమై రగులు చున్న ఈ వర్ణసంఘర్షణ ముగియు టేనాటికో !....

ఈ నవలను 1929 వ సం॥లో ప్రథమముగా ప్రచురించిరి. మా కోరిక మేరకు దీనిని శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు పునః పరిశీలించి, సరళ గ్రాంధికమునకు దెచ్చిరి. వారికి మా ధన్యవాదములు. దీనిని తెలుగు పాఠకుల కందజేయుటయే మా యదృష్టము.

ప్రకాశకులు

# బగ్ జార్గల్

## ప్రస్తావన

తుట్టతుదకు తన వంతు వచ్చునప్పటికి కెప్టెన్ "లియోపాల్డ్ అవర్నీ" తన మిత్రుల దెస వింతచూపు పరపుచు "నా జీవితమున మీకు వినిపింప దగిన విశేష మేదియు జ్ఞప్తియందు లేదు. నా మాట నమ్ముడు" అనెను.

లెఫ్టినెంటు "హెన్రి" ఆమాట యంగీకరింపక "అవర్నీ! అనేక దేశములు తిరిగి ఎన్నో వింతలు చూచితివి. ఆఫ్రికా జూచితివి, ఇటలీకి జని యుంటివి. అవిగాక స్పెయిన్ దేశమును గూడ చూచిన నీవు ఇటు లనజెల్లునా?— అన్నట్లు, ఇదిగో! నీ కుంటికుక్క తిరిగ వచ్చినదే?" అనెను.

ఆమాటకు అవర్నీ ఉలికిపడి, నోటిలోని పొగచుట్టను తీసి జారవిడచి, గుడారము వాకిలి వైపునుండి తన దెసకు కుంటుచు వచ్చుచున్న తన పెద్ద కుక్కను పొడగాంచెను. క్షణములో ఆ కుక్క అతని చెంత చేరి, తోక ఆడించుచు, పాదములు నాకుచు, చెలగాటలాడుచు, యజమానిని మరల చూడగలిగిన సంతోషమును అనేక విధముల ప్రకటించి శునక ధర్మమును యథావిధి నెరవేర్చిన దానివలె తృప్తితో అతని పాదముల చెంత ముడుచుకొని పరుండెను. అప్పుడు అవర్నీ మనస్సున ఏవేవో తలపులు జనించినను, వాటిని మొగమున కన్పడనీయక, దాని మేను నిమురుచు, ఆదరముతో, "మరల

తాడ్యూస్ "నిజము స్వామీ! ఆ నాడు బగ్‌జార్గల్ కోసము నేనెంతో విలపించినమాట నిజము. ఆతని యోగ్యత అట్టిది. అగుట కాతడు నల్లవాడే! అయిననేమి? తుపాకీ మందు నలుపుకాదా? మరియు—" అని ఆ సార్జెంటు తన కెప్టెనును మక్కువగొల్పెడి ఈ పోలికను పూర్ణోపమాలంకారముగా శోధించి యుండును కాని, హృదయ నిర్భరమైన తన భావమును నోట చెప్పజాలడయ్యెను. శత్రుదుర్గమును పట్టుకొననెంచు సేనాపతివలె ఆ భావమును వ్యక్తము చేయుటకు పలుపాట్లు పడి ఫలముగానక, ఆ ప్రయత్నమును మానుకొని, తన సర్దారులు తన్ను చూచి నవ్వుకొనుచుండుట గమనింపకయే మరల యిట్లు చెప్ప దొడగెను. "ఆ నీగ్రో వీరుడు తన మిత్రబృందము బంధింపబడియున్న చోటికి రోజుకొనుచు పరుగు పరుగున వచ్చుట మీకు జ్ఞప్తిలేదా స్వామీ? వాళ్ళను నేనే బంధించి వుంచితిని. ఆతడు వచ్చి, వాళ్ళ కట్లు విప్పి వలదని తన్ను వాళ్ళెంత వారించుచున్నను చెవి నిడక, అచంచలుడై వాళ్ళ స్థానమున తాను నిలిచెను. అతడు మానవ మాత్రుడు కాడు 'జిబ్రాల్టరు' నైనను కదలింప వచ్చునుగాని. అతనిని చలింప జేయలేము. రంగమును ప్రవేశించు నటునివలె మహోత్సాహముతో అతడు సంసిద్ధుడు కాగా, భవితవ్యమును గుర్తించిన ఈ కుక్క ఒక్క ఉదుటున నా కుత్తుక పైకి ఉరికెను."

అవర్నీ "తాడ్యూసా! ఈ కథ నీ వెప్పుడు చెప్పినను ఈ పట్టునకు వచ్చునప్పటికి రాస్కును దువ్వుచుండు వాడవే!

చూడుము పాపము అది నీవంక ఎట్లు చూచుచున్నదో ?"

తాడ్యూసు సంభ్రమముతో "నిజము సెలవిచ్చితిరి. పాపము అది నా వంక చూచుచున్నది. కుక్కను ఎడమ చేత దువ్వరాదని మా అవ్వ చెప్పెడిది. అంతే నాకు—"

అతడు తన కుడిచేతిని దాచుకొనుటయు, అతని మొగము వెలవెల పోవుచుండుటయు పరికించిన అవర్నీ "మరి నీ కుడిచేతితోనే ఏల దువ్వరాదు?" అని యడిగెను.

తాడ్యూసు ఇనుమడించిన సంభ్రమముతో "స్వామీ! చిత్తగింపుడు; నా కుడిచేయి—సరి, దాని కేమి లెండి ఇంతవరకు మీకు ఒక కుంటి కుక్క మాత్రమే కలదు. ఇప్పుడు ఒంటిచేతి సార్జెంటు కూడ తటస్థించెను" అనెను.

"ఒంటిచేతి సార్జెంటా? నా కేమియు బోధపడుట లేదు. ఏదీ? నీ కుడిచేయి చూడనిమ్ము? ... అయ్యో! ఒంటిచేయియా!" అనుచు అవర్నీ భయచకితుడై తదేక దృష్టితో చూచుచుండగా, సార్జెంటు కట్టుకట్టియున్న తన కుడి చేతిని మెల్లగా బయటకు తీసి చూపెను. ఆ కట్టంతయు రక్తసిక్తమై యుండెను

అవర్నీ జాగ్రత్తగా కట్టువిప్పి "ఎంత ఘోరము! మిత్రుడా! ఇది ఎట్లు తటస్థించినదో చెప్పుము? అనెను.

తాడ్యూసు: చెప్పుట కేమున్నది? దుర్జాతులగు ఆగ్నేయ సైనికులు మీ కుక్కను — బగ్ జార్గల్ కుక్కను —హరించినది మొదలు మీరు విచారమున మునిగియుండుట నేను గ్రహించితినని చెప్పితిని కదా! ప్రాణము పోయినను

సరే, నేడు దీనిని తిరిగి తీసికొనివచ్చి మీకు అప్పగించి కడుపార మీరు భుజించుట చూడవలయునని నిశ్చయించితిని. తెల తెలవారకముందే మనము కదనరంగమున కేగవలసి యున్నది కనుక నా దుస్తులు మున్నగు వాటిని సర్ది సిద్ధము చేయుటకొక సేవకుని నియోగించి, నేను ఖడ్గమాత్ర సహాయుడనై మెల్ల మెల్లగా పొదల చాటున తారుచు ఆంగ్లేయుల శిబిరమును సమీపించితిని.

అల్లంత దూరములో పలువురు రాంగ్ల భటులు ఒకచో గుమిగూడి యుండుట చూచి, వారేమి చేయుచుండిరో కనుగొనవలెనని అట్టే ప్రాకుచు మరికొంత సమీపమునకేగి పరికింతునుగదా — ఆ గుంపు మధ్య ఒక చెట్టు — ఆ చెట్టునకు కట్టబడియున్న రాస్కా — ఆ గుంపులో ఇరువురు సైనికులు కలబడి దొమ్ములాడు చుండిరి. ఎముకలు విరుగునట్లు వారొకరి నొకరు ప్రహరించుకొను ముష్టిఘాతములు మన భేరీ ధ్వనుల వలె వినవచ్చుచుండెను. వారి ముష్టియుద్ధము రాస్కా కొరకే! నన్ను చూడగనే రాస్కా ఒక్క ఎగురు ఎగిరి, కట్టు త్రాడు త్రెంచుకొని దుమికి నా చెంతకు వచ్చెను. అది వచ్చుటయే తడవుగా నేను మన శిబిరము దెసకు పరుగిడ దొడగితిని.

అంతట ఆ గుంపు నన్ను వెన్నాడెను. వెన్నాడుటయే కాదు, నాపై గుండ్లవర్షము కురిపించెను. రాస్కా మొగము త్రిప్పి కవ్వించి మొరుగుచుండెనేకాని ‘ఫ్రెంచి కుక్క! ఫ్రెంచి కుక్క!’ అని కేకలు పెట్టు వాళ్ళ కోలాహలములో దాని

మొరుగు వినరాలేదు. అప్పటికి నేను పొదలు త్రొక్కు-
కొనుచు వచ్చి బయట పడితిని గదా అని సంతోషించు
చుండగా వాళ్ళలో ఇరువురు నాకడ్డము తారసిల్లిరి. ఒకనిని నా
కత్తికెరజేసితిని రెండవవాడు కూడా కడతేరి యుండును, గాని
వానిపిస్తోలు—కాదు నా దుర్వ్యాధి-నా చేతిని గాయపరచినది.
వాళ్ళు ఎగతాళి చేసిన ఈ ఫ్రెంచి కుక్కయే అప్పుడు
ఉరికి వాని కంఠము కరచి చిరమిత్రుని వలె గాఢముగా
కౌగలించుకొనెను. వాడు క్రిందబడి ప్రాణములు విడిచెను.
మేమిర్వురము ఇటు చేరగలిగితిమి. నా కొకటే విచారము—
ఈ దెబ్బ రేపు యుద్ధభూమిలో తగులక పోయెకదాయని!"

అవర్నీ: (మందలింపుగా) తాడ్యూసూ! నీకేమైనా
మతిపోయినదా ఏమి? కుక్క మాత్రమునకు ప్రాణగొడ్డముగు
పనిచేసితివి.

తాడ్యూసు: శునకమాత్రమునకా స్వామీ! మన
రాస్కు కొఱకు—బగ్‌జార్గల్ రాస్కుకొరకు.

ఈ సమాధానముచే అవర్నీ స్మిత మనస్కుడై
"అవును లే! మిత్రుడా! అవును లే! ఇకరమ్ము, నన్ను ఊతగొని
నడువుము. ఆసుపత్రికి పోదము" అని బయలు దేరెను.

"తమకంతటి శ్రమ ఎందుకు?" అని తాడ్యూసుసురుగ
జూచెనుగాని లాభము లేకపోయెను. వారు చనుచుండ రాస్కు
కూడా వారిని వెన్నంటి చనెను. అచ్చట చేరియున్న సహచర
వర్గము ఇదంతయు చిత్రముగా చూచుచుండెను.

దేశకాలపాత్రవశమున ఎట్టి అవస్థాగతుడయ్యెను అవర్ని చూపరకు గౌరవాదరములు జనింప జేయును. ప్రథమ దర్శనమున ఆతనిలో విశేషమేమియు కానరాదు. ఆతని స్వభావము గంభీరము. నిర్లోకనము ఉదాసీనము. ఉష్ణ దేశములలో చిరకాలము నివసించుటకతన ఆతని లేజెక్కిళ్ళ వన్నె కగ్గెను. వన్నె కగ్గనే కాని తద్దేశీయులకు సహజముగు వాక్చాతురియు, సహజ పొంకమును ఆతని కలవడ దాయెను. ఆతడు పలుపిప్పి మాటలాడుట అరుదు. చెవియొగ్గి ఇతరుల మాట వినుట అంతకంటె అరుదు. కార్యాచరణమున కెప్పుడును సంసిద్ధుడై యుండును. యుద్ధమునకు ఉరుకు వారిలో ఆతడు మొదటివాడు. విడుదలకు తిరిగివచ్చు వారిలో తుది వాడు. నిర్వ్యాపార సమయమున తాలిమని దండింప చేయు తలపులు ఏదైన పని చేపట్టిన తొలగునుకదా యని ఆతడెప్పుడును కాయకష్టమును అనుభవింప గోరును. ఆ తలపులే వాని ముఖమునకు అకాల వార్ధక రేఖ నాపాదించినవి. ఆతని విచార విషయము అంతరంగికులతో వెళ్ళబోసుకున్న తీరునదియును కాదు. కాలయాపన కొరకు ప్రసంగము లోనికి దింపదగినదియును కాదు. ఎట్టి సాంగ్రామిక భారమైనను లొంగ తీయలేని ఆతని దృఢశరీరము దుస్సహమైన అంతర్వేదనా భరవశమున కృశించుచున్నట్లు తోచును. సాధారణముగా అతడు వాగ్వాదములకు పోడు. ఎప్పుడైనను ఏ వాదమైనను అందుకొని మాటలాడుచో యుక్తియుక్తముగా ప్రౌఢముగా రెండు మూడు ముక్కలే పలుకును. ఆ వాదములో తన ప్రతి వాదికి

వోటమి రానున్న క్షణమున వెంటనే తన వాదమాపి "పోనిండు. ఈ వాదములతో నేమి ప్రయోజనము? పుణ్యమా! పురుషార్థమా?" అని తలంచి, లేచి, శత్రువృత్తాంతము తెలిసి కొనుటకు సేనాపతి కడకేగును. ఉదాసీనత, గరువ తనము, మౌనము లోనగు ఆతని నిరుత్సాహ గుణములు ఆతని మిత్రులకు దుస్సహములైనను, వాని దయాదాక్షిణ్యాది మృదులక్షణములను బట్టి వారాతని చుట్టును చేరెడివారు. ఎన్ని తడవులో ఆతడు తన ప్రాణములను సరకుగొనక ఇతర ప్రాణులను రక్షించెను. ఎందరెందరికో తన చేతి సొమ్ము అడ్డము వేసి అవసరములు గడపెను

ఆతడు వయస్సున చిన్నవాడు. ముప్పది యేండ్ల వాని వలె కనబడునుగాని నిజమునకు అంత వయస్సులేదు. ఫ్రాన్సులో తటస్థించిన ప్రజావిప్లవము సందర్భములో అతడు ప్రజా పక్షముననే పోరాడెను. కాని ఆతని పూర్వ చరిత్రను మాత్రము ఎవ్వరూ నెరుగరు. ఒక్క తాడ్యూసుతో మాత్రము ఆతడు మనస్సు విప్పి మాట్లాడును. వారిరువురును ఒక్కనాడే ఈ దళమున జేరిరి. తాడ్యూసే అప్పుడప్పుడు ఏమరు పాటున అవర్ని జీవితము నందలి పూర్వవృత్తాంతములను విచారముతో చెప్పుచుండును. ఈ వీరుడు అమెరికాలో కొంత కాలముండి అచ్చట చాల విపద్దశలు అనుభవించెననియు, డొమింగో లంకలో వాని వివాహమైనదనియు, ఆ ద్వీపములోనే తటస్థించిన ప్రజాక్షయకర విప్లవములలో ఆతని భార్యయు, ఇతర బంధువు లును అంతరించిరనియు, తాడ్యూసు చేసెడి అస్పష్ట కథనము

వలన కొంత కొంత తెలిసెడిది. మేను వ్రాయబోవు అతని జీవితకథ జరిగిన ఆ దినములలో, గృహస్థులు అట్టి ఘోరముల పాలగుట సర్వసాధారణ విషయమే యైనను, అవర్నీ పడిన కష్టముల కారణ కలాపము మాత్రము అతి విచిత్రమై వినువారికి మిక్కుటమైన జాలి గొలుపు చుండును. పైకి ఎంత ఉదాసీనుడుగా కన్పట్టినను, అతని హృదయము మాత్రము ప్రతిక్రియ లేనంతగా భగ్నమై బాధపడుచున్నట్లు సూక్ష్మ దృష్టికి గోచరింపక పోదు. యుద్ధాంగమున అడుగు పెట్టగనే, ఆ హృదయవ్యథ లెల్లమరచి శాంత వీరుడై కయ్యమునకు మొనర్చెను. అతని రణోత్సాహమును గాంచిన వారు "ఈతెడు సేనాపతిత్వమును ఆశించుచున్నాడా!" అని అనుమానించెడి వారు. కాని అతని కే ఆశలును లేవు. జయము లభింపగానే యథాపూర్వకముగా సాధువర్తనుడై కాన్పించును. ప్రతిఫలాపేక్ష కాని, కీర్తికాంక్షగాని లేని అతని అద్భుతసాహసములు మిత్రులకు ఆశ్చర్యము గొల్పును. మృత్యుదేవతా సమాగమమునకు అతడు ఉవ్విళ్ళూరుచున్నట్లు వారెరుగరు. ఒకసారి ఉన్నత పథము లభించినను ఆ ప్రమిత్రుడగు తాడ్యూసును విడిచి వెళ్ళుట కిష్టములేక అతడు దానిని నిరాకరించెను. 'ఈ సారి తప్పక చావు దొరకును' అని గంపెడాశతో అతడొక యుద్ధమున దుర్ఘటకార్యమొకటి సాధింపబోయెను. అందరును 'అవర్నీ ఇక మనవాడు కాడు' అనుకొనిరి. కాని ఆ వీరుడు అక్షతుడై కార్యము సాధించు కొనివచ్చి 'అయ్యో! నే నా ఉద్యోగమునుగూడ వదలుకొంటినే! శత్రుశతఘ్ని

ముఖమున లభింపని మృత్యువు ఆ ఉద్యోగ మూలముననైన లభించెడి దేమో! ప్రభుత్వము చంకనెత్తుకొనుట సమయించుటకే కదా!" అని విచారపడెను.

ఏవంవిధ గుణమహితుడగు అవర్నీ గుడారము విడచి తాడ్యూసుతో ఆసుపత్రికి ఏగగానే, మిగిలిన మిత్ర బృందము తమలో తామిట్లు సంభాషించుకొనిరి.

హెంప్రి: "నేడు మన సేనాపతి బండిలో మనము చూచిన పదిగంపల సారాయి బుడ్లు ఇచ్చినను అవర్నీ ఆ కుక్క కుంటికాలినైనా ఒసగడు." అనుచు రాస్కునసిచి వెళ్ళుటలో తన పాదరక్షకు అంటుకొనిన బురదను తుడుచుకొనుచుండెను.

పాస్కల్ : ఆ సారా బుడ్లు ఈ పాటికి ఖాళీ అయిపోయి వుండును! ఆ బుడ్లకే ఇచ్చుటకు కుక్క కాలేమి సామాన్య మనుకొంటివా? ఆకాలి ఎముకతో గంటకు చక్కని పిడిచేయవచ్చును సుమా" అని అతడు గంభీరముగ పల్కెను. ఆల్ఫ్రెడ్ తప్ప తక్కిన అందరును గొల్లున నవ్విరి.

ఆల్ఫ్రెడ్ : ఏమయ్యా! నవ్వెదరు? ఇందుకు నాకు నవ్వులాటకు విషయమేదియు కాన్పించుట లేదు. నేనెరిగినప్పటి నుండి అవర్నీని ఒక్క క్షణమైన విడిచి ఎరుగని ఆ కుక్కయు, ఆ సార్జెంటును గౌరవపాత్రము లగుదురు గాని హాస్య పాత్రములు కాజాలరు.

పాస్కల్ : అయ్యో! కాదా మరి! పాపము, పోయిన కుక్క దొరుకుటయు, సార్జెంటు చేయి విరుగుటయు—

హెన్రీ : పాస్కల్! నీవు పొరపడుచున్నావు. 'పీరట్' అనబడు ఆ బగ్ వృత్తాంతము నెరుగ వలెనని నాకెంతో కుతూహలము జనించుచున్నది

ఇంతలో అవర్నీ తిరిగివచ్చి అల్లన కూర్చుండెను. ఆతని వైఖరి ఇంకను విచారమును సూచించుచున్నను ముఖమున సహజ ప్రశాంతత నెలకొనెను. వీరిమాట లేవియు ఆతడు విన్నట్లు లేదు. వెన్నంటి వచ్చిన రాస్కు అతని పాదములకడ పండుకొని స్వామి మిత్రులవైపు ఒక కన్ను వైచియుండెను.

"అవర్నీ! ఈ ద్రాక్షరసము చవి చూడుము." అని పల్కు తన్నేమో ప్రశ్నించుచుండిరని భావించి, "వద్దు! గాయ మంత ప్రమాదమైనదిగాదు ఎముక ఏమియు విరుగలేదు." అని అతడు సమాధాన మిచ్చెను. ఈ సమాధానమునకు పట్టరాని నవ్వువచ్చినను, ఆతని యెడగల పూజ్యభావముచే వారాపుకొనిరి.

హెన్రీ : తాడ్యూసు గాయము విషయమున అలజడి మాసినది కదా! ఇక ప్రొద్దు పోకకై మనము బందొరుల జీవిత వృత్తాంతములు చెప్పుకొనుటకు చేసుకొన్న ఏర్పాటు ప్రకారము ఈ కుంటికుక్క కథను మనుజసింహమగు ఆ పీరట్ వృత్తాంతమును చెప్పుము.

హాస్యగర్భితమగు ఆతని కోర్కెను ఎట్టకేలకంగీకరించి అవర్నీయిట్లనెను. "అలాగే! మీమనసు తీర్చెదను కాని ఆ కథలో విశేషమేమియును లేదు కథనునేను ఉపనాయకుడను మాత్రమే కాని నాయకుడను కాను. రాస్కు తాడ్యూసుల

కును, నాకునుగల పరస్పర ప్రేమనుగాంచి, ఇందేదో విచిత్ర విషయ మున్నదని మీరనుకొను చుంటిరేమో ! అట్టిదేయు లేదు అయినను కథ ప్రారంభింతును "

ఇటీవలి సంఘటనల అడుగున పడిపోయిన ప్రాతవర్తనముల త్రివ్వితీయుటకో యన అవర్నీ కన్నులు మూసుకొని ఒక్క క్షణము భావనిమగ్నుడయ్యెను. పదపడి మందస్వరములో ఎడనెడ ఆపుచు కథ చెప్పదొడంగెను.

# 1

ఫ్రాన్సు నా జన్మభూమి. డామింగో ద్వీపమున నాకొక మేనమామ కలడు. ఆయన ఏకపుత్రికను నా కిచ్చి వివాహము చేయుటకు చిన్ననాటనే మావారు నిశ్చయించిరి బాల్యమునుండియు నేను మేనమామయింటనే పెరుగుచుంటిని. ఆ ద్వీపమునకు వలస పోయిన వారిలో మా మామ మిగుల సంపన్నుడు. "గాలిఫెట్" గుడిసమీపమున 'ఆకల్' మైదానములో ఫలవంతములైన క్షేత్రములలో, నారికేళాది వనములతో, విశాల సుందరమైన భవనములో ఆయన మహాప్రాభవము ననుభవించుచుండెను. అతిమాత్రముగ ఈ సంపద్వర్ణనము మీకు అప్రస్తుతముగా తోచవచ్చును, గాని అదియును మా నాశహేతువులలో నొకటి గాన్సున కొంచెము విస్తరించి చెప్పితిని.

ఈ భూము లన్నియు సేద్య మొనర్చుటకు మా మామ చేతిక్రింద ఒకవేయి నీగ్రో బానిసలు కలరు. మొదలే దుఃఖ

భాజనమగు ఆ బానిసల బ్రతుకును మా మామ హృదయ కాఠిన్యము మరింత దుర్భరమొనర్చెను. ఆయనను ఆవరించిన అధికార పిశాచము మానవ సహజమగు దయాదాక్షిణ్యములను ఆయన హృదయమునుండి తరిమివేసెను. ఆభాగ్యములలో అందరును ఇటువంటి రాతి గుండె కలవారు కాకుండుట అదృష్టము. కనుపన్నచే బానిసలను గడగడ లాడించుట మా మామకు ఆచారమైనది. పని పనుటలో ఎవ్వడేని కొంచెము వెనుక మందాడెనా, వానిముప్పు మూడినదన్న మాటే! అప్పుడు నేనుగాని, ఆయన పుత్రికగాని అడ్డము పోతిమా మరింత మండిపడి, మా మీద కోపముగూడ ఆ దీనునిపై చూపెడివాడు. కావున అట్టివేళల మేము ఆయన ఎదుటికేగక, చాటుచాటున ఆ మందభాగ్యుని ఓదార్చి కొంతకొంత దుఃఖభారము తగ్గింప చూచెడివారము. ఈ బానిసలలో ఒక్కడు మాత్రము మా మామ అనుగ్రహమునకు పాత్రుడయ్యెను. వాడు సంకరజాతివాడు. కుబ్జుడు. వానిని జమైకా గవర్నరు కానుకగా నిచ్చెను. పోర్చుగీసువారి రాజభోగములకు, లాంఛనములకు అలవాటు పడినవాడు గావున అయన తన ఐశ్వర్యమునకు అనుగుణముగా, దాసదాసీజన పరివృతుడై యుండెడివాడు. ప్రాచీన రాజపరివారములో ఒక విదూషకుడు కూడా ఉండుట ఆచారమే గావున, తన రాజ ప్రాభవమును ప్రకటింప కోరికగల మా మామ ఆ మరుగుజ్జువానిని తనకు విదూషకుని గావించుకొనెను. వాడు ఆ పాత్రను యథావిధిగా నిర్వహించెను. ఆ వికృతాకారుని

పేరు "హెబిబ్రా". వాడు పిశాచమువలె చూపరకు భయము గొల్పుటయేగాక నవ్వుకూడా పుట్టించెడివాడు. బలముగా క్రొవ్విన మేనుతో, ఊచకాళ్ళతో ఆ కుబ్జుడు చరచరా పరుగెత్తుచున్నట్లు నడచి పోయెడివాడు. కూర్చున్నప్పుడు మాత్రము వాని ఊచకాళ్ళు సాలెపురుగు కాళ్ళవలె అట్టె ముడుచుకొని పోయెడివి. ఎఱ్ఱనిజిఱ్ఱ వెంట్రుకలతో నిండి, భుజములమీద అతికినట్లున్న ఆ పెద్ద తలకాయ, దొప్పచెవులు, అనుక్షణము వికారరేఖా పరంపరలను పాటుంబోటుగా మార్చుకొను వెడంద మొగము గాంచి మా మామ నవ్వుకొనుచు ఆనందభరితు డయ్యెడివాడు. తలకు మీరిన పాటుచే బానిసలెల్లరు క్రుంగిపోవుచుండ ఈ కుటిల విదూషకుడు యజమాని అనుగ్రహమును సంపాదించి, నిర్విచారముగా ఉండెడివాడు. యజమానిపై ఈగలు వ్రాలకుండగా ఒక పెద్ద నెమలి ఈకల వీవనతో విసరుచుండుటయే వాని పని భోజన సమయమున యజమాని పాద సమీపముగా ఒక వెదురు చాపపై చతికిలబడి, ఆయన విసరివేసెడి ముక్కలను ముడుసును ఏరుకొని తినుటయే వానికి బత్తెము. స్వామి తన పైని చూపెడి ఈ దయకు ఆ విదూషకుడు ఉప్పొంగిపోవుచు ఆయన కనుగీటగానే పెంపుడుకుక్కవలె, కోతివలె పరుగు పరుగున పోయి వ్రాలెడివాడు.

ఈ విదూషకుని మీద నాకెంతో అసహ్యము. అసలు సేవ అనునది న్యూనతకు కారణమగుటనిజమేగాని, అందులో ఇంటి చాకిరివలె పొలముపాటు అంత నికృష్టముకాదు. ఇక

ఈ కుష్టుని దాస్యము మూర్తీభవించిన నైచ్యము! నిప్పుల వలె మలమల మాడ్చు ఎండలో నెత్తిపై దోసెడు గుడ్డయైన లేక, పగలెల్ల పొలములలో పసువులవలె పాటుపడు ఆ బానిసల దుస్థితి జూడ నా మనస్సు నీరైపోయెడిది. మరి ఈ సోమరి విదూషకుడు చిరుగజ్జెలు కుట్టిన సరిగదుస్తులు తాల్చి తైతక్కలాడుట చూచి నేను సహింపలేక పోయెడివాడను. అదియునుగాక, యజమానివద్ద చనవుబలిమి గల ఈ దురాత్ముడు తన తోడి బానిసలపై ఆయనకు కనికరము పుట్టింప నెంచడు సరికదా, మీదు మిక్కిలి ఏకాంత ప్రసంగములలో ఆ దీనులపై లేనిపోని కొండెములు చెప్పి ఆయన మనస్సు మరింత విరిచెడివాడు. పాపము! ఆ అమాయకులు వీనిమీద ఏ కోపతాపములును లేక భయ వినమ్రులై యుండెడివారు. వీడు సరిగంచు దుస్తులలంకరించుకొని, కింకిణీబద్ధము చిత్రవర్ణ శోభితమునగు నిడుద కుళ్ళాయిని శిరమున దాల్చి ఇటుగా తన గుడిసెలముందు చనునప్పుడు, ఆ బానిసలు అంతంత నిలచి "అదే మాంత్రికుడు" అని తమలో తాము గుసగుసలు పోయెడివారు.

ఈ వివరములన్నియు నే నెరిగినవే అయినను, అవి నా మనస్సునకు అంతగా పట్టలేదు. ప్రేమమయి యగు "మేరీ" మధురమూర్తిని వలపు పూవులతో పూజచేయుచు, శృంగార రసతరంగ డోలికల ఆమెతో కూడి తేలియాడు నాకు ఆదినములలో ఆ ప్రణయమూర్తి తప్ప అన్యప్రపంచమే లేదు. సకల భోగ భాగ్యములతో తులదూగుచూ ఆనందమయ క్షేత్ర

మున చిన్ననాటనుండి మే మిరువురమును ప్రోదిచేసు కొన్న
వలపుతీవలు పుష్పించు కాలమునకు ఎదురుచూచుచు, సుఖ
భావనా స్వప్నములు గాంచుచు నే ననుభవించిన యౌవన
మాధుర్య మనన్యదుర్లభము! (గతించిన సౌఖ్య స్మృతిచే
స్వరము గాద్గద్యము వహింప అపర్ణ ఒక్క క్షణమాగి,
పిమ్మట ఇట్లనెను.)

"పదపడి నే ననుభవించిన దారుణ వ్యథలును అన్య
దుర్లభములే!

# 2

ఆశాతరంగితమగు ఆ భావనా స్వప్నప్రవాహమున
తేలిపోవుచుండగా నాకు ఇరువది యేండ్లు నిండినవి. అది
1791 వ సంవత్సరము-ఆగస్టు నెల. మా వివాహము ఆ
నెలలోనే జరుగుటకు నిశ్చయ మయ్యెను. దరిదాపై వచ్చిన
ఆ దాంపత్య సుఖ భావనల మునిగియుండుట చేత అప్పుడా
రాష్ట్రమును ముంచుకొని వచ్చుచున్న ప్రజా విప్లవమును
గమనింపక పోతిమి. కావున 'కేప్లెన్ మాస్టు' దుర్మరణ
మును గూర్చిగాని 'కౌంట్ పెర్నియాక్' సంగతి గాని ఇక్కడ
ప్రస్తావింపను. ఉత్తర రాష్ట్రీయ సభకును, యావద్రాష్ట్రీయ
సభకును గల పరస్పర ద్వేషములను గూర్చికూడా ముచ్చటిం
పను. ఆ రెండు పక్షములవారితోను నాకప్పుడు సంబంధము
కూడా లేదు. మా భవనము 'కప్' నగర సమీపమున

నున్నది కావున ఆ పురమును గురించి మాత్రము కొంత శ్రద్ధ వహించితిని. అదియే వినిపింతును.

1791 వ సంవత్సరము - మే నెల 15 వ తేదీని ఫ్రెంచి జాతీయ సభ "స్వతంత్రులగు సంకీర్ణులు తెల్లవారితో సమానమైన హక్కులు కలవారే!" అని శాసించెను. ఈ తీర్మానము అనేక విపత్తులకు మూలమని ఊహించి, ఆ విషయములో నేను కొంచెము జోక్యము కలిగించుకొంటిని. రాష్ట్ర గవర్నరు కాపు నగరమునందే నివసించుచుండెను. అతడే సందర్భమున మా కందరకు విందు చేసెను. ఆ విందుకు వచ్చిన భూస్వాము లలో పడుచువారు శ్వేతజాతులకు మాత్రమే భోగ్యమగు అధికార వృక్షమునకు ఈ చట్టము గొడ్డలి పెట్టయినదని తమ దురభిమానమును వెడల గ్రక్కు చుండిరి. నేనా వాదములో దిగ లేదు. ఇంతలో సంపన్నుడగు మరియొక భూస్వామి వారిని చేరవచ్చుచుండెను. అతని జన్మపవిత్రత సందేహాస్పదమయి నను తెల్లవారందరు ఎరిగి ఎరుగనట్లు ఆతనిని గౌరవించు చుందురు. నేను ఆతని కెదురేగి "మీరు అటకు పోవద్దు. అక్కడ జరుగు సంకర జాతులనింద వినవలసి వచ్చును" అని గట్టిగా వారించితిని. నా వాక్యములలోని వ్యంగమునకు ఆతని కాగ్రహాము కలిగి నాతో కయ్యమునకు చేసాచెను. ఇరువురము కొంతసేపు పోరి క్షతగాత్రులమైతిమి. వ్యంగ్యముగా నైననేమి?- నేనాతనిని తూలనాడుట నా దోషమే! అయినను అతనిపై నాకొక కోపకారణము కలదు. వాడు నా మేకీపై కన్ను వేసెను. ఆ తెగువరి ఆనాడే ఆకన్నెతో నృత్యము

కూడా సల్పెను. ఈ కోపకారణమే లేనిచో అతని జన్మ
ప్రస్తావన నాకేల ?

రోజులు గడచి మా వివాహ ముహూర్తము చేరువగు
చున్న కొలది ఆ ప్రజావిప్లవముతో నాకేమియు సంబంధము
లేకుండ పోయెను: మహా ప్రళయ సూచకములైన కారుమబ్బులు
నలుదెసల క్రమ్ముకొని వచ్చుచుండుట నేను చూడనైతిని.
నిర్భాగ్యులైన ఆ బానిసలు తిరుగుబాటు చేయుదురని ఎవ్వ
రును ఎన్నడును కలలో కూడ తలంపలేదు. కాని స్వాతం
త్ర్యము లభించిన సంకర జాతులు మాత్రము తమ దుస్థితికి
లోలోన క్రుమ్ముచు ప్రతీకారము కొరకు అదను వేచి ఉన్న
మాట నిజము. క్రోధఘూర్ణితమగు ఆ ప్రజాసముద్రము పొంగి
నపో ఊరక పైపైని పోని మాటయు నిజమే !

ఆ ఆగస్టు మాసారంభమున ఒక చిత్రమైన కథ జరిగి
నా సుఖ స్వప్నములను కొంత భంగము కలిగించెను.

# 3

మా యింటికి కొంచెము దూరములో ఉన్న పొలముల
మధ్యగా ఒక సెలయేరు పారుచుండును. ఆ యేటియొడ్డున ఒక
చెట్లతోపు కలదు. దానిలో ఒక పూవుటీరముండెను. అది మా
మేరీ విహారకేళీ గృహము. అనుదినమును ఆ కన్య ప్రాతః
సాయంకాలములు అచ్చటికేగి, కొంచెము విశ్రమించి, శీతల
వాయు సుఖము ననుభవించి ఇలు చేరెడిది. నా మనోరథమే

ప్రియతమురాలికి ఇష్టమగుటను బట్టి ఆ ప్రదేశముపట్ల నాకును
పూజ్యభావమును జనించి, ప్రతి దినము ఉదయముననే మంచి
మంచి పుష్పములు సేకరించుకొని, ఆ పొదరిల్లునందలి రాతిపలక
మీద అమర్చివచ్చెడివాడను.

ఒకనాడు ఎప్పటివలెనే మేరీ అచ్చటి కేగునప్పటికి
నేను అమర్చివచ్చిన సురభిళ పుష్పము లన్నియు ఎవరో నేల
కొట్టిమొట్టి, ఆ పలక మీద బంతిపువ్వుల దొంతరలు అమర్చి
ఉంచిరి. ఆ బీభత్స దృశ్యమునే ఆమె భయముతోను జుగుప్స
తోను కంపించిపోయి, ఏమియు తోచక, నిలిచి యుండగానే,
ఆ ప్రక్క పొదలోనుండి ఎవరో సితారుతో మేళవించి ఒక పాట
పాడ దొడగెను. ఉద్విగ్నమానసయై ఉన్న ఆమెకు ఆపాట
ప్రత్యక్షరము వినరాలేదుగాని, అది స్పానిషు గీతమై
యుండుటయు, పల్లవి మేరీ నామాంకిత మగుటయు,
మాత్రము గోచరించెను. తన పేరు వినుట తోడనే ఆమె
మరింత భీతిజెంది, తొట్రుపడు అడుగులతో చెంగు
చెంగున నేనున్న చోటికి కేతెంచెను. ఈవృత్తాంతము వినగానే
అసూయా క్రోధములతో నిండిపోతిని. నాకు వెంటనే ఆ
నాడు నాతో కలహించిన సంకర జాతివానిపై అనుమానము
పొడమెను. మనస్సు కలత పడియుండగా వేగిరపడి ఏమియు
చేయరాదని నిదానించితిని మేరీని పరిపరి విధముల బుజ్జగిం
పుచు, "ఈ నాలుగు నాళ్ళు కొంచెము జాగ్రత్తగా నుండుము,
నేను కనిపెట్టియేయుందును, భయములేదు వివాహమయిన

క్షణము మొదలు ఈ నీదాసుడు నిన్నెడబాయనే బాయడు”
అని ధైర్యము చెప్పితిని. ఆ దురాత్ముడు ఇంకేమి సాహసము
తలపెట్టునో అను అనుమానముచే ఆ రాత్రి మేరీ పడకగది
సమీపమున, చెరకుతోటలో ఆయుధపాణినై పొంచి యుం
టిని. నేననుకొన్నంతయు జరిగినది. సరిగా నడిరేయి కాగానే
నా ప్రాణధనమున్న గది కిటికీ పొంత సితారు గీతము విన
వచ్చెను. కోపఘూర్ణమాన మానసుడనై కత్తిపిడి గట్టిగా పట్టు
కొనిచేతను గడెలు పెళపెళా విరుగ ద్రొక్కుకొనుచు కిటికీవద్ద
కేగుచుండగా, అతి మానుష బలుడెవ్వడో నన్ను తటాలున
ఒడిసిపట్టి, నేలపడద్రోసి, అదిమిపట్టి, నా హృదయమునకు
సూటిగా కత్తిజళిపించుచు, ఆ గాఢాంధకారమును చీల్చుదాత
ప్రభలుగా, మిణుమిణుకు గోలుసు నేత్రకాంతులను ఒప్ప, వికృత
హాసముచేయుచు, “దొరికితివి గా! దొరికితివి!” అని దీర్ఘ
నిశ్వాసపూర్వకముగా హుంకరించెను. భయము కంటె ఆశ్చ
ర్యమే యెక్కుడై బలమైన వాని పట్టువిడిపించుకొనుటకు
పెనగులాడుచుంటినే కాని, వాని కత్తిమొన అప్పటి కప్పుడే
నా దుస్తులను చీల్చుకొని పోవుచుండెను. ఇంతలో సితారు
నాదము నిను మా కయ్యపు సవ్వడిని ఉలికిపడి, నిద్రలేచిన
మేరీ కిటికీవద్ద తటాలున ప్రత్యక్షమాయెను. నా యెలుగును
గుర్తించియు, తళతళలాడు కత్తిని గాంచియు ఆమె భయ
సంభ్రమములతో కెవ్వున అరచెను. ఆ కేకతో నా ప్రాణ
ములు హరింపనున్న శత్రువుని చేయి అట్టే స్తంభించిపోయెను.
కాని పట్టు మాత్రము వదలక. ఏమి చేయుటకును తోచక

కాబోలు కత్తిమొన నా రొమ్మున దూరక ఆన్చియే యుండెను. ఒక రెప్పపాటు కాలమునుండి ఫ్రెంచి భాషలో "నా వల్లకాదు, నా వల్లకాదు ఆమెను దారుణవ్యథకు పాల్పరుపజాలను," అనుచు ఆ కత్తిని దూరముగా విసరివైచి, లేచి ఆ అంధకారమున అదృశ్యుడయ్యెను. నేను లేచి ఒడలు దులుపుకొని చూచునప్పటికి వాని నడ పొడ కానరాలేదు. చెదిరిన మనస్సును ఎట్టకేలకు కుదుటపరచుకొని ఆ అజ్ఞాతవైరిని తలపోసి క్రోధవివశుడనైతిని. 'వాడు నన్ను దయతలచి విడిచి ప్రాణదాతనయ్యెనే అని మరియు సిగ్గుపడితిని. నిజమునకు నాకు ప్రాణదానము చేసినది మేరీయే కాని వాడు కాదు. ఆమె కంఠస్వరమే వానిని పరిత్యక్తాయుధుని చేసెనని సమాధానపడితిని. అయినను చేజిక్కిన నన్ను చంపక విడిచి పుచ్చుటలో వాని ఔదార్యము మాత్రము స్పష్టమగుచునే యుండెను. ఇంతకును వీడెవ్వడైయుండునా యని మనసు పరి పరి విధములై పోవుచుండ ఎన్నియో అనుమానములు ఒకటి వెనుక ఒకటి పొడమి సమసిపోదొడగెను. ఆనాడు నాతో పోట్లాడిన సంకరుడైయుండునా వీడు? వానికీ జవసత్త్వము లెక్కడివి? అదియునుగాక వాని కంఠస్వరము వేరు. మీదు మిక్కిలి వీని ఊర్ధ్వకాయము అనాచ్ఛాదితము. ఇట్టివేషముతో బానిసలు మాత్రమే తిరుగుచుందురు. కాని వీడు బానిసెట్లగును? బానిసకెక్కడ? చేజిక్కిన శత్రువును విడిచిపుచ్చు మహోదార్యమెక్కడ? ఈ మీమాంస యంతయు అటులుండ, బానిసీడా నా మేరీని వలచినది! పాపము శాంతించుగాక!

ఇంతకును నా కర్తవ్యమేమి? ఇంకను నిదానించి చూడ
వలయుననియే నిశ్చయించుకొంటిని.

# 4

తల్లిచావు పిల్లయగు మేరీని రెండవ తల్లియై పెంచిన
దాదినికూడ అప్పుడు నిద్రలేపి ఆ రేయెల్ల మేము జాగరము
సల్పితిమి. మరునాడు ఈ వృత్తాంత మాలకించి మా
మామయు ఆశ్చర్య భరితుడాయెను. ఒక దాసమాత్రుడు
ఇంత పనిచేయ సాహసించునని అభిమానధనుడైయున్న ఆయన
నా వలెనే నమ్మజాలడయ్యెను. నాటినుండి మేరీని క్షణమై
నను విడిచి యుండవద్దని ఆ ముదుసలి దాదిని కట్టడిచేసి, రాజ
కీయ వ్యవహారములవల్లను, స్వకార్యముల వల్లను, తనకు
బొత్తుగా తీరమిచే, మేరీ ఇల్లువెడలునప్పుడెల్ల వెంట జనుటకు
నాకు ఆజ్ఞయొసగెను. ఆదురాత్ముడు ఇంకను చుట్టుపట్ల ఎచ్చట
నైన మసలుచుండునేమో అనెడి సందేహముచే, పొలిమేరల
యందు కనుగలిగి యుండుడని సేవకులను హెచ్చరించెను.
ఇన్ని విధముల అప్రమత్తులమై యుండియు, ఈ విషయము
ఇంతలో పోనీయక, కలరూపు తెలిసికొన వలెనని నేను గట్టిగా
సంకల్పించితిని.

ఆనాడు నదీతీర పూపుటీరమున కేగి అందలి శిలాస్త
రణమును యథాపూర్వకముగా పూవులచే అలంకరించితిని.
ఎప్పటివలెనే వేళకు బయలుదేరి మేరీ విహారార్థము అరుగు

చుండెను. నేనును పిస్తోలు సిద్ధము చేసికొని ఆమెవెంట అరిగి
తిని. దాని మూల వెనుక వచ్చుచుండెను. నేనాపర్ణశాలను
క్రొంగ్రొత్త చేసి వచ్చుట మేరీ యెరుగదు కావున ఆమె లోని
ప్రవేశింపగానే వెనుక నున్న నా వంక తిరిగి, 'లియోపాల్డ్ !
చూచితివా ? నా పూవు టేరసు నిన్నటి నుండియు నట్లే
యున్నది. చెల్లాచెదరై పడియున్న నీ పూవులును; వసివాడక
నేడే క్రొత్తగా గ్రుచ్చినట్లున్న ఈపాడు బంతి పూల దండయు
చూడుము. ఇంకను అట్లే ఉన్నవి." అని ముదలకించెను.
నివ్వెరపాటును కోపమును కుదుర్క నొంటిమై నేను మాటాడ
లేక పోతిని. నాడు ఉదయము గులాబీ పూలతో నే చేసిన అలం
కారమంతయు ధ్వంసమైనది. ఆ స్థానమున అనాటి బంతిపూల
దండ నవకములు కోరుచున్నది. నా చిడిముడి పాటును
గ్రహించి మేరీ "శాంతింపుము. ఆ దురాత్ముడు ఇంక ఈ
చక్కికి రాడు. ఇదిగో నేను నా పూలదండను వలె నీవు
నీ తలపును ఒక ప్రక్కకు త్రోసివేయుము." అని ఉపదేశిం
చెను.

పాపము ! ఆమెకుధూ ఆ ర్తుడు నేడును వచ్చెనని తెలి
యదు. 'పోనిమ్ము ! ఏల చెప్పవలెనని నేనును ఊరకుంటిని.
ఆ ముద్దరాలు కోపముతో నా పూలదండను నేలబెట్టి కసి
దీర తన చిన్నారి పాదములతో మట్టగించు నపుడు నాకు
చూడ ముచ్చటైనది.

మాయలమారియైన ఆ దుశ్శాత్రవుడు ఎన్నటికేని
వెంటబడక పోవునా అను ఆశతో నేను ఊరడిల్లి, మేరీని

కూర్చుండజేసి, నేనును దాదియు చెరి యొక వైపున కూర్చుంటిమి.

మేము కూర్చుండుటయే తడవుగా, చెంత పారెడి సెల యేటి రొదలతోను, పిల్ల తెమ్మెరల సన్నని స్వరములతోను, కలసి మంద మందముగా గీతారవ మొకటి వినవచ్చెను. ఆమె నా పెదవుల తన వ్రేలిడి "ఆలకింపుము" అని సౌజ్ఞ చేసెను. ఆలకింతును గదా—ఆగీతము గతరాత్రి నా కోపజ్వాల రగిల్చిన సితారు స్వరమే! "లియోపాల్డూ! తొందర పడకుము. వాడు పాటపాడును. దానిని నిదానముగా విని వాడెవడో ఎరుగుదము" అని ఆమె మెల్లగా అనెను.

ఇంతలో సితారుమీద ఒకటి రెండు స్వరములు పలికెను. పిమ్మట వనగర్భమునుండి కరుణారస తరంగితముగు ఈ స్పానిష్ పాట వెడలెను. నాటికిని నేటికిని అందలి ప్రత్యక్షరము నా స్మృతి ఫలకమున ముద్రితమై ఇప్పుడాలకించుచున్నటు లుండును.

గీ॥ భయమదేటి? నన్నుఁ గనినంతఁ బఱచెదట్లు
కలుఁగదో? నీ మనమ్ము నా గానమునకుఁ
దెలియఁగా రాదో నీకు? నా వలపుఁబేర్మి
రిత్త భీతిల్ల నేలె? మేరీ లతాంగి

వెలఁది ! తొలు సంజవేళ నీ వృక్షవాటి
స్వేచ్ఛ వాహ్యాళి సల్పు నీ విమల మూర్తిఁ
గాంచి లోఁజొక్కి "నను ధన్యుఁగా నొనర్పఁ
దరలి వచ్చెను వనదేవత" యనుకొందు.

చేయిజారిన నా రాజ్య సీమ నుండి
మింటఁ బఱతెంచి మున్నీటి మీఁద నెగురు
పులుఁగు పాటల కన్న నీపలుకుఁ దేనె
జాలు, నాకగుఁ గర్ణ రసాయనమ్ము !

కలిమి బలిమియు స్వేచ్ఛయుఁ గలుగు తొంటి
రాచరికమున కిప్పుడు నోచనైతి
కలికి ! నీ నోటిమాటయో కంటి చూపొ
వడసి నీ పాదములకు నప్పన మొసంగ !

అమల కాసార నీరమ్ము నందు వోలెఁ
బ్రియుని వీక్షణ వాహిని రేపు మాపు
స్నిగ్ధ సుచ్ఛాయ లీనుచు నిలిచియుందు
బాల కదళిక వోలె మేరీ లతాంగి !

తల్లి ప్రేళ్ళలోఁ దటువును బెల్లగించు
భీకరానిలమున నొక్క పెట్టు నిన్ను
గావు గొన వేచెడు నసూయగాంచనైతి
వెంత గోలవో ! మేరి ! నిన్నేమనందు,

దాఁచ నేటికిని విచుతు సత్యమ్ము వినుము
సర్వమును బాడు బీడయి సమయు వేళ
వెతలను దొలగించి నిన్ బ్రోచు వీరుఁ డెవఁడు
గలుగఁ బోడు సుమీ! రిత్తకాంక్ష లేల.

పాలరా దూపు దానవీ కాలవర్ణ
నేవగింతువు గాబోలు నెఱుక లేమిఁ
దెలియఁ బల్కెద వినుము, రాత్రిం బగళ్ళ
కలయికన్ బుట్టదే? యుషః కాంతి కాంత!

## 5

త్రుపకు సితారు మీఁద సుదీర్ఘమై దుఃఖగద్గదికమైన స్వరపాళితో ఆ పాట ముగిసెను.

కోపపరవశుఁడనైన నా అవస్థ ఏమని చెప్పను? కాలవర్ణుడట; పవిత్రమైన ఈ గీతార్థము చేత నా మనస్సున అసంబద్ధములైన భావము లెన్నియో పొడమెను. ఇది వలపు పాట. బెదిరింపు మాటలతో కూర్పబడినది. అందు మేరీ పవిత్ర నామము ముద్రితమై యున్నది. ఈ పాటను కూర్చి పాడిన ఆ ధూర్తుని సాహసమును తుదముట్టింపవలెననెడి తీవ్ర కాంక్ష నన్ను అలముకొనెను. క్రోధ విహ్వలమగు హస్తముతో పిస్తోలును పూని, శరవేగమున అరుగుచున్న నన్ను వారించుటకు మేరీ తన చేతులు అడ్డుచున్నను గైకొనక ఆ గీతము వెల్వడిన పొదలవైపు పరుగెత్తితిని. కాలి కడ్డమగు

చిరుపొదల నెల్ల పిస్తోలు మడిమతో ఓసరిల గొట్టుచు పెద్ద చెట్ల చాటున నక్కుచు ఆ చిట్టడవినెల్ల గాలించితిని.

ఎంత వెదకినను ఏమియు లేదు. ఆ వ్యర్థ ప్రయత్నము నా కోపాగ్నికి కట్టెలు దరికొల్పినది. అంతే! ఈ కావలుడు మాటిమాటికి భూతమువలె ఇట్లు జణిగిపోవలసినదేనా? వీడు నా చేతికి చిక్కడా? వీడెవ్వడో గుర్తించుటకుగాని, మార్కొనుటకుగాని నాకు శక్తి చాలదా? ఈ తలపులతో నా తలకు కైపెక్కియున్న స్థితిలో ఏదో మువ్వల మ్రోత వినవచ్చి పక్కకు తిరిగి జూతును గదా, విదూషకుడు హెబ్రిబా సాక్షాత్కరించెను.

"దండము సామీ!" అనుచు విప్పారిన మోముతో వాడు నావంక చూచెను. నా మోమున వ్రేలు విచారము వానికి కనువిందు చేసి యుండబోలును.

"శీఘ్రముగా జెప్పుము! ఈ ప్రాంతమున నీ వెవరినైన చూచితివా?" అని గద్దించితిని.

"మిమ్ముదక్క ఎవ్వరినీ చూడలేదు బాబూ!" అని వాడు శాంతముగా జవాబిచ్చెను.

"నీ వేమియు ధ్వని వినలేదా?"

ఎరిగియు చెప్పుటకు ఇష్టము లేని వానివలె వాడు మౌనము వహించి యూరకుండెను.

నాకు కోపము మితిమీరి "త్వరగా చెప్పుము! మూర్ఖుడా! త్వరగా! నీ వొక ధ్వని వింటివి, లేదా?" అని గర్జించితిని.

గుండ్రనైన చిన్ని కండ్లు జంగురుపిల్లి కండ్లవలె మెరయ వాడు ధైర్యముతో నావంక నిశ్చయముగా జూచుచు "ధ్వని వినలేదా? అనెదవు స్వామీ? ఏమిధ్వని? ఇచ్చట అన్నియు ధ్వనులే! పిట్టల ధ్వనులు, సెలయేటి ధ్వనులు, చెట్లతోపులలోని వాయుధ్వనులు——" అని ఏమేమో చెప్ప మొదలిడెను. నేను వాని మెడ పట్టుకుని కుదిపించుచును 'ఓరీ విదూషకహతకా! నీ చమత్కారములు కట్టిపెట్టుము, లేనిచో నా తుపాకి ధ్వనికూడా వినవలసి వచ్చును. నిజము చెప్పుము! ఒక స్పానిష్ పాట నీకు వినరాలేదా?" అంటిని.

"అదియా! దొరా! అయితే చిత్తగించండి. అంతయు చెప్పెదను. నా కుళ్ళాయిలోని చిరుగంటలు సలిపెడి మంతనములాలకించుచు, నేను అడవి వార తిరుగుచుండగా, ఏదో స్పానిష్ మాటలు పాటలుగా గాలివాలున నా చెవిని బడిన మాట నిజము. పది నెలల శిశువునై మా అమ్మ వీపుమీద జోలిలో నేను వ్రేలాడు చుండునప్పుడు ఆ భాష వినిన జ్ఞాపకము కద్దు. ఆ భాషపై నాకు ప్రీతిమెండు. నేడు ఈ పాట వినుటతోడనే నా చిన్నతనము జ్ఞప్తికివచ్చి, ఆదరముతో ఆలకించితిని. నేనప్పటికి నెలలు వెడలని పసిపాపనయ్యు, గుజ్జును గాను, పసివాడనే గాని విదూషకుడను గాను."

"ఇంతేనా నీవు చెప్పగలిగినది?" అని తత్తరముతో అడిగితిని.

"అవును నా చక్కని రాజా! నీకు కావలసినచో ఆ పాటగానిని కూడ తెలిపెదను."

ఈ మాటతో వానిని కౌగలించు కొనవలెనన్నంత వేడ్క జనించి, "చెప్పుము! చెప్పుము! ఇదిగో ఈ సొమ్ము చూడుము! ఇదేకాదు, దీనికి పదిరెట్లు ఒసగెదను. వాని పేరు మాత్రము చెప్పుము." అని ఆదరముతో అడిగితిని.

వాడా సొమ్ముగై కొని, లెక్క పెట్టుకొని, సంతసపడి, "దీనికి పదింతలా! అయినచో చాలసొమ్మే యగును! చిన్న బాబూ! తొందర పడకుము. మీకు అంతయు తెల్పెదను. వాని పాటలోని తుదిచరణము యొక్క అర్థము మీకు జ్ఞప్తి యున్నదా? 'నేను నల్లవాడను' నీవు తెల్లదానవు. మన కూటమిచే ఉషఃకాంతి ప్రభవించునని కదా వాడు పాడినది! ఈ మాటయే నిజమైనచో, నల్లదానికిని, తెల్లవానికిని పుట్టిన ఈ మిస్టా చరణదాసుడు హెబ్రిబా మీకన్న అందగాడు కావలసి వచ్చును. నేను రాత్రింబగళ్ళ సంతానముగావున తెల్లవాని కంటె అందగాడను" అనుచు కెకిలినవ్వ మొదలిడెను.

"ఇక నీ హాస్యములు చాలించి ఆ పాటగానిని ఎరిగింపుము !"

"అలాగే బాబూ! నా మాటలవలెనే వాడు పాడినదియు హాస్యపు పాటయే! ఆ పురుషుడు కూడా నా వలెనే విదూషకుడే! ఏమందురు? దీనికి పదింతల సొమ్ము అనుగ్రహింతురు కదూ ?"

వాని పొగరణచ వలెనని చేయెత్తితిని.

ఇంతలో మేరీ లతాగృహము వెననుండి ఆర్తనాదము వలె వినవచ్చెను. అది నా ప్రియతమ కంఠమే ! మరల ఏ

క్రొత్త ఉపద్రవము ఉత్పత్తిల్లెనోయని, శరవేగమున పరువిడి, రోజుకొనుచు ఆ గృహద్వారము చేరుసరికి నాకంట బడిన బీభత్సము ఏమి చెప్పను? పెద్ద కొండచిలువ ఒకటి ఆకు దడిలోనుండి తలదూర్చి, భయంకరమగు వెడద నోరువిప్పి, పర్ణశాలలోఉన్న సుదీర్ఘ దృఢశరీరుడగు ఒక నీగ్రో పడుచు వానిని కంబళింప నుండెను. వాడును మూర్ఛమునుగనున్న మేరీని పడిపోకుండ ఒక చేతపట్టుకొని, రెండవచేత ఒక త్రవ్వ గోలతో ఆ పాము నోటికోరల మధ్య పొడిచి అదిమి పట్టి ఉంచెను.ఆ బలశాలి పట్లు తప్పించుకొనుటకు ఆ పాముభయం కరముగా పెనగుచుండెను. ఇంతలో ద్వారమున నన్ను చూచి మేరీ వాని చేయివిడిపించుకొని సంతోషముతో "అమ్మయ్యా! బ్రతికితిని!" అనుచు నా చేతులవచ్చి వ్రాలెను.

తన సందిలి విడిపించుకొని నా సందిటవచ్చి వ్రాలిన మేరీ మాటకు ఆ నీగ్రో గిరుక్కున తిరిగిచూచెను. తనబాహు వులను రొమ్మున ముడుచుకొని,ఉత్తట దుఃఖపూరమైన చూపును నా ప్రియురాలిపై బరపుచు, త్రవ్వగోల పట్టుతప్పగానే తన్ను కంబళించుటకు మీదికి వచ్చుచున్న ఆ భీకరసర్పము నైనను సరకు జేయక నిశ్చలుడై అట్టేనిలచియుండెను. ఒక్క క్షణ మాలసించినచో, ఆ వీరుడు కడతేరెడి వాడే! ఎట్లో ఒక్క ప్రాణమును బిగబట్టుకొని ఈ సంఘటన నంతయు చూచు చున్న దాది ఒడిలో మేరీని కూర్చుండబెట్టి చరచర ఆ పాము చెంతకేగి, తెరచి ఉన్నదాని ముఖగహ్వరములోనికి నా తుపాకి ప్రేల్చితిని. అది వెనుకకుపడి నెత్తురోడుచున్న పెదవులు ఒక

మారు తెరచి ఒకమారు మూసుకొని కొట్టుకొనుచు కళ్ళు మూసుకొనెను. మరికొన్ని నిముషములకు వెల్లకిలబడి ప్రాణములు విడిచెను. ఆ నీగ్రో తన్నుకొనుచు ప్రాణములు విడుచు ఆ పామును ఒకకంటను, దాది ఒడినుండి నా కౌగిటకువచ్చి చేరిన మేరీని ఒక కంటను చూచుచు "దీని నేల చంపితివి?" అని నిరాశా సూచకముగా స్పానిషు భాషలో నన్ను ఉద్దేశించి పలికి, నేను సమాధానము చెప్పకమున్నె రివ్వున ఆ ప్రక్క పొదలోనికి దుమికి అదృశ్యుడాయెను.

# 6

భయానకమైన ఈ వృత్తాంతము, దాని విచిత్ర పరిణామము, శత్రువును కనిపట్టుటకు వివిధ భావసంఘటితమైన మనోవేదనతో అడవిలో నేనొనర్చిన వ్యర్థ పరిభ్రమణము—కారణములుగా నా మనస్సు చలించి తల తిరుగజొచ్చెను. నైవాను గ్రహమున మృత్యు ముఖమునుండి బయట పడితిననన్న మాట యేగాని, మేరీ ఇంకను ప్రమాదపడియే యుండెను. చాలసేపు దాకా కనుచూపులు, చేసన్న లేకాని, మేము ఒకరి నొకరు పలుకరించు కొనలేక పోతిమి.

ఆమె ప్రకృతిగత అగుటతోడనే నే నిట్లంటిని – "మేరీ! పోదము రమ్ము! మన మిచ్చట నిలువకూడదు. ఇందేదో అరిష్టమున్నట్లున్నది"

ఆమెయు నా మాటకొరకే ఎదురుచూచుచున్న దివోలె, లేచి నా బుజమును ఊతగాగొని మెల్లగా నడువజొచ్చెను.

"మృత్యువు ఆసన్నమైన సమయమున నీ ప్రాణరక్షణార్థము అవతరించిన ఆ బానిసను ఎరుగుదువా?" అని ఆమెను ప్రశ్నించితిని. (వాడు తాల్చిన ముతుక చెడ్డీనిబట్టి ఆతడు బానిసఅనియే నేను నమ్మితిని.)

"మా నాయనగారి దాసజన సహస్రమున వాడొకడై యుండెను. ఈ పొలములో ఏమూలనో పనిచేయుచు, నా ఆక్రోశముపిని పరుగిడివచ్చె కాబోలు. ఈ చేరువ పొదలో నుండి వాడు వచ్చుటమాత్రము నేను చూచితిని." అని ఆమె సమాధానము చెప్పెను.

"ఏ వైపునుండి వచ్చెను ?"

"పాట వినవచ్చిన దిక్కునకు నీవుపోతివి. దాని కెదురుగా నున్న దెస నుండి వాడువచ్చెను."

ఇందాకటి పాటయు, ఇప్పటి వీని మాటయు, ఒకే భాషలో నుండుటబట్టి వీడే కానోపునని ఊహించితిని, కాని వాడు వచ్చిన దిక్కునుగూర్చి మేరీ తెలిపిన వివరము నా ఊహకు కొంతవరకు భంగము కలిగించెను. అయినను నా అనుమానము బలపరచుటకు ఎన్నియో పోలికలు వీరిరువురకునుగలవు. మలచివైచి నటులున్న వీని భుజకండరములును, దీర్ఘకాయమును, గతరాత్రి నాతో పోరాడినవాడు వీడే అనుటకు పోషకములు. వీని ఊర్ధ్వకాయము అనాచ్ఛాదితమై ఉండుటయు దానికి ప్రోద్బలకము. అదియుగాక పాటగాడు 'నే నల్లవాడను' అనెను; వీడును నల్లవాడే! ఇది ఇంకొక తార్కాణము. అయితే, వాడు 'నేను దొరను' అనెను; వీడో బాని

నీడు! ఇచటనే సామ్యము సంభవించుట లేదు. కాని నీగ్రో జాతి లక్షణములన్నియు వీనికి పట్టియున్నను, వీని మూర్తి వైఖరిలో ఉదాత్తరేఖ గలదు. వాడు నా యెదుట నిలిచిన ఒక్క క్షణములోనే గ్రహింపగలిగితిని వాని నడకలోని గరువతనము, చతురస్రమైన అంగ సౌష్ఠవము, తలచుకొన్న కొలది 'వీడు దొరయే కానోపును' అనిపించినది. మరి, వీటిబోవుచున్న నా స్వాభిమానము మాటేమి? ఒక నీగ్రోజాతి నీచ సేవకుడా నా మేరీని వలపుచూపులు జూచి ఆమెపై పాటలు గట్టుట? ఎట్టి శిక్ష జేసిన ఈ దుర్వినీతుని అహంకారమునకు అనురూపముగా నుండును? ఈ తలపులో నాకు నిర్ణయము కుదరక, కోపమినుమడించి, మరల ఆ అజ్ఞాత వైరిపై ప్రసరించినది. ఇంతలో నా ప్రియతమురాలు నా మనోభరమును అపనయింపజాలిన మృదుమధుర సాధు వాక్యములతో ఇట్లనెను. "లియోపాల్డ్! మనమీ బానిస వానిని ఆరసి తెప్పించి, వాని ఋణము తీర్చవలెను. సమయమునకు వాడే లేనిచో, నీవు వచ్చునప్పటికి నేను లేకయే పోవుదానను."

ఈ మాటలతో వానిని పట్టుకొని పగదీర్చుకొనవలయు ననెడి నా దారుణ చింతనములు పటాపంచలై, వానిని ఎచట కనుగొందునా? వాని ఋణమెట్లు తీర్చుకొందునా? అను తహతహ పొడమెను. తన బానిసలలో ఒకడు బిడ్డప్రాణము కాపాడెనని విని, నా మామ వానిని దాస్యవిముక్తుని చేయుదునని బాసచేసెను.

# 7

పొలములో నీగ్రో బానిసలు పాటుపడుచుండ, అనివార్యమైన వారి దురవస్థ గాంచజాలక నేనా పొలముల వైపే పోయెడి వాడనుకాను. మా మామ ఆ మరునాడు పొలము పరామరికకు ఏగుచు నన్ను కూడ రమ్మనగా, మేరీ ప్రాణ దాత అందెచటనైనను కానవచ్చునను ఆశతో ఆయన వెంట వెళ్ళితిని. అచట దాసజనులెల్ల నా మామనుగాంచి గడగడ లాడుచు తమతమ పనులయందు ప్రవర్తిల్లుట చూచి యజమాని యనిన వీళ్ళకు సింహస్వప్నము గదా!' యని ఆశ్చర్య పోతిని. ఆయన సాన్నిధ్యమున ద్విగుణీకృతోత్సాహముతో ఒడలు విరుచుకొని పనిచేయు చుండియు, ఎడనెడ ఆయన మీద వాళ్ళు చాటుగా ప్రసరింపజేయు చురుకుచూపులు గాంచినపుడు వాళ్ళ హృదయములో యజమానియెడ ఎట్టి ద్వేషాగ్ని పొనుగుపడి రగులుచుండెనో నాకు తెల్లమయ్యెను. సహజ కోపస్వభావుడగు మా మామ తన కోపాగ్నికి ఇంధనము గావించుట కెవరును దొరుకక, చిటుబుసలాడు వేళ కనిపెట్టి, నీడవలె ఆయన వెన్నంటియున్న హెబ్రిబా, అచట ఒక పడుచువాడు అలసిసొలసి చెట్టునీడను పడియుండగా, ఇదియే సమయమని యజమానికి చూపెట్టెను. మా మామ తీవ్రమున అచటికిపోయి, ఆ బానిస త్రుళ్ళిపడునట్లు నిద్రలేపి 'పనిలోకిపొమ్మ' అని గర్జించెను.

పాపము ఆ దీనుడు ప్రాణము లెగిరిపోవుచుండ, తత్తర పాటుతో లేచుసరికి, వాడు పండుకొన్న చోటగల ఒక

గులాబిమొక్క నేలకొరిగి, నలిగి, రూపు మాసిపోయెను. అది మా మామ ప్రీతితో పెంచుకొన్న మొక్క!

మొదటే రగులుచున్న ఆయన కోపాగ్ని, దీనితో భగ్గుమనెను. "దొరా! నా దోసము సైరింపుము" అని కాళ్ళపై బడిన ఆదీనుని తన కోపమునకు ఆహుతిచేయ మామామ లోహరజ్జు నిర్మితమగు కొరడా పైకెత్తెను.

ఇంకను కొరడాదెబ్బ పడలేదు. ఈ జన్మలో మరపునకు రాని ఆ ముహూర్తమున—ఏమి చెప్పను—నేనెవరిని వెదకుచుంటినో ఆ స్త్రీయే క్రిందికి దిగుచున్న మామామ చేయి తటాలున బిగ్గబట్టి, "నీయెడల ద్రోహిని నేను. నన్ను కొట్టుము నా తమ్ముని విడువుము. ఈ గులాబిమొక్క చెరచుటయే కదా వీని దోసము!" అనెను.

మేరీ ప్రాణములు కాపాడి, ఆమెను నాకొసగిన ఈ మహోపకారి, ఇప్పుడిచ్చట మా మామకు అడ్డము పోచ్చుటయు, అప్పటి వాని వైఖరియు ధీరమైనవాని చూపును, సగర్వమగు ఆమాటతీరు, నాకు సంభ్రమాశ్చర్యములు, కలిగించెను.

తన అకారణ ఆగ్రహమునకు నొచ్చుకొనుటకు బదులుగా మామామ, "నన్ను వారించుటకు నీకేమి పని?" అని ఆ పురుషుని అదలించి, తలమున్కలగుచున్న దురాగ్రహము పట్టజాలక, వాని చేతి పట్టు విడిపించుకొనినోటికి వచ్చినట్లెల్ల తిట్టుచు, మరల ఆ మొదటి బానిసను శిక్షించుటకు కొరడాను పైకెత్తెను. ఉన్నతాకారుడగు ఆ పురుషుడు, ఇదికాదు పని

యని, ఆయనచేతి కొరడా బలవంతముగా లాగుకొని, ఇనుప కట్టుకట్టిఉన్న ఆ అధమ శిక్షాసాధనములు పుడకవలె విరిచి, నేలపైవైచి కాలమట్టెను.

వాని సాహసమునకు నేను నిశ్చేష్టితుడనైతిని. మా మామయు, కలలో కూడ అనుకొనని ఈ పరాభవముచే, వెలికి వెడలనున్న కనుగ్రుడ్లతో, కంపించు పెదవులతో, రూపెత్తిన ఆగ్రహమో యన ఆపాదమస్తకము వడవడ వణకుచు నిలిచెను.

ఆ పురుషుడు మా మామపై నిశ్చలదృష్టిని నిలిపి "ఇందు" అని తనచేత నున్న గండ్రగొడ్డలిని, అత్యుదాత్త భంగి సందించుచు "తెల్లవాడా! నన్ను కొట్టదలతువేని ఈ గొడ్డలి గైకొనుము" అనెను. క్రోధవివశుడగు నామాతులుడు వాని కోర్కె తీర్పనెంచి గొడ్డలి కై కొన చేయి సాచుచుండ నేనడ్డము పోయి, దానిని లాగికొని, చెంతనున్న నూతిలో విసరివైచితిని. "ఏమిపని చేసితివి?" అని మా మామ చుర చుర చూచెను.

"ఏమి పని చేసితినా? నీ పుత్రికా ప్రాణ రక్షకుని వధించి, నీవు ఆర్జించుకొననున్న మహాపాతకము నుండి రక్షించితిని. నీకు పుత్రభిక్ష పెట్టినదాత ఇతడే! వీనికే నీవు దాస్యమోక్ష మొసగుటకు మాట ఇచ్చినది."

నిజమునకు అది ఆ వాగ్దానమును జ్ఞప్తికి తేదగిన సమయము కాదు. పరువు పోయెనని రగిలి కుములుచున్న ఆ తరుణమున, నా సాంత్వనోక్తులు ఆయనయెడ ఏమిపని చేయును?

“దాస మోక్షణమా ? అవును. ఈ దాస్యమునుండి వీనిని విముక్తి చేయవలసినదే ! దాస్య విముక్తియట ! చూతువుగాని న్యాయస్థానమున వీనికి లభించు విముక్తి !!”

ఆయన బెదరింపులతో నా కాళ్ళు చల్లబడెను. పదపడి మేరీ వేడికొనియు ఆయన మనసు కరగింప జాలదాయెను. దీని కంతకును మూలకారణమైన ఆ మొదటి బానిసను దారుణ కశాఘాతముల చావమోది, ఈ రెండవ పురుషుని ‘గాలిఫెట్ కోట’ చెరసాలకు పంపిరి.

“తెల్లదొరపై చేయి చేసికొనెను” అని వానిపై నేరము మోపిరి.

ఇట్టి నేరమునకు తలగొట్టుట తప్ప అన్యదండనము లేదు.

# 8

పియారే యోజింపుడు. ఈ విచిత్ర వృత్తాంతముచే నా కెట్టి కుతూహలము జనించునో ? ఆ బంధితుని గూర్చి సాధ్యమైనంత వరకు విచారించితిని. ఎన్నియో విశేషములు తెలియ వచ్చెను. తోడి బానిసలకెల్లరకును ఈతడెంతేని పూజ్యుడట! తాను బానిసయయ్యు తక్కువ బానిసలను కనుసన్నల మెలపు నట ! ఆతడీ ప్రాంతముల జనించిన వాడుకాడట ! కొన్ని సంవత్సరముల క్రిందట బానిసల గొనివచ్చు ఓడ యొకటి వీని నా ద్వీపమున దింపిపోయెనట ! ఇది మరియు చిత్రము. ఈద్వీప వాసులగు బానిసలు ఆఫ్రికానుండి వచ్చిన వాళ్ళను కాంగో

లందురు. ఆ కాంగోలన్న వీళ్ళకు అసహ్యము. అట్టి కాంగో యెడ వీళ్ళు ఇట్టి భయభక్తులతో మెలగుట విశేషము కాదా?

ఈతడెప్పుడును నిరుత్సాహియై యుండునట. అట్టియ్యెనాతని మహాబలమును, బుద్ధి కౌశలమును పొలము పాటులో ఎంతేని ఉపకరించు చుండెనట. ఆతడు త్రిప్పినంత వేగముగా అంతసేపు బెల్లపు గానుగను గుఱ్ఱము కూడ త్రిప్పజాలదట. పదిమంది చేయవలసిన దానిని ఒక్కదినమున పూర్తిచేసి ఆ అలసులకు శిక్ష తప్పించెడి వాడట. ఈ కారణమున బానిసలకు ఆతనియెడ పూజ్యభావము కుదిరెను. కాని బానిసలీతని యెడ చూపు మన్నన, విదూషకుడగు హెబ్రిబాపట్ల చూపు భయభక్తులవంటిది కాదు.

ఇందు మరియొక చిత్రము కలదు. ఈతడు తోడి వారి యెడ నెంతేని అడకువ గలిగి, మృదుస్వభావుడై వర్తించునట. ఈ బానిసీలచే పనిచేయించుటకు వారిలోనే కొందరు మేస్త్రీలుందురు. ఈ నీగ్రో ఆ మేస్త్రీలను సరకు సేయక వారియెడ సగర్వముగ వర్తించునట. ఈ మేస్త్రీలది తేలు పెత్తనము వంటిది. వీళ్ళు దాస్య రజ్జువున మధ్య మధ్య నుండు ముడుల వంటివారు. తోటి బానిసలకు తలకుమించిన పనులు చెప్పి, వాళ్ళు బాధపడుచుండగా ఈ క్రూరులు సంతసించు చుందురు. కాని మేస్త్రీలీతని జోలికి వచ్చెడివారు కారు. ఒకవేళ సాహసించి యాతని శిక్షింప నెంచినచో 'ఆ శిక్షమాకు విధింపుడు' అని బానిసలెల్ల తమకు తాము ముందునకువచ్చి నిల్వరా?

ఈ వింత మనిషిని నీగ్రోలందరు "పీరటు" అనిపిల్తురు.

# 9

ఈ వృత్తాంతమెల్ల విని నా చేతమనస్సు ముగ్ధయయ్యెను. జాలియు, విశ్వాసమును తన్ను ప్రేరేప మేరీకూడ నన్ను ప్రోత్సహింప, కారాగారమున కేగి పీరటు నుద్ధరించుటకు చేతనైన యత్న మొనర్ప నిశ్చయించితిని. కాపు నగర మందలి భూస్వాములలో నెల్ల నామామ సంపన్నుడు గాన, నేను వయస్సున పిన్న నయ్యును సైన్యమున దళవాయినైతిని. అపుడు నా దళమును, మరియొక దళమును గాలిఫెటు దుర్గమును రక్షించుచుండెను. ఈ రెండవ దళమునకు నాయకుడు నాయందు విశ్వాసము గలవాడు. ఆతని సోదరుని నేనొకపరి కష్టసమయమున నాదుకొంటిని.

ఈ మాట వినుచునే శ్రోతలందరు "తాడ్యూసు కాబోలు" ననిరి.

అవును విర్రా యూహ నిజమే. కావుననే ఆ నీగ్రోను బంధించిన చీకటికొట్టు నాకు సులభ ప్రవేశయోగ్యమయ్యెను. దళవాయినగు నేను కోటలోని కేగుటకు అభ్యంతరము లేకున్నను, మా మామ యెచట అనుమానించిపోవునో అని మధ్యాహ్న మాతడు నిద్రించు సమయమును జూచి యరిగితిని. కావలివారు తక్క మిగిలిన సైనికు లెల్లరు నిద్రించుచుండిరి. కారాగార ద్వారముదనుక నాకు దారిచూపుటకు వెంట వచ్చి, ఉచితజ్ఞుడగు తాడ్యూసు అటనుండి వెనుక కేగెను.

ఉన్నతాకారుడగు ఆ నీగ్రో సక్కగనిలచినచో గది కప్పు నెత్తికి తగులుచుండును. నేలపై కూర్చుండియున్న ఆతనికి తోడొక పెద్దకుక్క పాదములచెంత పరుండెను. అది నన్ను గాంచి మొరుగుచు పైకిరాబోవ పీరట్టు 'రాస్కు' అని పిలచెను. అంత నది మరల నెప్పటియట్లు పండుకొనెను.

సోరణ కంతనుండి వచ్చుచున్న కొద్దిపాటి వెలుతురులో దళవాయి వేసమున నున్న నన్ను పీరట్టు, గురుతింప నేరక, "నేను సిద్ధముగనే యుంటి"నని నిష్కంపముగా వచించెను.

ఆ గది యందాతడు ఇచ్చ వచ్చినట్లు మసలుచుండుట గాంచి "నీకు సంకెళ్ళు వేయలేదా?" అని అడిగితిని.

"సంకెళ్ళా? ఇవిగో విరుగగొట్టితిని." అనుచు నచట దేనినో గలగలలాడ కాలదన్నెను. వాని యాప్రత్యుత్తరమున "నన్ను సంకెళ్ళు బంధింపజాలవు" అను ధ్వని స్ఫురించెను. "నీకు తోడుగా ఈ కుక్క నొకదానిని తెచ్చుకొననిచ్చిరే!" అంటిని. "లేదు. నేనే తెచ్చుకొంటిని" అని యాతడు బదులు పలికెను. వాని మాటలు విన్నకొలది నా కక్కజము మితి మీరి పోవుచుండెను. ద్వారమునకా! వెలుపల మూడు గడియలున్నవి. సోరణక్రంతయా! అర యడుగుకన్న వెడల్పు లేదు. పైగా, దానికి అడ్డముగ రెండు ఇనుప కమ్ములుకూడా నున్నవి.

నా ఆలోచనము లెల్లగ్రహించి ఆతడు లేచి, ఆసోరణక్రంత క్రిందనొక పెద్దరాతిని సులభముగా నూడబెరకి, అడ్డముగానున్న ఇనుపకమ్ములుతొలగింపగా, ఇరువురు మనుజులు

సులభముగా ప్రవేశింప దగిన పెద్ద రంధ్ర మచట నేర్పడెను. ఆ పెనుక్రంతకు నావల అరటితోటలును, కొబ్బరితోపులును కాన్పించుచుండెను.

అబ్బురపాటున నోటమాట వెడలక నే నచట నిలిచి యుండ, అపుడు నా మొగమున నించుక వెలుతురు పడెను. తోడనే ఆ బంధితుడు పాముపై ప్రమాదమున అడుగు వేసిన వానివలె ఉలికి పడుటయు, ఇంటికప్పు వాని శిరమునకు తగిలెను. విజాతీయములగు దయాద్వేషాశ్చర్య భావములు ముప్పిరిగొని వాని మొగమున తలచూపి పోయెను. కొంతవడి కాతడెట్లో నిబ్బరము దెచ్చుకొని. నన్ను మున్నెన్నడును ఎరుగని వానివోలె ప్రశాంత వీక్షణముల గాంచుచు —

"అన్నము లేకుండ నేనింక రెండు నాళ్ళు బ్రతకగలను" అనెను. నేనపుడు వానిమేను చాల కృశించి యుండుట గాంచి వెరగందితిని. మరల నాతడు "ఈ కుక్క నాచేతి యన్నముగాని తినదు. నేనా క్రంతను పెద్దది చేయనిచో, ఈ పాటికి రాస్కు కూడు లేక మరణించెడిది. నా కెట్లును మరణము తప్పదు. అదియైన బ్రదుకుట మేలుకదా! అనియెను.

"అదియేమి? నీవీ పస్తులతో చావనేల?" అని నేనడుగ దాని కాతడు విపరీతార్థము చేసికొని "అటులనే కానిమ్ము— ఈ పస్తులతో నింక రెండునాళ్లు బ్రతుక జాలియుందుగాని, దానికేమి? నేను సిద్ధమే. నేడైన రేపైన నా కొక్కటియే. రాస్కును మాత్రము బాధింపకుము." అనెను.

"నేను సిద్ధమే." అనుటలో అతని భావమేమో నాకప్పుడు తెలిసెను. తన యపరాధమునకు శిక్ష మరణమే గాన "నిన్నిప్పుడే చంపుదురు" అని నేను చెప్పవచ్చితిని నని వాని యూహ. తప్పించుకొను దారు లన్నియు తన కనులముందు కన్పడు చున్నను, అమానుష బలుడగు ఆ పురుషుడు పసిబిడ్డవలె "నేను సిద్ధమే" అని ప్రశాంతముగా పలికి, "రాస్కను మాత్రము బాధింపకుడు" అని మరియొకసారి వచించెను.

నేనింక తాళజాలక 'ఏమది? నేనునిన్ను చంప వచ్చితి నని యెంచినది చాలక, ఏ పాపమెరుగని ఈ కుక్కను గూడ నేను హింసింతునని తలచుచుంటివా! నన్నంత క్రూరకర్మునిగా నెంచు చుంటివా?' అంటిని.

అంత నాతడించుక ప్రసన్నుడై, నా దెసకు ఉపచార హస్తమును జాచి, గొణ్కొంచుక గద్గదికమగు స్వరముతో "తెల్లవాడా! నన్ను మన్నింపుము. మీజాతి నన్ను క్రూర ముగా హింసించెను. ఆ కుక్కపై నాకు ప్రాణముసుమా!" అనెను.

నేను వాని హస్తమును గ్రహించితిని. వానిని కౌగిట జేర్చుకొంటిని. వాని యనుమానము బాపుట కేమేమియో చేసితిని. 'నీవు నన్నెరుగవా?' అంటిని. "ఎరుగ కేమి ? నీవు తెల్లవాడవు. నీగ్రోలు మీ దృష్టిలో నలుసులును గాగు. అదియునుగాక నీవు నాకు అపకారివి." అనియెను.

"ఎట్లు?" అని నే నక్కజపడి యడిగితిని.

"నన్ను రెండుసార్లు రక్షించలేదా నీవు ?"

నాపై మోపిన ఈ వింత యపరాధమునకు నాకు నవ్వు వచ్చెను. అత డది గ్రహించి, మోమున వెడనగవు దోప నిట్లనియె "అవును, నేనది యెరుగక పోలేదు. మొదటి సారి కొండచిలువ నోటినుండి, రెండవసారి క్రూరుడగు క్షేత్రస్వామి బారినుండి నన్ను గాచి, నీపై పగబూనుటకు వీలు లేకుండ చేసి, నన్ను దురవస్థపాలు చేసితివి"

అతని మాటలు, భావములు నాకు పరిచితములై యిక వింతగా దోచుటలేదు. అవి యూతని కనురూపములు.

"నీ కంటె నధికముగా నేనే నీకు ఋణపడి యుంటిని. నా ప్రియురాలు మేరీకి ప్రాణము లొసగిన దాతవు నీవు" అని నే ననగ, నత డీ మాటకు ఉలిక్కిపడి పిడుగడచినట్లాయె, తేరుకొని వడవడ వణకుచు, దోయిట మొగము చేర్చి, దీర్ఘ నిశ్వాస పూర్వకముగ వెక్కుచు, డగ్గుత్తికతోచు నెలుగున "నీ ప్రియురాలు మేరీ" అని కాకుస్వరముగా ననెను.

దాచనేల దీనితో మరల నా వెనుకటి యనుమానము తల చూప దొడగెను. అట్లయ్యు వానిపై నాకు కోపముగాని అసూయగాని రాలేదు. భూతల స్వర్గ ద్వారమున నిల్చి యున్ననాకు, మృత్యు ముఖమున సగము ప్రవేశించిన వాని పై నసూయ యేల? అగతికుడై శోచనీయ దురవస్థా సముద్ర మున మునిగి కనికరింప దగియున్న వానిపై నసూయ యెట్లు పొడమును ?

ఎట్టకేలకు వాడు మొగమెత్తి "పొమ్ము నా యుపకా

రము నుగడింపకుము" అని, ఒకించుక తాళి "ఇంతకును అభిజాత్యమున నేను నీకు తీసిపోను సుమా!" అనెను.

ఈ తుదివాక్యము వలన నాకు అతి కుతూహలము జనించి వాని కులీనతాదికమును వివరముగా చెప్పుమని ఎంత గ్రుచ్చి యడిగినను, వాడు మరల మాటాడడయ్యె. నేను చూపిన ప్రేమాదరములచే వాని మనస్సు కరగెను. నా అనునయ వాక్యములచే వానికి మరల బ్రతుకుపై తీపి పొడమెను.

నేను చూచుచుండగనే, వాడా పెద్దరంధ్రము గుండ వెలుపలికేగి ఒక అరటిపండ్ల యత్తమును, పెద్ద కొబ్బరి కాయయు పుచ్చుకొని; అక్కడ నున్నట్టుగా తిరిగివచ్చి ఇనుప కమ్ములతో మరల ఆదారిని మూసి ఆ ఫలముల తిన దొడగెను.

వాడు ఫ్రెంచి స్పానిషు భాషలు రెండును ధారాళముగ మాటలాడ గలడనియు, చదువుకున్న వాడేకాని వ్యర్థుడు కాడనియు మా ప్రసంగములో గ్రహించితిని. ఇంతే కాదు, వానికెన్నియో స్పానిషు పాటలు కూడ వచ్చును. వాని నన్నిటిని రక్తిగా పాడగలడు.

ఏమైన నేమి, వాని చరిత్ర మాత్రము దురవగాహము. ఈ వ్యూహమును భేదించుటకు దారిలేదు. వాడా కిటుకు చెప్పడు. "సాధ్యమైనంత వరకు వాని యిచ్చవచ్చినట్లు వర్తింపనిండు" అని నా మిత్రుడగు తాడ్యూసుతో నొక్కి చెప్పి, యెట్టకేలకు విచారముతో పీరటును వీడ్కొంటిని.

# 10

నాడు మొదలు ప్రతి దినమదే వేళకు వానిని చూడ బోయెడివాడను. 'వానిని క్షమింపు'మని యెంత వేడికొన్నను మా మామ నా మాట మన్నింపనందున పీరటు స్థితిని గూర్చి నాకు కళవళపాటు మెండయ్యెను. సంగతి సందర్భము లిట్లున్న వని వానితో చెప్పవాడను విననియట్లుండునే కాని చెవి యొగ్గి ఆలకించెడివాడు కాడు. ఒక్కొక్కనాడు రాస్కు బైటికిపోయి మెడలో నొక తాటాకు చీటితో యజమాని చెంతకు తిరిగిరాగా, వాడా చీటీని విప్పి చదువుకొని చించి వేయును. ఈ రహస్య విషయములను గూర్చి నేనెన్నడును వాని నడుగలేదు. అవి తెలిసికొన వలెనని నాకు వేడ్కయు లేదు.

ఒకనాడు నేను వెళ్ళునప్పటికి, పీరటు, అటుమొగమై డిందుపడిన మనస్సుతో, 'సరఫరా సేతుచాటుగా సరకు లేను" అను స్పానిషు పాటను ఈలవేయుచుండెను. నేనా స్వర మాలకించుచు వెనుక ప్రక్క నట్టే నిలిచి యుంటిని. కొంత సేపటి కాతడీల చాలించి, తటాలున వెనుకకు తిరిగి, నన్ను గాంచి "తమ్ముడా! నీవెప్పుడైన నన్ను అనుమానింతువేని నేనీ పాట పాడుట విన్నతోడనే ఆ యనుమానమును వీడుదు నని నాకు మాట యిమ్ము." అని పొచ్చము లేక వేడెను.

"నీ వెపుడైన నన్ననుమానింతు వేని" అను మాటలు వాడు ఊది పలికినను, నేనది గమనింపకయే, 'అట్లే' యని

వాగ్దాన మొనర్చితిని. వాడును సంతసించి, ఒక కొబ్బరికాయ డిప్ప కల్లుతో నింపి, "నీవు యెంగిలి చేసి యిమ్ము" అని వేడి, పుచ్చుకొని, ఆ కల్లంతయు నొక్క గ్రుక్కను త్రావి, "నీవు నాకు తమ్ముడవు" అని నాటినుండి నన్నట్లే పిలువ దొడగెను.

కూతురు పెండ్లి మహా వైభవముగా చేయవలయునని మా మామ యేమేమో సన్నాహములొనర్ప సమకట్టెను. ఆ సంతోషములో ఆయన కోప తాపము లొకింత ఉపశమించుట గాంచి, ఇదే అదనని, మేరీయు, నేనును అతని మాటిమాటికి పీరటు నేరమును మన్నింపుమని వేడ జొచ్చితిమి. "పీరటుకు మిమ్ము అవమానించు తలంపు లేదు. తోడి ప్రాణి బాధ పడుట చూచి సహింపలేక, లోకము వాడి ననుసరించి మీ చేతి కడ్డము వచ్చెనే గాని వేరొకటి కాదు. అత డెట్టి వాడైనను అగుగాక, నీ బిడ్డను సర్ప ముఖమునుండి ప్రోచెనా లేదా? మనకది చాలదా? అదియును గాక, మన పనివారిలో వానికి ఈడైన బలశాలి లేడుగదా! వాడొక్కడు పదిమంది పెట్టు. ఒంటిచేతితో బెల్లపుగానుగను అవలీలగా త్రిప్పగలడు. మన లాభం విచారించియైనను అట్టివానిని పోగొట్టుకొనుట మంచిదికాదు." అనుచు అప్పటప్పటికి నాకు తోచిన యుక్తులెల్ల సమయోచితముగా చెప్పుచు రాగా, ఎట్టకేలకు ఆయన మనసు మెత్తపడి, ఒకటి రెండుమారులు 'నాకును వానిని సాధింపవలెనని లేదు' అనెను. ఆయనచే ఆ మాట యనిపించుకొనిన మీదట పీరటున కిక ప్రాణ భయము లేదని నా మనస్సు కుదుటబడెను.

నేను చేయు ఈ ప్రయత్నములు పీరటున కించుకయు తెలియవు. ప్రయత్నము ఫలోన్ముఖమైన పిమ్మటకూడా ఆతనికి నేనివి సుంతయును చెప్పనైతిని. అంతయు పరిపక్వమైన పిమ్మటనే ఈ శుభవార్త వినిపించి చేతులార వానిని విడిచి పుచ్చవలయునని నా ఆశ.

తనకు మరణశిక్ష తప్పదని నిశ్చయముగా నెరిగియును, తప్పించుకొని పోవుటకు మార్గమును, శక్తియు నుండియును, ఆత డట్టి పూన్కికి జొరకుండుట మాత్రము మిగుల చిత్రము. ఒకమారు వాని నీవిషయమున కదలించితిని. ఆతడు "పారి పోయిన పిరికి వాడందురని నాకు నేనై యిందుంటిని" అని ఒక మాటలో సమాధాన మొసగెను.

# 11

పవిత్ర ప్రణయ జనిత మాధుర్యము కంటెను మధుర తరమైన ముఖ వికాసముతో ఆనందోల్లాసినియై, మేరీ ఒక నాటి ఉదయము చెంగు చెంగున నేనున్న యెడకు వచ్చెను. ఆమె కేదియో శుభవార్త తెలిసెనని మోము చెప్పకయే చెప్పుచుండెను. "వింటివా? పెండ్లి యింక మూడు నాళ్ళున్నది. అనంతరము మనము—" అని ఆమె అనుచుండగా అర్థోక్తిలో నేను "మేరీ! అప్పుడే అనంతర మనుచున్నావు, ఇంకనుమూడునాళ్లు గడుపవలెనుగదా!" అంటిని. ఆమె చెక్కులు లజ్జకెంపులు జాజువార చిరునవ్వు నవ్వి "లియొపాల్డ్! నీ యమంగళోక్తులు మాని, నా సంతోషకారణమును

వినుము, చెప్పెదను. వివాహాలంకారములు కొనుటకు నాన్నయు నేను నిన్న పట్టణమున కేగితిమి. నీకు ప్రియమని నేను నగలు ధరింతునుగాని, నిజమునకు నాకీ నగలన్నియు నాడు ఆ బంతిపూల వెడమానిసి విటతాటన మొనర్చిన నీ పూలదండలోని ఒక్క పూవుపాటి సేయవు. ఇంతకు నేను చెప్పవచ్చిన దేమన, నాన్న నీకేమి కావలయునో చూచుకొమ్మని అడిగెను. నేను చూచిన వాటిలో నెల్ల సరిగపని చేసిన వెలగల చీనాంబర మొకటి నామతి నత్యంతము చూరగొనుట నాన్న కనిపెట్టెను. ఇంటికి మరలి వచ్చునప్పుడు 'నాన్నా! తొల్లింటి రోజులవలె నాకు వివాహావసరమున నేమైన ముద్దు చెల్లింపవా?' అని అడిగితిని. ఎరుగుదువుగా మా నాన్న సంగతి! పూర్వపు రోజులతో పోల్చినచో ఆతడెంతో ఉబ్బిపోవును. నేనా చీనాంబరమును కోరుదును కాబోలు ననుకొని 'నీవేమి కోరినను ఇచ్చెదను' అని మాట యిచ్చెను. ఇపుడు తెలిసెనా? నీకు, నే వేడబోవునది యేమో, పీరటు ప్రాణము—" అనుచుండగనే నేను సంతసము పట్టజాలక మేరీని కౌగిట చేర్చుకొంటిని. నా మామ మాట యన్నచో తిరుగడని నాకు నమ్మకమే గాన, మేరీని అమె ముద్దు వేడికొన జనకుని కడకంపి, ఈ శుభవార్త తెలుపుటకు పీరటు చెంత కేగితిని.

కారాగారమున నడుగుపెట్టుచునే "అన్నా! బ్రతికితివి, మేరీ పెండ్లిముద్దుగా జనకుని నీ ప్రాణదానము వేడి గ్రహించినది." అంటిని. మేనెల్ల నాపాదమస్తకము వడంక నాతడు

'మేరీ—పెండ్లి—నా ప్రాణము! ఈ మాటలకు పరస్పర సంబంధ మేమి?' యని యడిగెను.

"నీ కర్థము కాలేదా? నీవు రక్షించిన మేరీకి పెండ్లి కానున్నది"

"ఎవరితో?" అని యాతడు మొగము జేవురింప నుచ్చైస్స్వరమున నడిగెను.

"ఆమెను నాకీయ నిశ్చయించినది నీ వెరుగవా?" అంటిని. ఆతడు మరల నెప్పటి భంగియై 'అవును నిజమే. పెండ్లి యెప్పుడు?' అనెను.

"ఆగస్టు 22వ దినమున"

"ఆగస్టు 22 నాడా! మీ కేమి మతిపోయినదా?" అను నప్పుడు భయోద్వేగమును ఆతని మొగము చెప్పక చెప్పు చుండెను. ఆ మాట పలికి ఆత డూరకొనియెను. నేనాతనివంక నచ్చెరువుతో చూచుచుంటిని. కొంతవడి కాతడు నా కేలు తన కేల గీలించి "తమ్ముడా! నీవు నా ప్రాణదాతవు కావున నీకు చెప్పుచున్నాను. నా హితము వినుము. మీ రిట కదలి 'కాపు' నగరము ప్రవేశింపుడు. 22వ నాటికి మున్నే వివాహము చేసి కొనుడు" అనెను.

నే నెంత ప్రార్థించియు నాతని వలన ఈ మాటల కర్థము గ్రహింపజాలనైతిని.

పిమ్మట నాతడు గంభీర భావమున నిట్లనియెను, "నాకింక సెలవిమ్ము. మేలు మఱచుట అకృతమాడుటకన్న ఘోరపాపమని యెంచి నే నిప్పటికే నోరు జారితిని."

నేనటనుండి వ్యాకులిత మనస్కుడనై యిల్లు చేరి, అచిరభావియగు పెండ్లి సందడిలో బడి, ఇదియెల్ల మరచి పోతిని. పీరటుపై మోపిన నేరమును ఆనాడే మా మామ ఉపసంహరించుకొనెను. నేను చేతులారా పీరటును విడిచి పుచ్చి వేఱ్ఱ సందడింప కోటలోని కేగితిని. నారాక గాంచి తాడ్యూసుకూడా వెంటరాగా ఇరువురము ఆ చీకటిగది కేగితిమి. కాని, ఆత డేడి! రాస్కు మాత్రము తోక ఆడించుచు నాచెంతకు వచ్చెను. దాని మెడకొక తాటియాకు చీటీ కలదు. అందిట్లు వ్రాసి యున్నది.

"సెలవు. మూడవమారుకూడ నన్ను రక్షించితివి. మిత్రుడా! నీ వాగ్దానము మాత్రము మరువకుము." క్రింద చేవ్రాలునకు బదు లీ వాక్యమున్నది. "సరఫరా సేతుచాటుగా సరకు లేను."

సోరణక్రంత పెద్దది యగుట యెరుగని తాడ్యూసు, నా కన్న నెక్కుడుగ ఆశ్చర్యపడ జొచ్చెను. ఆ నీగ్రో పర కాయప్రవేశ విద్యచే ఈ కుక్కగా మారెననియే ఆతని నమ్మకము. అందలి రహస్య మేమియు నేను తాడ్యూసుతో చెప్పక, మా కనులబడిన యీ వింత 'నెవ్వరితోడను చెప్ప'నని యాతనిచే ననిపించుకొని బయలు దేరితిని. రాస్కును నావెంట గొంపోదలచితిని గాని, అది కోట దాటగనే ఏ పొదల చాటుననో మాయమయ్యెను.

# 12

కారాగారము నందలి నీగ్రో మాయమయ్యెనని విని
నా మాతులుడు మండిపడి "అంతటను గాలించి పీరటును
బట్టుకొని మీా యిచ్ఛవచ్చినట్టుల సేయు"డని గవర్నరుకు
విన్నవించెను.

ఆగస్టు 22వ దినముననే "ఆకల్" నగరపు 'చర్చి'లో
మా వివాహము సమస్త వైభవములతో జరిగెను.
మావిపత్సముద్రమునకీవలిగొడ్డు అనదగు ఆ దినమెంత శుభా
రంభము! మా కానాడెంత వేడుకగా ప్రొద్దు గడచినది.
నిరతిశయ సౌఖ్యామృతపానమత్త చిత్తుడనగు నాకు
పీరటుగాని అతని హింసోపదశముగాని తలఁపునకు రా లేదు.

ఎట్టకేల కానాడు ప్రొద్దు క్రుంకినది. నాయర్ధాంగి
శయ్యాగృహమున కరిగెను. వెంటనే నేను ఆమె ననుగమిం
చుటకు నా ఉద్యోగ ధర్మము అడ్డము వచ్చెను. ద్వీపమున
నందందు నీగ్రోలు యజమానులపై తిరుగబడుటయు వాళ్ళ
నెల్ల వెనువెంటనే యజమానులు అణచివేయుటయు సామాన్య
వృత్త మగుచుండెను గాన, ఎటుపోయి ఎటు వచ్చునో యని
మా పుర రక్షణార్థ మొక దళము నేర్పరిచిరి. దళవాయినగు
నేను ఆ సైనికులనెల్ల నా రాత్రి యొకపరి చూచి తగు రీతి
కట్టడ యొనర్చుట యవసరమయ్యెను. అందరికన్న ముందు
మా మామయే నా కీ విషయ మాదకుదెచ్చి "వెళ్ళిరమ్మ"ని
చెప్పెను. విధిలేక, సముచిత వేషమున నప్పుడే యిల్లు వెడలి
పోతిని. మొదటి రెండు ప్రహరులకడను విశేష మేమియు

వినరాలేదు. తక్కిన ప్రహరులుగూడ పరిశీలించుచు అర్ధ
రాత్రముదనక అనుగూయి వర్గముతో నేను సముద్రతీరమున
ఆ రక్షకుడనై పెక్క తలంపులతో మునిగి అటునిటు పరి
క్రమించుచుంటిని. అంతలో దూరమున "మోరిను" దిక్కున
పెద్దవెలుగు కానవచ్చెను, ఏ చిట్టడివికో అవుసు దుబ్బులకో
నిప్పంటుకొని యుండునని నా వెంటనున్న వార లూహించిరి.
కాని చూచుచుండగనే ఆ మంటలు పెద్దవియై, గాలికూడ
తోడై, పెద్దపొగలు వెడలి నలుదెసలు క్రమ్మెను. ఏదో
గొప్ప ప్రమాదమే వచ్చినదని యెంచి, కోటలోనివారిని
హెచ్చరించుటకును, కొందరి సైనికులను మోరిను వారికి
బాసటగా నంపుటకు నేను కోటకు మరలితిని.

మా కమతములో పనిసేయు నీగ్రోల గూడెము నేను
వెళ్ళు దారియందే కలదు. వాళ్ళ గుడిసెలలో నేదియో అలజడి
సాగెను. ఏ కొలది మందియో తప్ప తక్కిన వాళ్ళందరు ఆరు
బయట గుంపులుగూడి ఏదియో రాచకార్యము సలుపుచుండిరి.
మాకు అర్ధముకాని వాళ్ళభాషలో 'బగ్ జార్గల్' 'బగ్ జార్గల్'
అను వింతమాట పూజ్యభావముతో పలుమారు లుచ్చరింప
బడుచుండెను. ఉత్తర ప్రాంతము లందలి నీగ్రో లెల్లరు తిరుగ
బడిరనియు, కాపు నగరమునకు ఆవలనున్న తోటలలోని
తెల్లవాళ్ళ ఇళ్ళన్నియు తగులబెట్టిరనియు, తోటలు, దొడ్లు
ధ్వంసము చేసిరని ఒకటి రెండు మాటల యర్థము నాకు
స్ఫురించెను.

ఆవల మరికొంత దూర మేగగా అవుసు దుబ్బులలో

వారు దాచుకొనిన గండ్రగొడ్డళ్ళు మున్నగు ఆయుధములు కుప్పగూరలై కాన్పించెను. ఏమి మునిగినదో, ఇంకేమి మునుగ నున్నదో అని నాకు అనుమానము భీతియు పుట్టె. 'ఆకల్' నగర సైనికులతో సర్వ సన్నాహముగా నుండుమని నా లెఫ్టినెంటుకు ఆనతిచ్చితిని. నా రాకకై శయ్యాగృహమున ఎదురు తెన్నులు చూచుచున్న మేరీని దగనాడి రాష్ట్రసభా సభ్యుడగు నా మామ ఆనతి శిరసావహించి నేనంతట కొద్దిమంది భటులను గూర్చుకొని కాపు నగరము దారి పట్టితిని. నగరము సమీపించు సరికి నాకు ప్రత్యక్షమైన ఆ బీభత్స దర్శనము ఈ జన్మమున మరపునకు రాదు. నగరము చుట్టునున్న తోటల బూదిగొని అగ్నిభస్మము చేయుచుండగా ఆకాశమంటు తజ్జ్వాలలు నాలుకలు గ్రోయుచు పురమును గూడ కబళింప బరతేర, పవనోద్ధూతములైన ధూమ పుంజములు వీధులను అంధకార బంధురముగా నొనర్ప, భటచ్ఛటాయమానముగా దగ్ధమగుచున్న చెరకు కుప్పలనుండి లేచు విస్ఫులింగ వ్రాతములు ఇండ్లపై అగ్నివర్షమువలె కురియుచుండ, కాపునగరలక్ష్మి ప్రాణములరచేత బట్టుకొని, ఉత్తరక్షణ స్థితి ఎట్లులుండునో యని తల్లడిల్లుచుండెను. తమ సర్వస్వము నశించినను తల దాచుకొనుటకు కొంపలైన దక్కునేమో అన్న ఆశచే ప్రాణములకైన తెగించి తద్రక్షణోపాయ చింతచే వేదురు గొన్నట్లు అటునిటు పరువులెత్తు పౌరుల హాహాకారములును, తమ గతియు నట్టిదగా వగచి జ్వాలాశోణముగు సముద్ర జలమును పరచు నావల తొట్రుపాటును చిత్తక్షోభ కలిగించెను.

# 13

కోటలో అనుక్షణము ప్రేలుచున్న ఫిరంగుల మ్రోతలకు ప్రాణ రక్షణార్థము పలాయమానులగు దీనుల ఆర్తనాదములకు, దూరమున ఫెళఫెళా రావములతో విరిగి కూలు ఇండ్ల చప్పుళ్ళకు నాకు దిగ్భ్రమ జనించి నిల్చితిని. ఇంతలో నగర చతుష్పథమున సైనికోద్యోగి యొకడు ఎదురుపడి "తిన్నగా గవర్నరు కడకు బొమ్మ"ని నాకు త్రోవజూపెను. నాటి కాపు నగర దుర్దశను మహాశిల్పులు రక్తవర్ణముతో చిత్రించియే యున్నారు. నేను దానిని తడవజాలను. తక్కిన కథా భాగమును మాత్రము చెప్పెదను వినుడు.

విప్లవకులగు నీగ్రోలు అప్పటికప్పుడే చుట్టుపట్ల అనేక గ్రామములను దహించిరి. వాటిలో 'లింబీ' గ్రామము నందలి అపురూపములగు తోటలన్నియు రూపు మాసినవి. లింబీ నాకు పొలిమేరనే యున్నది. దాని నాశనము విని నా మనసు చెదిరిపోయి, ఒక్క పరుగున గవర్నరున్న రాజభవనమున కేగితిని.

అచట గవర్నరును, అమాత్యులును, రాష్ట్ర సభాసభ్యులును, సేనాపతియును, ఇంకెందరో క్షేత్రస్వాములును జేరి కర్తవ్య నిర్ణయమున నేకీభావము కుదరక తలపట్లు పట్టుకొనుచుండిరి.

అందొక రాష్ట్రసభ్యుడు గవర్నరుతో "చిత్తము. ఈ యాగడమంతయు నీగ్రో బానిసలదే కాని, స్వతంత్రులగు సంకీర్ణుల కిందు నించుకయు జోక్యమే లేదు. ఇంతకు

మున్నెన్నియో పర్యాయము లీ విషయము నేలినవారికి విన్నవించియే యుంటిమి” అనుచుండెను.

గవర్నరు సభలోని సభ్యుడొకడు ఈ మాటల కుడికిలి “మీ మందరము నిద్రించుచున్నట్లు, మీరేమో దూర దృష్టి గల వారైనట్లు మెప్పుకొరకు చెప్పుమాటలేగాని, యివి మీరు మనసా నమ్మినవి కావు. వెనుకకు ఒకపరి యిట్లే పుట్టి మునిగిపోవుచున్నదని యెంతయో గందరగోళము చేసి మూడువేల బొనిసలు తిరుగబడిరని చెప్పితిరి. తుదకేమైనది ? ఒక్క అల్పసైనికుని మరణముతో సంతియు ప్రహసనముగా పరిణమించుట ఎవ్వరెరుగరు?” అనెను.

మొదటి రాష్ట్రి సభ్యుడు మరల “మీరు వేయి చెప్పుడు. ఎప్పటికప్పుడు బొనిసల స్థితిగతులు దగ్గరనుండి పరిశీలించునది మేము; ఎప్పుడును సభా భవనమున కూర్చుండి వెఱ్ఱి మొఱ్ఱి శాసనములు నిర్మించువారు మీరు. మా దూర దృష్టి మీ కేటులుండును ? అని బదులు పలికెను.

దానిపై రెండవ యాతడు “మీ మాటల కేమి ? ప్రజలందరు మిమ్ము మరల ఈ సభకు నిస్సంశయముగా నెన్నుకొనుటయే మా రాజనీతి సంపదకు ప్రబల సాక్ష్యము” అని తృణీకరించెను.

“కాదామరి? త్రివర్ణ శిరోవేష్టనమును ధరించ లేదని ఆ నిర్భాగ్యుని తుపాకుల్చంపించిన మీ రాజనీతిసామాన్యమా?”

“ఎందుల కీ యసత్యములు ? రాజనీతి విషయమున మన కీ భేదములు మొదటినుండియు నున్నవే”

"అటులనా! దారికిరండు మరి, తాము, 'స్వతంత్ర' పక్షమువారా!"

"అట్లయిన మీరు 'శ్వేత శిరస్త్రాణ పక్షము' వారు కాబోలు! రమ్ము, ఇంకెట్లు తప్పించుకొందువో చూచెదను."

ఈవాద మెప్పటికి తెగియెడిదో కాని ఇంతలో గవర్నరా యిరుపురిని వారించి, "ఒకవంక ముంచుకొని వచ్చు నుపద్రవమేమి! మీకీ వాదోపవాదము లేమి! ఇంకనిది చాలించి కర్తవ్య మాలోచింపుడు. ఇంతవరకు మాకు తెలియ వచ్చిన వివరములను తెల్పుచుంటిని వినుడు. నేటి రేయి పదిగంటల వేళ 'టర్పను' తోటలలోని బానిసలు ఈ విప్లవమును ప్రారంభించిరి. 'బక్‌మన్' అనెడు ఆంగ్ల బానిస అదటి వారికి నాయకుడట. 'క్లయింటు' 'ఫ్లావిల్లి' మున్నగు పరిసర ప్రదేశముల యందలి బానిసలెల్ల వానితో గూడిరి. ఆ ప్రాంతముల పైరు పంటలెల్ల పూర్తి నాశనము చేసి, గృహములు దగ్ధమొనర్చి, యజమానులనెల్ల ఘోరముగా ఊచకోత కోసిరట. ఇంతయేల ? ఒక శ్వేత శిశువును బల్లెమునకు గ్రుచ్చి విజయధ్వజముగా ఎత్తిరట! దీనిని బట్టి వారెట్టి బీభత్స కర్మమును దలపెట్టిరో ఊహించుకొనుడు"

ఈ మాటవిని సభ్యులెల్ల నొక్కపెట్టున హాహా కారములు సల్పిరి. గవర్నరు మరల చెప్పసాగెను.

"నగరము వెలుపలి స్థితిగతు లిట్లున్నవి. ఇంక నగరమందలి కల్లోలము వినుడు. కొందరు పౌరులు భీతి పెంపున యుక్తాయుక్తము లెరుగక, దయాదాక్షిణ్యముల దిగద్రావి తమ

తమ బానిసలనెల్ల మడియించిరి. ఇక కొందరు తమ బాని
సలను గదులలో పెట్టి తాళములు వేచి బంధించి యుంచిరి.
స్వతంత్రులగు సంకరులుకూడ ఈ విప్లవములోని వారే యని
తెల్లపనివారు గోల సల్పుచుండిరి. ఎట్లెట్లో కొందరు సంకరులు
హతులు గాకుండ తప్పించుకొని బయటపడిరి. అట్లువచ్చిన
ఆర్తుల నందరిని ఒక చర్చిలో తలదాచుకొనుడని చెప్పి,
అచట వారి రక్షణార్థము సైన్యమును కాపుంచితిమి. ఇపుడు
వారందరు 'మేము నిర్దోషులము. మా కాయుధము లిండు.
విప్లవకుల తుదముట్టింతు'మని వేడుకొనుచున్నారు.

ఆ నాడు నాతో పోరాడిన సంకరుడు గవర్నరుతో
'ప్రభూ! ఆ పనిమాత్రము సేయకుడు. నా మనవి ఆలింపుడు.
ఈ సంకరుల కాయుధము లొసంగుట క్షేమముకాదు.' అని
విన్నవించెను. అంత నొక భూస్వామి 'అయిన నీవు పోరాడవా
యేమి?' అని వానిని పరిహసించెను.

ఆ సంకీర్ణుడా మాటలు సరకు సేయక "ఈ సంకరులే
మనకు గర్భ శత్రువులు. ఈ విప్లవమునకు మూల కారణము
వీరే. ఇందు నీగ్రోల దోష మత్యల్పమని నా విన్నపము."
అని సంకీర్ణులను తెగడసాగెను. అట్లు నిందించినచో తన్ను
కులీనుడని అందరును తలంతురని వాని ఆశయము. కాని
అచట వానిగుట్టు నెరుంగని వారెవరు ? వాని మాటల
కందరును ఏవపడుచుండి, సేనాపతియు, భూస్వామియునగు
'డిరారే' లేచి "నీవు వచించినమాట సత్యమేగాని ఇందు
బానిసల దోషమును కొంతగలదు. ఏలన సంకరులకన్న నీగ్రోలు

నలుబది రెట్లుండిరి. ఈ సంకరులను బానిసలను ఎదుర్కొనుటకు నీవంటి తెల్లవారిని పంపవలసిన దుర్గతి మాకు పట్టెనేని మా దురవస్థ ఏమి చెప్పను" అని మర్మము లుచ్చిపోనాడెను. అంత నా సంకీర్ణుడు ఔడు గనచి తలవంచుకొనెను.

అంతట గవర్నరు "సేనాపతీ! నీ యభిప్రాయమేమి? ఈ సంకరులకు మనము ఆయుధము లొసగుదమా? వలదా?" అని యడిగెను.

సేనాపతి యు"ప్రభూ! విచారించుకయు సంకోచింపక వెంటనే నల్లవారి నెల్ల పోరికి సిద్ధము చేయుడు. తోడ్పడ వచ్చిన వాని నెవ్వాని గూడ వలదనుటకు సమయము గాదిది." అని విన్నవించి ఆ సంకీర్ణుడగు క్షేత్రస్వామి వంక తిరిగి, "మీరుకూడ సాయుధులై మీ సోదరులకు తోడ్పడుడు, పొండు, లెండు." అనెను. దీనితో నాతడు ముచ్చముణిగి కంఠపూర్తియగు కోపమును దిగమ్రింగుకొనుచు చల్లగా జారెను.

అంతలో పౌరుల ఆర్తనాదములు క్రమముగా వృద్ధియై సభాభవనము లోనికిగూడ వినవచ్చుచుండెను. గవర్నరు ఒక చీటిపై నేమియో వ్రాసి తన యంగరక్షకులలో నొకని కొసగి పంపి, పిమ్మట సభ్యులతో "అయ్యా! సంకరుల కాయుధము లిచ్చుటకు నిశ్చయించితిమి. ఇంకను మనము తేల్చుకొనవలసిన విషయము లెన్నియో కలవు" అనెను. నేను సభాభవనమును ప్రవేశించునపుడు మాటలాడుచుండిన రాష్ట్రసభ్యుడంతట లేచి "వెంటనే రాష్ట్రసభను సమావేశ పరుపు" డని విన్నవించెను.

అంతట నాతనికి ప్రతిస్పర్థియగు రెండవయాతడు లేచి, "రాష్ట్రసభనా, సమకూర్చుట? రాష్ట్రసభయన నేమి?" అనుచు నపహాస్యము చేసెను. మరల వారిరువురును వాదమునకు దిగిరి. ఆ గోలలో నొక భూస్వామి లేచి "మీ సుక్కనాదము లేనా? ఆవల తగులబడిపోవుచున్న నా ప్రత్తిచేనిమాట యేమైన విచారింతురా?" అని మొరపెట్ట దొడగెను.

మరియొకడు 'నా నీలిమందు నేలగలియుచున్న' దనెను. 'ఏడుపులో ఎడమచేయి' యన్నట్లు, కాఫీసలను తెచ్చిన ఓడ కొట్టె నొకడు 'అయ్యో! తలకు ఇరువది డాలర్లు ఇచ్చి కొని తెచ్చితినే! నా నీగ్రోల గతియేమి?' అని విలపింప సాగెను.

మరియొక భూస్వామి "ఒక్కొక్క నిముసము గడచిన కొలది నా పంచదార ఒక్కొక్క బారువ నాశనమగుచున్నది. బారువ ముప్పది రూపాయలు కట్టినను ముప్పది బారువలు మూడువందల'—అని లెక్కకట్టుచుండ మొదటివారిరువురు డీకొనిరి.

సేనాపతి యిదియెల్ల చూచి అందరు తల్లడిల్లునట్లు మేజాపై నొక గ్రుద్దుగ్రుద్ది, మేఘమువలె గర్జించుచు, "వాచాటులారా! మీ వాదమున కంతము లేదా యేమి? మీ శాసనసభలు రెండును ఏ యేట గలిసిన నెవరికి గావలయును? ప్రభూ! నాయందు దయయుంచి ఈ రెండు సభలను సమావేశము చేయుడు. ఈ సభ్యులందరిని రెండు పటాలములు చేసి, యుద్ధరంగమున కంపెదను. అపుడుగాని తెలి

యడు. వీరి సందడి యంతయు నోళ్ళతోడనేనో? తుపాకులు కూడ నేమైన మ్రోగునో?" అని వారి నదల్చి పిమ్మట నా వంకకు వ్రాలి చెవిలో మెల్లగా నిట్లు చెప్పెను. "ఈ సభల వల్లను ఈ గవర్నరు వల్లను ఏ పనియు నెరవేరదు. కార్య వచనము తెరుగక వీరు ప్రేలు వాయుపు రజ్జుల వలన సర్వ కార్యములు నాశన మగును. వారిసూలో వీరు కాదా సర్వనాశ నము చేయుచున్నది? ఆ గవర్నరు గద్దెమీద నేనే కూర్చుం డినచో నేనేమి చేయుదునో ఎరుగుదువా? ముందు ఈ వ్యర్థుల నెల్ల కోటబైటకు గెంటి, నా సైన్యమును వెంటగొని బయలు దేరి ఈ లంకలో నున్న నీగ్రోలందరిని నేలబెట్టి కాలరాతును. వేలమువెట్టిగా ఫ్రాంసులో మొదలుపెట్టినట్లు ఇచ్చటను 'సర్వస్వాతంత్ర్య' మను నొక మతము లేవదీసిరి. కాని యిచట అది ఎంత మాత్రమును పనికిరాదు. ఈ నీగ్రోల నెపుడును ఒకకాల నణగ ద్రొక్కియే యుంచవలెను. అట్లుగాక వారి నొక్కమారుగా స్వతంత్రులను జేసితిమేని, తలలు తిరిగి యింక భూమిపై నాగుదురా? నేడు యీ ఉపద్రవ మంతయు ఈ స్వేచ్ఛావాదము వలన గదా, మునిగినది? మీ రచట 'బాస్టిలు'కు నిప్పు పెట్టిన, వీళ్ళిచ్చట మా కొంపలకే యెసరు పెట్టిరి.

పాప మీ వృద్ధయోధుడు సంకుచిత హృదయుడే కాని మాయమర్మములు మాత్ర మెరుగడు. ఈవల నాతో నీతడు మెల్లగ నిట్లు మాటాడుచుండ, ఆవల యిల్లెగిరి పోవునట్లు వాగ్వాదము జరుగుచుండెను.

ఈ విప్లవోన్మాద మెత్తిన వారిలో నొక క్షేత్రస్వామి బానిసలను చిత్రవధ గావించుటలో నేర్పరినని తన పేరునకు ముందు "పౌరసేనాని" అని బిరుదముగూడ తగిలించుకొనెను. అతడు బిగ్గరగా నిట్లుపన్యసించుచుండెను. "మనమీ బానిసలను పట్టుకొని దారుణముగ శిక్షింపవలయునే గాని, వీరితో యుద్ధమొనర్చుట తగదు. ఏ ప్రభుత్వమైన చిరస్థాయి కావలెనన్న, దారుణ దండనీతి ప్రయోగ మవసరము. మన మీ నీగ్రోలకు దానిని చవిచూపవలెను. జూన్, జూలై నెలలలో అల్లరి సాగించిన బానిసల నోళ్ళు నేను కాదా నొక్కినది. నే నపుడేమి చేసితినో యెరుగుదురా? నా చేతిక్రింద పనిచేయు నీగ్రోల మెడ లుత్తరించి, ఆ తలలు మా వాకిట రెండు ఏరుస లుగా తోరణములు కట్టితిని. కావున మీరెల్ల నిపుడట్లే సలుప వలయును. లెండు. ఇంకను మిగిలిన బానిసల తలలు కాపు నగర ద్వారమున తోరణము కట్టుదము రండు."

'ఏమంటివి?' 'ఇంత అవివేకమా?' 'నీయుద్దేశమేమని?' 'ఇంత ఘోరమా?' 'ఛీ ఛీ మహాపాపము?' అనుచు సభికు లెల్లరు చీకొట్టిరి.

అంతటితోనైన నాత డూగకొనక మరల 'నేను చెప్పినది మీరు గ్రహింపలేరు. బాగుగ వినుడు. బానిసల తలలు నరికి వానినొకే తోరణముగా గ్రుచ్చి ఈ కాపు నగరము చుట్టును గట్టుడు. ఆ తోరణముజూచి విప్లవకు లదలి పారిపోవుదురో లేదో చూడుడు. వారీపురము పొంత నడుగుపెట్టినచో నన్నడుగుడు. నాకడ నింకను విశ్వాసపాత్రు

లగు బానిసలయిదువంద లున్నారు. వారినిప్పుడే మీ వశ మొనర్చెదను' అనుచు ఉపన్యాసము సాగించెను. ఆ మాటలు విని 'అంతతో చాలింపుము. దుస్సహము. ఇహపరదూరము' అని సభ్యులందరు నొక్క పెట్టున నరచిరి.

అందొక భూస్వామి "ఈ ఘోరకృత్యములే మనలను కట్టి కుడుపుచున్నవి. క్రిందటిసారి తొందరపడి బానిసలందరను వధింపకున్నచో నేటి విప్లవమునకుగల మూలసూత్రము మనకు కరగతమై యుండెడిది. చేతులార మనమే దానిని త్రెంచు కొన్న దాని కీల్గు ఫలమనుభవించుచున్నాము" అని విచార పడెను.

ఈ చీవాట్లతో తలవాచి ఆ 'పౌర సేనాని' కొంతవడి ఏమియు అనలేక ఊరకొని పదపడి ఏమియు నెరుంగనివాని వలె మెల్లగా "మీ రందరిచే నిట్టి క్రూరకర్ముడ నని పించు కొందునని నేను కలనైన నెరుగను. జన్మమంతయు నీగ్రోజాతి సముద్ధరణచేగడపుచు, నానా దేశము లందలి నీగ్రో బాంధవు లగు దీన దయాపరులతో సఖ్య మొనర్చి, వారితో నెల్లప్పుడు ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుచుండు నాకా ఈ వాదు?" అని ఆ దేశములందలి దీనబాంధవుల పేర్లన్నియు నేకరువు పెట్టుచు, క్రమముగా స్వరము హెచ్చించి చివరకు "ఇంతకు నిచట నిజమైన తత్త్వవేత్తలు లేరు" అని ఈసడించెను.

"ఇంక మీలో ఎవరైన చెప్పవలసిన విషయము లున్నవా?" అని గవర్నరు మరల ప్రశ్నించెను.

అంత నొక సభికుడు "మన మందర మేగి రేవులో లంగరు వేసియున్న ఓడ నెక్కుట భద్ర"మని విన్నవించెను.

మరియొకడు "బక్‌మన్" తల తెచ్చినవానికి బహుమాన మొసగుదుమని ప్రకటింపుడు"

ఇంకొకడు "జరిగిన వృత్తాంతమంతయూ 'జమైకా' గవర్నరుకు దెలుపుట మంచి"దని వచింప, వేరొకడు "మంచి ఊహాయే. మరల వారి సైనికపంక్తుల తుపాకులు మన నెత్తిని కొట్టుకొనుటకు పంపుదనియా, జమైకా గవర్నరుకు తెలుపుట?" అని వాని నెల్ల వెక్కిరించి గవర్నరుతో, "ప్రభూ! అట్లుకాదు. మన మీ వృత్తాంతమెల్ల ఫ్రాంసునకు తెలియజేసి, వారి ఉత్తరువులు వచ్చువరకు నిదానించుట మంచిదని నా అభిప్రాయము" అనెను.

అంతట సేనాపతి లేచి "నిదానించుటయా! ఇది మరియు సొగసుగా నున్నది. నిదానించవలసినదే! ఫ్రాంసు నుండి జనాలు వచ్చువరకు నల్లవారు కూడా నిదానించి చూతురేమి? పట్టణము నలుదెసల నావరించుచున్న అగ్నిజ్వాలలు కూడ నిదానించునేమి?" అని పరిహాసించి "ప్రభూ! ఇవేమియు తగిన మాటలు కావు. వెంటనే రణభేరి మ్రోగింపుడు. ముందు విప్లావక మూలబలము మెచ్చట విడిసియున్నదో కనుగొనుటకు కొందరు సైనికుల బంపుడు, సేనల నలుదెసల విడియింపుడు నేనొక సేనగొని 'ఫ్రాఫిన్' మైదానము నాక్రమింతును– ఇక క్షణమైన నుపేక్షింపరాదు. ఈ కాలయాపనము చాలును." అని తన అభిప్రాయము వచించెను.

సారవంతము లగు నీ ధీరోక్తులతో నభిప్రాయభేదము లెల్ల అంతరించెను. ఆత్మహితకరములై తోచిన ఈ పలుకు లచటి స్వార్థపరుల కందరకు నచ్చి 'బళి బళీ' అని యైక కంఠ్యముగా సేనాపతిని ప్రశంసించుచు తమ సమ్మతిని తెలిపిరి. ఇంచుక అవినయముగా నున్నను పథ్యమగు సేనాని ఉపదేశమున కానందించి గవర్నరు చిర మిత్రుడగు ఆతని హస్తాగ్రమును ప్రీతిపూర్వకముగా గ్రహించి తన ఆమోదమును ప్రకటించెను. క్షేత్రస్వాములందరు ఈ ఉపదేశము అవశ్యానుష్ఠేయమని వేగిరించిరి.

'ఆకలు' పురికెప్పు డేగుదునా? అని తహతహలాడుచున్న నేను ఇదే సమయమని గవర్నరు కడ సెలవు గైకొని అప్పటికే చాల అలసియున్న నా సైనికులను సంతరించుకొనుటకు బయలుదేరితిని. నాకు మాత్రము శ్రాంతియు దప్పియు కాన్పించుటలేదు.

## 14

తెల తెల వేగుచుండగా నేను విపణివీధి ప్రవేశించితిని. అచటి సంక్షోభమేమి చెప్పుదును ? నానా ప్రకారములగు ఆశ్వికపదాతివర్గములతో తలదాచుకొన జేరిన జానపద సమూహముతో, 'అంభే' అని అరచుచున్న పశుసంతతులతో, అగ్ని ముఖమున పడకుండ క్షేత్రస్వాములు తెచ్చి ప్రోవిడిన అనేక వివిధవస్తు సంచయముతో ఆ వీధి నిండియుండెను. 'వీరువా'రని ఏర్పరుపరాయకయున్న ఆ మహా సమూహంలో

ఒడలు మరచి పడియున్న నా పదాతుల వెదకి లేపుచుంటిని. ఇంతలో చావు బతుకులపై అశ్వమును పర్వెత్తించుకొని వచ్చు ఒక రౌతును గాంచి 'ఇది ఏమి ఉపద్రవమో' అని వానిని సమీపించి 'ఏమి సంగతి?' అని ప్రశ్నించితిని. వాడును శ్రాంతిచే నోటమాటరాక ఎట్లో ఒకటిరెండు వాక్యములలో విప్లవాగ్ని 'ఆకల్' పురమును దరికొనెననియు, 'గాలిఫట్' దుర్గము ముట్టడింప బడెననియు చెప్పెను.

ఇక నేమున్నది? నేననుకొన్నంతయు జరిగినది. కోటలో క్షేత్రస్వాము లందరు ఆలుబిడ్డలతో వస్తు వాహనములతో తలదాచుకొనియుండిరి. పుర రక్షకులు అందే చిక్కుకొని యుండిరి. కోటయను పేరేకాని అదేమంత గట్టిదికాదు.

ఇక నొక క్షణమేనియు నాలసింపక చేతికందిన గుఱ్ఱములపై నా సైనికుల నెక్కించుకొని ఆ వార్త చెప్పిన అశ్వికుడు త్రోవచూప పది గంటల వేళకు మా మామ పొలము చేరితిమి. నిన్న సంజవేళ పైరుపంటలతో కళకళ లాడుచు కనుల పండువచేసిన విశాలమగు నా క్షేత్ర మెల్ల అగ్ని సముద్రమువలె ఎదుట కానవచ్చెను. అంతటను పొగ మబ్బులు దట్టముగా అల్లుకొని, ప్రచండ వాయువశమున ఎగిరి పడుచున్న వృక్షములనుండి చుక్కలవలె లేచు మిడుం గురు లా ప్రదేశమున అకాల సంధ్యానావహింప జేయుచుం డెను. దూరమున మాకు కనుచాటగు ప్రదేశమునుండి విన వచ్చుచున్న నీగ్రోల మహా కల్లోల ధ్వానములకు, పెళిల్లు పెళిల్లుమని విరిగి పడుచున్న వృక్షముల చప్పుళ్ళు ప్రతిధ్వను

లోపల నుండెను. నా కనుల యెదుట నాశనమగుచున్న ఆ మా సంపద నాకు ఇంచుకయు ఖేదము గూర్పలేదు. నా మనస్సు, ప్రాణాధికయగు నామేరీ వెనకు మహావేగమున పరువిడు చుండెను. నా మేరీ ప్రాణముగాక, ప్రపంచమున నాకు మరేమి కావలయును? శత్రువులకు చిక్కనున్న ఆ దుర్గమున తలదాచుకొన్న ఆ అబల ఎట్టులుండెనో! "దైవమా! అంతయు నంతముగాక మున్నే నన్నటకు జేర్చు" మని వేడికొనుచు ఎట్లయిన నామేరీని రక్షించుకొనవలయునన్న ఆశ నాకు సింహపరాక్రమమును గూర్చ, శ్రాంతిని, ఖేదమును విస్మరించితిని.

కొంత సేపటికి త్రోవ మలుపు తిరుగగా గాలిఫేటు దుర్గము కనుల బడియెను. కోటపై ఇంకనూ మా బావుటా ఎగురుచునే యున్నది. దుర్గరక్షకులు శక్తివంచన లేకపోరాడుచునే యుండిరి. ఇది యెల్లగాంచి సంతోషము పిక్కటిల్ల "పదుండు వేగిరింపుడు" అని మా వారిని హెచ్చరించుచు, ద్విగుణీకృత వేగమున పొలముల కడ్డముపడి రణరంగమును జేర చనుచుంటిని. తలుపులును కిటికీలు కాలిపోయి, ఆ మంటలలో ఎఱ్ఱనైన గోడలతో, కోటచెంత నిలిచియున్న మా యిల్లు కంటపడెను. ఇంకను పైకప్పు అంటుకొనలేదు. ఆ యింటి నాక్రమించుకొని నీగ్రోలు పై కెక్కి, అటనుండి కోటపై తుపాకులు ప్రేల్చుచుండిరి. మరి యొకచో కొందరు గట్టి మొనగా ఏర్పడి దుర్గమును పట్టుకొనుటకు లగ్గలు వేయుచుండిరి. దుర్గరక్షకులు బరవసము చేసికొనుచు కాల్చు కాల్పులకు, శత్రువులు కుప్పకూలలుగా నేల గూలుచుండిరి.

క్షణక్షణము శత్రుపరాక్రమమునకు ఓహాటించి చెదరి వెనుకకు తగ్గియు పారిపోక మరల తండోప తండముగా కోటపై కెగబ్రాకవచ్చు ఆ నల్లమూకలు తాబేటి వీపు చిప్పపై ఎక్కగోరి, అది ఒడలు విదిలించినపుడెల్ల క్రింద పడుచు మరల పైకి ప్రాకెడి సేనల తండములవలె అక్కజము గొల్పుచుండెను.

మేమును దుర్గమును సమీపించితిమి.

ఇంకను చెక్కు చెదరక కోటపై నెగురుచున్న మా మూడు రంగుల బావుటాను మా సైనికులకు జూపి, ఆ కోటలో చిక్కువడి యున్న వారి అలుబిడ్డలను జ్ఞప్తికి తెచ్చి, “రండు. ప్రాణములొడ్డి వారిని విడిపింత”మని పరవసము చేసితిని వారును ఒక్కుమ్మడి సంతోషధ్వానము చేసి నా యాజ్ఞానుసారము తమంత కూడుకొని మొనతీర్చి నిలిచిరి. పేల్చుటకు మేమెత్తిన తుపాకులు ఎత్తినట్లయుండ, గొల్లుమను ఆర్తనాదము మిన్నుముట్టెను. దానితో మహాధూమ పటలము లేచి కోటను క్రమ్మివైచెను. “గుభుల్, గుభుల్” “పెఠిల్ పెఠిల్” ధ్వానములు దిక్కులు బీటలు వరచుచుండ, ధూమ పటలము విరిసి రూపుమాసిన కోట కానబడియెను. దాని మొండి గోడలమీద రక్తవర్ణ ధ్వజ మొకటి తలసూపి ఎగురుచుండెను.

కార్యము తప్పినది. గాలిఫలు కోట శత్రుహస్తగత మైనది.

# 15

ఆ మహాభయంకర దృశ్యమును అప్పటి నా చిత్త ప్రవృత్తిని నేను వర్ణింపలేను. కోటపడినది. తద్రక్షకులు హతులైరి. అందు తలదాచుకొన్న ఇరువది కుటుంబములు ఆబాలవృద్ధము ఊచకోతగా తెగినవి. కాని సిగ్గువిడిచి చెప్పుచున్నాను. నామదికి అది ఇంచుకైనను పట్టదాయెను. 'నేను నా మేరీని చేతులార పోగొట్టుకొంటిని' అను భావమే మనశ్శల్యమై వేధింప దొడగెను. నాటి ఉదయమే లభించిన ఈ అనర్ఘ రత్నము నా చేయిజారిపోయినది. పొరపాటున నా మామ ఆజ్ఞకు విధేయుడనై వర్తించి, జీవితమునకు తీరని నష్టము తెచ్చుకొంటిని. నాటిరేయి కాపునగర రక్షణార్థమే నేను పోకయున్నచో, మేరీ జంటబాయక, చేటైనచో ఆమెను కాపాడుకొనుటయో, లేనిచో ఆమెతో కలసి చచ్చిపోవుటయో అగునుకదా! ఈ నిరర్థక విచారానుతాపములు నా దుఃఖమునకుతోడై నాకు పిచ్చి పుట్టించినవి.

నా సైనికులుకూడ క్రోధదుఃఖ వివశులై విజృంభించి నోట కత్తులను చేత తుపాకులును దాల్చి 'ప్రతీకారము, ప్రతీకారము' అను అర్పులతో ఒక్క పెట్టున శత్రు సమూహము పైకి ఉరికిరి. నీగ్రోలు అధిక సంఖ్యాకులయ్యు మా దర్శనమాత్రమున విచ్చి నీటిమీద చమురువలె ఎట చూచిన తామై చేతికి అందిన తెల్లవారినెల్ల తుదముట్టించుచు, అగ్నిజ్వాలలకు ఎండు మ్రాకులు దాకొల్పుచు నలుగడల చెలరేగి పారజొచ్చిరి.

ఆ సందల ఈ దుర్వ్యాపారముచే మా కోపాగ్ని మరియు ప్రజ్వలించెను. 'తాన్యాసు' ఎట్లో తప్పించుకొని దొడ్డిదారినివచ్చి బయటపడెను. వాని శరీరమంతయు పోటు గల్లులచే నిండియుండెను. అతడు నన్ను సమీపించి "కెప్టెన్! మీ పీరటు ఒక ఇంద్రజాలికుడు! ఇంద్రజాలికుడే కాదు. పెనుభూతము! ఎంతోసేపు మేము కాలు కదపక, చలము డింపక కోటను కాపాడితిమి. ఇంతలో మీ పతాకాది చిహ్నములు కానవచ్చెను. కోట దక్కినట్లే తోచెను. అంతలో నేమిచెప్పుదును? ఏ మూలనుండియో ఆ పీరటు మా కనుగప్పి, కోటలో ప్రవేశించి, మారిపుసంగినట్లు సర్వము తుదముట్టించెను. మీ మామయు, మీ భార్యయు—" అని చెప్పుచుండగనే "మేరీ ఎక్కడ?" అని ఉత్కంఠతో నడిగితిని.

నా నోటిమాట నా నోట యుండగానే, ఆజానుబాహుడైన నల్లవాడొక యువతిని చేతులలో నెత్తుకొని మండుచున్న ఒకపొద చీల్చుకొని పోవుచుండుటయు, ఆ యువతి గీ పెట్టుచు పెనుగులాడుచుండుటయు దృగ్గోచరమయ్యెను.

ఆ యువతియే మేరీ! ఆ నల్లవాడే పీరటు!

"విశ్వాసఘాతకా! నిలుమురా! నిలు" మని, అర్చుచు వానిని గురిచూచి తుపాకిపేల్చితిని. వాని అనుచరుడొకడా దెబ్బకు అడ్డువచ్చి పడెను.

పీరటు వెనుకకు తిరిగి నన్నుద్దేశించి ఏదో ఒకటి రెండు మాటలు పల్కెను, గాని నాకవి వినరాలేదు. నేను చూచు

చుండగనే వాడు నా మేరీని, లేగ మాంసపు ఖండమునువలె చేతులలో గట్టిగా పట్టుకుని, నలు దెసల అగ్గి దరికొన్న ఒక చెరుకుతోటనుండా నెగిరిపోయెను. మరు నిముసముననే పులి వంటి ఒక పెద్దకుక్క నోట నొక ఊయల కరచుకొని నా ప్రక్కగా దుమికి పారుచుండెను. నే నిట్లు చూతునుగదా, ఆ తొట్టిలో నా చిన్న బావమరిది కనులు మూసుకొని నిద్ర పోవుచుండెను.

నాకు మన్ను మిన్ను తోచలేదు. కుక్కనుకూల్చుటకు ఇంకొకమారు తుపాకి కాల్చితిని. దైవ వశమున నదియు తప్పెను.

పిచ్చి ఎత్తిన వానివలె నేనా కుక్కవెంటబడితిని. కాని నిద్రాహారములు లేక రాత్రి అంతెయు ద్రిమ్మరి డస్సి, మేరీని గురించిన ఆందోళనమున చివికి, సుఖ స్వర్గమునుండి ఒక్క మాటుగా దుఃఖ నరకమునబడి, బిమ్మిటి గొనియున్న నా పని అయిపోయినది. ఎట్లో అడుగులు తొట్రుపడుచుండ పదిబార లేగితిని గాని, కన్నులు చీకట్లు వారి, స్మృతి తప్పి పడిపోతిని.

# 16

నాకు ఒడలు తెలిసి కన్నులు విచ్చి చూచునప్పటికి ధ్వంసమైన మా యింట ఒక గదిలో నుంటిని. విశ్వాస పాత్రుడైన తాడ్యూసు నన్ను చేతులలో పెట్టుకుని నా మొగమున దీనదృష్టి పరపుచు, ఎడనెడ నాడి జూచుచు, విచారగ్రస్తుడై కూర్చుండెను. కనులు విచ్చుటయు, నాడి ఆడుటయు జూచి

అతడు "జయము! మాకు విజయము నీగ్రోలు పటాపంచ లైరి. మా కెప్టెన్ పునర్జీవితు డయ్యెను!" అనుచు కేక వైచెను.

చెదిరిన నా మనస్సు ఇంకను కుదుటపడలేదు. ఏమేమి జరిగెనో జ్ఞప్తి లేదుగాని నేను అపస్మారకుడనై తినని మాత్రమూ హింపగలిగితిని. ఆ స్థితిలోనే తాడ్యూసు ఉత్సాహ వాక్యముల కడ్డమువచ్చి "నామేరీ ఎక్కడ?" అని ప్రశ్నించితిని. నాకు కావలసిన మాట అది ఒక్కటియే!

ఏమియు చెప్పలేక తాడ్యూసు తలవాల్చి ఊరకుండెను. ఇంతలో నా మనస్సునకు స్ఫురణ వచ్చి, ఆ దుర్ముహూర్తమున మా వివాహ మహోత్సవము దీర్ఘకాయుడగు ఆ నల్లవాడు నామేరీని ఎత్తుకొని పోవుటయు, దుస్స్వప్నమువలె కనుల బొడ గట్టెను. ఈ విప్లవము వలన తెల్లవారందరు నల్లవారిని గర్భశత్రువులుగా నెంచుకొనిరి. నేనో, ఉదారుడు, సత్పురుషుడు, విశ్వాస పాత్రుడు, అని ఎవ్వని భావించితినో, ఎవ్వనికిమూడు సారులు ప్రాణ దానము చేసితినో అట్టి పీరటును కృతఘ్నత మూర్తీభవించిన పెను భూతమని తెలిసికొంటిని. ఈ దురాత్ముని గురించి నేను మొదటనే అనుమాన పడితిని. మా వివాహ మైననాడే వాడు నా భార్యను హరించుట నాయనుమానము నిజమనిపించెను. ప్రాణప్రియను, నన్ను వేరు చేసిన ఈ హాతకుడే నాడు వనమున పాటలు పాడిన వాడని స్పష్టమైనది.

ఆహాహా! విధివిలసితము, ఎంతలో నెంత చిత్రము జరిగినది!

నీగ్రో లందరును పారిపోయిన తర్వాత పీరటు, వాని కుక్కయు పోయిన దారిని నేను కొంతదూరము వెన్నంటి పోతిని గాని లాభము లేకపోయినది. అది యట్లుండ మా మామగారి చెరకుతోట మున్నగునవి అగ్నిపాల్పడ్డ నను శక్యము గాక ఇంకను మండిపోవుచునే యున్నవని తాడ్యూసు నాతో చెప్పుచుండగనే "ఆస్తికేమిగాని, మామామ ఎక్కడ? అని ప్రశ్నించితిని. అతడేమియు చెప్పలేక చేయి పుచ్చుకొని నన్ను మామామ పడకగదికి తీసికొనిపోయి, పందిరి మంచము దోమతెర తొలగించి చూపెను. మందభాగ్యుడగు మా మామ రక్తసిక్తమైన పరుపుమీద హృదయమున లోతుగా దిగిన పిడికత్తితో కానవచ్చెను. ప్రశాంతమై నిద్రపోవు చున్నట్లున్న ఆయన ముఖలక్షణమును బట్టి ఆ హత్య నిద్రావస్థలో జరిగినదని గ్రహించితిని.

మా మామగారి పాదాంతికమున నున్న విదూషకుని పక్కయు రక్తసిక్తమై యుండెను. వాడు తొడుగుకొను కోటు నెత్తుట తడిసి రెండడుగుల అవల నేలమీద పడి యుండెను. మందభాగ్యుడగు ఆ గుజ్జుమానిసి కూడ భక్తి పరాయణత్వమున స్వామికి నడ్డుపడబోయి, హంతకుని కత్తి కెర అయ్యెననుట నిస్సంశయము.

పీరట్, హెబిబ్రాల గుణశీలము గ్రహించుటలో ఎంత యేని దురభిప్రాయ పడితినని నన్ను నేనే నిందించుకొని మా మామతోపాటు వానికిని అశ్రుజల తర్పణము చేసితిని. వాని బొందికోసము చుట్టుప్రక్కల గాలించితినిగాని ఫలితము

లేక పోయెను విప్లావకులు దానిని అగ్నిలోవైచి యుందురని ఊహించితిని. మా మామకు చేయు పార లౌకిక క్రియలతో పాటు తద్భక్తుడై తన్నిమిత్తము ప్రాణము లర్పించిన విదూషక భృత్యుని సద్గతికొరకుగూడ ప్రార్థనలు సల్పవలెనని కట్టడి చేసి ఈవలకు వచ్చితిని.

# 17

గాలిఫెటుకోట దగ్ధమైనది. మాయిల్లు ధ్వస్తమైనది. ఇక నేనట యుండనేల యని, సాయంకాలమే కాపు పట్టణము చేరితిని. ఆ రాత్రి నాకు పెద్ద జ్వరము వచ్చినది. దుఃఖము దిగమ్రింగవలెనని నాటి పవలెల్ల నేను పడినకష్టము ఇంతింత కాదు. దుస్సహమైన ఆ భారముచే నాకు ధృతి తూలి కూలితిని. తెగినదాక లాగిన తీగవలె నైతిని. నా జ్వరమునకిదియే కారణము కానోపును. నా యాశలడుగంటుటయు, ముందుగతి కానరామియు, వియోగ తాపము ముట్టుటయు, ఈర్ష్యా జ్వాలలు ఆపాదమస్తకము దహించుటయు, ఒక్కపెట్టున తలను త్రిప్పజొచ్చెను. నా రక్త నాళములలో అగ్ని ప్రవహించుచున్నట్లయ్యెను.

శిరో భారము గొడ్డలి పెట్టుగా పగుల గొట్టుచుండెను. క్రోధపూరితమైన హృదయము విచ్చిపోవుచుండెను. ఒక దురాత్ముడు, దాసజాతుడు, పీరెటు నామక కృతఘ్నుడు నా మేరీకి స్వామియై, బలవంతముగా నామెను భుజాశ్లేషనిబద్ధను చేయుచుండెనని భావించుకొంటిని. దుర్భరమైన ఈ పరాభవ

వేదన సైపలేక పోతిని. దీనితో జ్వరము తీవ్రమై సంధించినది. ఆ సంధిలో మాటిమాటికి లేచి ఎగిరి గోడకు తలపెట్టి బ్రద్దలు కొట్టుకొనఁ బోతినట. ఆఱ్గురు పట్టుకొని కూడా నన్ను ఆపలేకైరట. నాఁడే నేనేల చావనైతిని.

వైద్యుని నిపుణత వల్లను శరీరాంతర్వ్యాపితమై యున్న వయోమహత్యము వల్లను, ఎట్లో ఆ గండము గడిచినది. అట్లు జరుగకుండిననే మేలయ్యెడిది! పది దినములలో నాకు ఉసులు చిక్కినది. అంత పగపు త్రోసిపుచ్చి ప్రతీకార దీక్షపూనితిని.

ఇంకను పూర్ణముగా జవసత్త్వములు రాకమున్నే ఒకనాఁడు గవర్నరును దర్శించి "నాకు ఏదైన పని కల్పింపుఁడు" అని వేఁడుకొంటిని. ఆయన ఏదైన దుర్గరక్షణ భారము నాపై పెట్టనెంచెను. కాని విప్లావకుల మూకలొక్కచో కూడుకొనకుండ చెదరఁగొట్టుటకు అప్పుడప్పుడు పరిసర భూములకు పంపుచున్న సైన్యములలో నాకు ఉద్యోగమును కల్పింపుఁడని ఆయనను వేఁడుకొంటిని. గోట తిరెడి పని గొడ్డట తీర్పవలసి వచ్చినట్లు, విప్లవము నడచుపని నానాటికి భారము కాఁజొచ్చెను.

'పోర్టుప్రిన్సు' నందలి నీగ్రోలలోఁగూడ విప్లవాంకురములు మొలకెత్తుచుండుట గాంచి, అవ్యవధిగ కాపు నగర రక్షణమునకు వలయు సన్నాహములు గావించితిమి. విప్లావకుల మూకలన్నియు నాలుగుచోట్ల నాలుగు మొనలుగా నేర్పడెను. అందు 'లంబి' 'ఆకలు' ప్రాంతముల నీగ్రో దళములకు 'బైసో' సేనాపతి అయ్యెను. 'మెరిబారో' దళమునకు 'జీన్ ఫ్రాంకై' నాయ[illegible]న్'

తన మూకలతో 'లెమొనేడ్' మైదానముల ధ్వంస మొనర్ప జొచ్చెను. ఇక 'మారన్ రూజీ' యందలి నీగ్రో సేనలు 'బగ్ జార్గల్' అనబడు నీగ్రోను తమ కధిపతిగా నభిషిక్తు గావించెను.

మాకు వినవచ్చు వార్తనుబట్టి తక్కిన ముష్కరు సల్పు రాక్షస కృత్యములతో పోల్చిచూచినపుడు ఈ బగ్ జార్గల్ చాలా సాధుస్వభావుడుగా చూపట్టెను. బైసో బక్మనులు తమ చేజిక్కిన విరోధులను చిత్ర విచిత్ర వధల పాలుసేయుచుండ ఈ బగ్ జార్గల్ అట్టివారిని వలయు పరికరము లొసంగి ద్వీపాంతరమునకు పంపుచుండెను.

ప్రసిద్ధులగు ఎనమండ్రుగురు భూస్వాములను బక్మన్ ఘోర దుర్మరణము నొందింపనున్న సమయమున ఈ బగ్ జార్గల్, దైవమువలె అడ్డుపడి వారిని రక్షించి విడచెను. ఆతని దయాపరత్వమున కిట్టి వెన్నియో నిదర్శనములు కలవు. వాటి నన్నిటిని ఇపుడు నే నేకరువు పెట్టజాలను.

వీరటు వార్త యించుకయు వినరామి, నా ప్రతీకార భాగ్యముమాత్ర మెప్పటికప్పుడు దవ్వగుచునే యుండెను. బైసో, తన సైన్యములతో మమ్ము వెతపెట్ట జొచ్చెను. ఒకనాడు తన మూకలతో కాపునగర సమీపమున ఒక పర్వతమును, వాడాక్రమింప రాగా, కోట బురుజులపైనుండి శతఘ్నికాగోళము చిత్తజల్లుగా కురిపించి యెట్లో చెదరగొట్టితిమి. ఇకనిది పనికాదని, గవర్నరు వారినా చుట్టుపట్ల లేకుండ తరుమ సంకల్పించి, కొంత సైన్యమును దుర్గరక్షణ

మునకు నియోగించి, ఒక మహాసైన్యముతో ఆ ప్రముక్కుడి మూకల నాక్రమింప ఆజ్ఞనొసగెను.

కాని యెడనెడ బగ్ జార్గల్ మా పై సలుపుచున్న దాడి వలన మాకేమి సలుపుటకును కాలు సేయాడకుండెను. కాన మున్ముందు ఆ దుర్మదుని తుదముట్టింప నెంచి, వానిపై కొంక సైన్యమును నంపితిని. మరి రెండుదినముల కా సైన్యము బగ్ జార్గల్ ధాక కోహటిల్లి పారివచ్చెను. అంతతో పోనీక గవర్నరు మరల ఇంకొక మొన కూర్చి వానిపైకి పంపెను.

తొలుతటి దానికన్న నిదియు మిక్కిలిగా పరాభూతమై, వెరచరచి, ఖిన్నవదనముతో తిరిగి వచ్చెను. ఈ రెండవ పోటున తీవ్ర రోషముతో పోరిన తాడ్యూసు, తిరిగి వచ్చి, 'బగ్ జార్గలు నెటులైన నేనే పొంగొనక విడువ' నని ఘోర ప్రతిజ్ఞ చేసెను.

(కనుకొలకుల ముత్తెములంత బాష్పకణము లురల చేతులు కట్టుకొని అవర్నీ, మూర్ఛలో మునిగినట్లయ్యెను. క్షణ కాల మట్లుండి, తేరి, మరల కథ సాగించెను.)

# 18

అంతట ఒకనాడు బగ్ జార్గల్ 'మోరన్ రూజ' వెడలి, తన సైన్యముతో బైసోను కూడుటకు వచ్చుచుండెనని మాకు వార్త వచ్చెను. గవర్నరు ఆ వార్త విని పట్టరాని మోదముతో చేతులప్పళించుకొనుచు. 'భళి భళీ! దొరికిరి. ఇంక వీరు చేతచిక్కినట్లే' అని ఉబ్బిపోయెను.

మరునాటి ఉదయమున, మేము నగరము వెడలి నాలుగు మైళ్ళు నడిచితిమి. గాలిఫెట దుర్గమున విడిసియున్న శత్రు సైన్యములు మా రాక కనిపెట్టి, అచటి ఫిరంగు లచటనే విడిచి వెనుకకు మరలి పోయెను. శాత్రవు లట్లు దర్శన మాత్రమున పలాయితులగుటకు సంతసించి, మేముకు ముందు నకు తరిమి నడచితిమి. మున్ను సారవంతమై యున్న పైరు పంటలతో నేలమట్టమైన యిల్లు వాకిళ్ళతో, పాడువడి దిగులు పుట్టించు ఆ మైదానముల నడచి పోవునపుడు “అది మా పొలము కాబోలు, ఇది మా ఇల్లు కాబోలు” అని కొందరు తివుట చూపులతో గుర్తింప ప్రయత్నించుచుండిరి. కాని ఆ మహా మారి అడుగుజాడ లెవరు పోల్చగలరు. పైరులను తోటలను నిశ్శేష మొనర్చి కన్నెయనవులను దరికొని, కాలుచున్న ఆ విలయాగ్ని, ఇటనట త్రోవ కడ్డమై మా నడకను చక్కగా సాగనీయ దయ్యెను.

యుగములనుండియు హాలముఖ స్పర్శనెరుంగక బీడువడి తరులతాగుల్మ సాంద్రతచే నొప్పు ఆ భూముల అటవీ దహనము చిత్ర విచిత్ర కార్య కమనీయముగా నుండును. మార్గ నిరోధకములైన పర్వత పంక్తుల ఛేదించుకొనుచు, శిలా సముదాయమును దొర్లించుకొనుచు వచ్చినప్పుడు వేగవన్ని ర్ఝర ప్రవాహ ఘోషమువలె దవ్వుల నుండి అనూహ్యమైన ఒక మహా ధ్వని తొలుత వినబడును. అంతలో పెఠేలు పెఠేలు నినాదములతో స్కంధములు ఛేదిల్ల, ఫెళ ఫెళా రావములతో శాఖా పరంపర యొరగ, నేలబీటులు వారి కుంకటి వ్రేళ్ళు పెల్లగిల్ల

తరుసముదాయము ఒక్క పెట్టున భగ్గుమని మండును. అటవీ మధ్య గతములైన తటాక పల్వలోదకములు, నల్దెసల రేగిన ఆ యగ్ని వలన సలసల క్రాగి పొంగులాడును. జ్వాలా జాలము హోరుమని సముద్ర తరంగములవలె ముందునకు దుమికి వచ్చుకొలది వాయుగతి స్తంభించి, ఒక సమ్మర్ద మంద్రస్వన ముప్పతిల్లి, ఆ జ్వాలా స్రవంతి దాదాపగు నపుడు గాఢమగుచు, దూరవ్యాగునపుడు మందమగుచు వీతెంచెను.

చక్రాకృతియగు అనలముచే ఆవృతమయ్యు, ఇంకను అంటుకొనని తెరువాటి రెమొకటి తళుక్కుని కంట బడును. చూచుచుండగనే ఒక అగ్నిజిహ్వ దిగువారియున్న రెమ్మలను తీగవలె అల్లుకొని కలయజుట్టి వచ్చును. ఉత్తరక్షణముననే భగ్గుమని అదియెల్ల అగ్నిరాశి యగును. అంతట అనల విధూతమై ఇతస్తతః ప్రచలితమగుచు ధూమవ్రాతము మిన్నంటును. ఇక అది వింతవింత రూపు లెన్నియో తాల్చుచు ఇట వ్యాప్తమై, అట సన్నగిల్లి, ఒకక్షణము రూపుమాసి, మరు నిముసమున సహస్రగుణ విస్తృతమై, తుదకు విస్ఫులింగాంచలమగు దట్టపు కారుమబ్బయి కాన్పించును. అంతట ఉరుముడిమినట్లన్ను, ఆ మిడుంగురులు మటుమాయమై పొగలు పైకెగబ్రాకి, అరుణాభస్మరాశిగా మారి, కాలవర్ణమగు ధరాతలమునకు అల్లనల్లన అవతరించును.

# 19

ప్రయాణపనాడు సంధ్యాసమయ మగునప్పటికి 'గ్రాండ్ రైవర్', నదీ తీరమందలి కొండ లోయలలో మేము ప్రవేశించితిమి. శత్రువులింకను ఏబది అరువది మైళ్ళ దూరమున నుందురని మేమూహించి, అచట నొక చిన్న కొండపై విడిసితిమి. అది యంతగా, సమరానుకూలమగు ప్రదేశము గాకున్నను, నలుదెసల సాంద్ర అరణ్యావృతములగు ఉన్నత పర్వతములు చుట్టియుండుటచే అన్యదుర్గమమని నచ్చి నిలిచితిమి.

వెనుక దక్షిణన 'గ్రాండ్ రైవర్' నది ఆ రాతినేలపై కూలంకషమై ప్రవహించుచున్నది. దట్టముగా పెరిగిన తరులతా గుల్మములచే తీరములు ఇంచుకయు కానరాకుండెను. అందందు నదీజలములపై వ్యాపించిన తరు శాఖలనుండి వ్రేలెడి ఆకు తీవె లిరుదెసల నుండి సాగి, ఒండొంటని పెనచి కొని, కృత్రిమసేతువులు నిర్మింప, ఆ దట్టంపు పచ్చపరపులచే నదీజలము పొనుగువడియుండును. ఏ పాలపిట్టయో చేపల తన్నుకొని పోవుటకు ఆకసము నుండి రివ్వున దిగి, ఆ లతా ప్రతానములను ఛేదించునపుడు మాత్రము జలము దృగ్గోచరమై యేటి వాలు తెలియును.

దూరమున కానవచ్చు 'డాంపెన్' పర్వతాగ్రముల జొత్తిల్ల జేయు అపర సంధ్యారాగము క్రమముగా పలుచనై వెలవెల బారగా, మూసికొనివచ్చు అంధకారమున మా

శిబిరమును ముసుగు వడెను. అంత నా నిశ్శబ్ద నిశాసమయమున, గుడ్ల గూబల కూతలును, పహరా వారి సమ విభక్త పాదవిన్యాస ధ్వనియును తక్క మరియొకటి వినరాదయ్యెను.

నిర్విరామ ప్రయాణములచే బడలి, మేనులు మరచి, మేమందరము నిద్రించుతరి, భయదములగు విప్లావక సమర గీతారావము లొక్కపెట్టు మింటిదెస వీతెంచెను. మేము త్రుళ్ళిపడి చూడ ఎదుటనున్న పర్వతాగ్రముల యందలి ఉన్నత తరుశిఖరములెల్ల భగ్గున వెలిగిపోవుచుండెను. భయంకరమైన ఆ యగ్నితేజములో మరింత ఎఱ్ఱనై కాన్పించు అరుణశరీర నీగ్రో సమూహములును, సంకర సమూహములును, మాకు ప్రత్యక్ష మయ్యెను. అవి 'బైసో' సేనాని నడపెడి మహో సైన్యములు!

ఇంక నేమున్నది ? మింటినుండి యూడిపడినట్లు ప్రత్యక్షమైన ఆ విరోధివర్గమును గాంచి మా దళవాయిలెల్ల తమతమ మూకల నెచ్చరించి కూర్చుకొనన జొచ్చిరి. రణభేరీ భాంకృతులును, భూరి కాహళీ ధ్వానములును శిబిరమెల్ల ప్రతిధ్వనింప మా మొనలెల్ల తత్తరపడుచు లేచి యెట్టెట్లో మొనకట్టసాగెను. కళవళపాటులో నున్న మాపై దూకుటకు అదే అదనైనను శత్రువులు మాపై కురుకక, ఏలనో అట్లే నిలిచి చూచుచు సమరగీతములు పాడుచుండిరి.

నదీజలమువంక నోరగియున్న ఒక పర్వతాగ్రముపై సమున్నతాకారుడగు నీగ్రో యొక డొంటరిగా నిలిచి యుండెను. గొడ్డలియు, ఎడమచేతి ఒక రక్తారుణధ్వజమును దాల్చి

నిలిచిన ఆ భయదాకారుడే పీరటు. నాచేత నపుడు తుపాకియే యున్నచో, పదరితనమని యైన నెంచక, వానిని గురిచేసి యుందును. ఆ పీరటు సమరగీతము పల్లవి నందుకొని పాడి, చేతిలోని ధ్వజమును ఆ యున్నతశిఖరమున నాటి, తన గండ్రగొడ్డలిని మా సేనలలోనికి విసరివైచి గభాలున ఆ నదీ ప్రవాహమున దుమికి అదృశ్యు డయ్యెను. అదిగాంచి నా చేతులార వానిని సంహరించు భాగ్యము లేకపోయె గదా అని విచారపడితిని.

అంత ఆ నీగ్రో మూకలు మాపై గండశిలలు దొరలించియు బాణవర్షము కురిపించియు, తుపాకుల ప్రేల్చియు, చిందరవందర చేయసాగిరి. మా వాళ్ళును చేతి కందక దవ్వై యున్న శత్రువుల యెడ వ్యర్థములైన బాహువులను, ఆయుధములను నిందించుకొనుచు, గండశిలల పాటునకు, తుపాకి గుండ్ల ప్రేటులకు, వాడి నారసముల పోటులకు, నలగి, కలగి, తొలగి పోనేరక, నలుదెసల బారలు సాచుచు కలగుండు వడ జొచ్చిరి. ఆ సమయమున నదీ ప్రవాహమునుండి హఠాత్తుగా ఒక భయంకరమైన పెనుమ్రోత వెడలెను.

మాలో శిలాపాతముచే మిగుల నొచ్చిన దళ మొకటి నదీజలముపై దట్టముగా నల్లుకొన్న తీగలమరువున డాగవలెనని ఎంచెను. ఈ యూహ ముందుగా తాడ్యూసునకే తట్టినది.

(ఈ పట్టునకు వచ్చునప్పటికి కారణాంతరముచే కథ ఆగిపోయినది.)

# 20

చేతికి కట్టు కట్టించుకొని, తాడ్యూసు తిరిగివచ్చి, మెల్లగ పిల్లివలె గుడారము సొచ్చి, అవర్నీ చెప్పు కథ నాల కించుచు, అంగీకార సూచకముగా అభిమాన పురస్సరముగా అరమోడ్పు కంట తల త్రిప్పుచు, ఒక మూల నొదిగి కూర్చుండెను. ఆతడువచ్చి అప్పుడే పావుగంట దాటిపోయి నను ఆతని రాకను ఉనికిని వారిలో నెవ్వరు గమనింపరైరి. కాని తన పేరు ప్రస్తావింపబడుటనుబట్టి మౌనము వహించి యుండుట పాడికాదని ఆతడు అవర్నీతో 'తమకు నాపైగల యభిమాన మట్టిది' అని నవ్వుచు పల్కెను.

ఆ మాటవిని అందరు గొల్లున నవ్విరి.అవర్నీయు అతని దెస తిరిగి కొంచెము కోపముతో "ఏమీ! మీరిచ్చటనే యున్నారా?మరి మీ చేయిగతి?" అని ప్రశ్నించెను. అల వాటు లేని బహువచన ప్రయోగమున అవర్నీ తన్ను సంబో ధించుట ఈ వృద్ధభటుని మనసునకు చాలా కష్టమయ్యెను. పొరలివచ్చు కన్నీటిజాలు దిగమింగుటకోయన నాతడు పెడమొగము పెట్టి, 'మీరు' అని మన్నించి మీయీ ముసలి సార్జెంటును తమకు చిన్న బుత్తురని నే నెన్న డనుకొనలేదు ! అని సన్నని యెలుగుతో ననెను.

వెంటనే అవర్నీ "చెలికాడా! క్షమింపుము. నే నేమం టినో నాకే తెలియదు. సైపుము, సైపవా?" అని నొచ్చు కొనెను.

కనుకొలకుల నుండి బాష్పజాల మనివార్యమై జాలు వార సార్జెంటు 'ఇది మూడవసారి. కాని యివి ఆనంద బాష్పములు' అని సాభిప్రాయముగా బల్కెను.

అంతలో నిర్వారి మనస్సులను కలత చేసెను. క్షణకాల మందరును మౌనము దాల్చియుండిరి.

పిమ్మట అనక్ష్న 'పోనీ యిప్పుడు చెప్పుము, తాడ్యూస్! ఆసుపత్రిలో నుండక యేల వచ్చితివి?' అని లాలించి యడిగెను.

'చిత్తము రేపటికి మీ నిశ్చయమును జరిగించు కొనుటకై సేయ మందు రేమో కనుగొన వచ్చితిని.'

ఆ మాటలకు హెన్రీ "తాడ్యూసు! మంచిపని చేసితివి గాని, ఆ చేతికి మరికొంచెము దూది వేసి కట్టవలెనేమో డాక్టరును కనుగొంటివేని అంతకంటె బాగుగా నుండును." అని నవ్వెను. 'పాస్కలు' దానిపై నందుకొని, "సేదదీరుట కించుక ద్రాక్షారసము త్రాగవచ్చునేమో కనుగొన్నను మరింత మంచిదియే. మేటి మొనగాడా! డస్సియుంటివి. ప్రస్తుత మీ బ్రాందియైన నించుక త్రావుము. ఒకరికి మంచిది." అనెను.

'చిత్త'మని తాడ్యూసు ముందుకు వచ్చి, విశ్రముడై యెడమ చేత గ్రహించుచున్నందుకు నొచ్చుకొనుచు, అందున్నవారి సౌఖ్యమును వేడుచు బ్రాంది యంతయు ద్రావి కథ తానందుకొని, 'చిత్తము! కథ ఎంతవరకు వచ్చినది? అవును జ్ఞాపకమున్నది. తీవల క్రింద దాగవలెనను ఊహా, తమరు సెలవిచ్చినట్లు, ముందుగా నాకే తట్టినది. నిజమే,

నెత్తిని రాళ్ళవర్షము కురియుచుండ, ప్రయాణించుచున్న మా సైన్యమును రక్షించుటకు నాకింకొక దారి కనపడ లేదు. కాని మా దళనాయికి ఈ రాని కారణమును ఎంత చెప్పినను మునిగిపోదుమను భీతిచే నాతడు నా మాటవినక మొండిపట్టు పట్టెను—చిత్రము, మన్నింపుడు—ఇంతలో కొండపైనుండి దొర్లి పడిన పెద్దరాయి యొకటి, నీటిలో పడక ఆ తీగలపై అట్లు నిలచియుండుట చూచి, ఆయన ధైర్యము తెచ్చుకొని 'రండు. మనుషులవలె ముక్కుమూసుకొని చచ్చుటకన్న రణరంగమున వీరులమై మరణించుట మేలు, రండు!' అని మమ్ము హెచ్చరింపుచు_ఆయన చాలా తెలిసినవాడు లెండి_ 'తాడుమ్యాసూ! ముందు నీవు దిగియెడి పక్షమున మేమును నిన్ను అనుసరింతుము! అనెను. 'చిత్త'మని నేను దిగ్గన లేచికట్టు దిగుటకు మెల్లగా జారి, ఆ తీవ అల్లికల నవలంబించి వ్రేలాడితిని. అంతలో నెచ్చటి నుండియో వచ్చి, క్రింద నెవడో నా కాళ్ళు గట్టిగా పట్టుకొని ఉయ్యేల లూపుచు నీటిలోకి లాగ జొచ్చెను. నేనాపట్టు విడిపించుకొనుటకు పెనగులాడుచు, వెనుకవచ్చు వారలను "వేగముగా రండో" యని కూయుచు చుండగనే, నా దేహమున నైదారు కత్తివ్రేటులు పడెను. అంత నతిరయమున మా వారు కొందరు బాసటయై వచ్చిరి. పిమ్మట ఆ తీవపందిరి క్రింద కొంత తడవు పింతదొమ్మి ప్రవర్తిల్లెను. అచట దాగిన వారు 'మారన్ రూజి' నీగ్రోలు. మేమువచ్చి తమ తలలపై నట్లు దుమికెదమని వారెరుగరైరి.

వారిని ఆ నీటిలో గాలించి పట్టుకొనుట కది సమ

యము కాదయ్యెను. అట్లే ఒకచేత ఈదుచు, ఒకచేత వ్రేయుచు హుమ్మని యార్చుచు, తిట్టుచు, కొట్టుచు, మేమును చలము డింపక పోరదొడంగితిమి. కాని మా గంతలు బొంతలు తడిసి బరువెక్కి డాళ్లుకవాళ్ళ భారము దాపకి ఓపజై మేము నీట మునుగుచుండ, ఏ భారమును లేని ఆ నల్లవారు చేపలవలె మిలమిల ఈదుచు పోరజొచ్చిరి. కాని అనాచ్ఛాదితములగు వారి [illegible] మాత్రము, మాకత్తి వేటులకు సుకరముగ నెరయగుచుండెను. మాలో, మా దళనాయి వంటి ఈతరాని వారు తీగలు పట్టుకొని వ్రేలాడుచుండ, వారి కాళ్ళు పట్టుకొని నీగ్రోలు వ్రేలాడుచుండిరి.

ఆ గందరగోళములో మహాసత్త్వుడగు నీగ్రో యొకడు మా సైనికుల నైదార్గురను నిల్వరించి, రక్కసివలె పోరజొచ్చెను. నేనది గాంచి ఆ వెసను ఈదుకొని పోయి వానిని పీకటుగా గుర్తింపితిని. వానినే 'బగ్'—ఆ! మఱచితిని. ఆ సంగతి నిప్పుడు చెప్పరాదు. ఔనా? స్వామీ! చెప్పవచ్చునా? గాలి ఫెటు కోట పట్టిన నాటినుండి వానిపై నేను పగ పూని యుంటిని గాన నిదియే తఱియని వాని నాక్రమించి గట్టిగా కంఠము నొక్కి పట్టుకొంటిని. వాడంత నొక్క వ్రేటున నన్ను వదలించుకొనుటకు బాకుపై కత్తి పొడవబోవుచు అంతలో నన్ను గుర్తించి, పొడుచుటమాని నాకు బందియయ్యెను. ఇంతకును అది వాని దుర్విధి!—అగునా? స్వామీ! అంతేకాదు! వాడటు బుద్ధిపూర్వకముగా బంది కాకుండునేని పాపము వానికా, అది యంతయు మీరు క్రమముగా వినియెదరు లెండు, ఇపుడుకాదు.

ఆ విధమున పీరటు నాకు బందియైనటు గాంచి వానిని విడిపించుకొనుటకు నీగ్రోలందరు నాపై కురికి రాజొచ్చిరి. వారినిగాంచి పీరటు' బహుశః వాళ్ళందరు తెగుదురని తలచెనేమో, వారి భాషలోనేమో చెప్పెను. ఆ నీగ్రో లందరు కన్నుమూసి తెరచునంతలో నీటమునిగి మటు మాయమైపోయిరి.

ఎంతో వింతయగు నీటిలోని ఆనాటి పోరాటమునకు వేడ్కచెంది ఆనందించు భాగ్యము నాకు లేకపోయెను. ఆ కయ్యమునందే నావి పది తూటాలు తడిసి చెడిపోవుటయేకాక, నా చేతిప్రేలుకూడ తెగిపోయినది. ఆ పాడు కయ్యమునందే కదా, పాపము, మంచభాగ్యుడగు ఆ —— ఇంతకు నిదియెల్ల ఇట్లు కావలసియున్నది. ఏమి, స్వామి? ఎవరేమి చేయగలరు!"

(అనుచు సార్జంటు ఆవేశము వచ్చిన దివ్యద్రష్టవలె చేతులు మింటిదెస చాచి నిలచెను)

అవర్నీ కూడ కళవళపడుచు "నిజము చెలికాడా! నీవు పల్కినది నిజము. ఆరాత్రి నా పాలిటికి కాలరాత్రి యైనది." అని తదేక ధ్యానమున మైమరచుచుండ, వారెల్ల 'అవ్వాలి కథ ఏమయ్యెను? చెప్పుము' అని బలవంతము సల్పిరి. అంతకొంత తడవునకు అవర్నీ మరల ఇట్లుచెప్ప సాగెను.

## 21

మహా శిబిరమునకు వెనుక దెస తామ్యాసు చెప్పిన ఈ చిత్రవృత్తాంతమెల్ల జరుగుచుండ, నేను కొంత సైన్యమును

వెంటగొని, చిట్టీత పొదలను చాటుచేసి కొనుచు, మెల్లగా ఎట్టయెకటి పర్వతశ్రేణి చేరనేగి, అందు "నెమలిగుట్ట" అన బహు ఉన్నత శిఖరము నెక్కితిని.

అట నిలిచి, మా కట్టెదుటి గుట్టపైనున్న నీగ్రోలపై మేము తుపాకులు ప్రేల్చదొడగితిమి. వాళ్ళకు చాలినన్ని తుపాకులును మందును లేవు. కావున ఎంతసేపని మా కాల్పులకు ఎదురు ప్రేల్చ జాలక, బిగువు చెడి, బింకము దక్కుచుండిరి. మేము ఆయుధ నెరగి, అవిరామముగా తూటాలును, గుండ్లను చిత్రముగా కురిపించితిమి. వాళ్ళు దానికి తాము సూర్యాఘాత కాగ నేరక, తమతో మిడిసి కూలిన పీనుగులను మా పైవిసరవేసి, ఆ పర్వతములు విడిచి పిట్టలవలె ఎగిరి పారజొచ్చిరి. అంతట మేము తత్తర పాటుతో అచట నున్న పొడవుపాటి చెట్లను కొన్నిటిని కూల్చి, వాటి కొమ్మలు తాటి నారతో కలియ గట్టి, ఒక వంతెనగా నిర్మించుకొని, దాని మూలముగా అవలికి దాటబోయి, వాళ్ళు విడిచి చన్న గుట్టల నెల్ల ఆక్రమించుకొని, అటుపిటిచి పరసైన్యముపై మరల విక్రాంతి చూప కడగితిమి. దానితో వాళ్ళు పూర్తిగా ధైర్యము చెడి శోక వివర్ణములగు వదనము లరచేత మోది కొనుచు, పలుమారు 'బగ్ జార్గల్' పేరు తడవుచు నార్వదొడగిరి. 'మూరెన్ రూజ్' నీగ్రోలలో చాలా మంది మింటిపై తలచూపుచున్న ఆ రక్త వర్ణ పతాకము చుట్టును సాగిలబడి మ్రొక్కి, దానిని ఆ గుట్టపై నుండి పెకల్చి, నదీజలమున విసరివైచి, తాము ను అందు గుభాలు గుభాలున దుమికిరి. మా రక్తాసక్తులకు కార

ణము, వారి నాయకుఁడేఁగుటయో, బందియగుటయో కానోపు.

మే మింకను సమరోత్సాహము డింపక, అందఱు తప్పి దారిన శత్రుసైనికులను భల్లములతో పొడిచి వేటాడనెంచి, ఇనుమడించిన పట్టుదలతో నురవడించితిమి. వెన్నంటి వచ్చు అనుచరుల నెల్ల కడచి, నేనా చెట్ల వంతెనపై నరుగుచుండ, అవ్వలివైపున నొక బానిస ఆ వంతెన నొక్క గొడ్డలిపెట్టున తుత్తుమురు సల్పి అయ్యగాధమున గూల్చెను.

నేను వెనుదిరిగి చూచునంతలో పదిమంది నీగ్రోలు నన్ను చుట్టుముట్టి నిరాయుధుని గావించిరి. అయ్యగాధమున కావల నున్న నా సైనికులు గుండ్ల వర్షము కురిపించుచున్నను లెక్కసేయక, వాళ్లు, సింహవిక్రమము నెరపుచు చేజిక్కక యున్న నన్ను తుదకెట్లో పాశబద్ధు నొనర్చిరి. పిమ్మట మా సైన్యముల సింహనాదములును, హాహాకారములు సల్పుచు గుట్టల కెగబ్రాకు శత్రుపలాయనమును నా మనస్తాపము నించుక యుపశమిల్ల జేసెను.

అంతనొక బలశాలి నన్ను తన బుజములపై నెక్కించుకొని నడువ, నా బందెకాండ్రందరు వెనువెంట నడచి మేకల వలె గుట్టలపై చెంగు చెంగున దుముకుచు పరుగెత్తి, తుద కరణ్యమార్గము పట్టిరి. అప్పటికి వాళ్ళ చేతి దివ్వెల వెలుగు నశింప, గ్రుడ్డి వెన్నెల వెలుగున నరిగితిమి.

## 22

ఎన్నో అడవులు గడచి, దారికడ్డముగా ప్రవహించు

కొండవాగులు దాటి, తుదకు పర్వత పంక్తి పై భాగముల యందొకచోట ఆశ్చర్యభయములు గొలుపుచున్న ఒక లోయను జొచ్చితిమి. "జంట కనుమలు" అనబడు పర్వత శ్రేణిలో చుట్టు వలగొనియున్న కొండలమధ్య తల్లి గోమిడి లోని బిడ్డవలెనున్న ఈ లోయను అంతకు మున్నెపుడు నేను కని విని యెరుగను. చరియలలో అందందు గుంపులు గుంపులుగా పెరిగిన తాటిచెట్లతో, అంతటను కలయ మొలచిన లేబచ్చిక బయళ్ళతో ఆ ఏకాంత ప్రదేశము ముచ్చట గొల్పుచుండెను.

అప్పటికప్పుడే అంతటను తెల తెల వేగినను ఆ లోయలో మసకచీకటులు మసలుచునే యున్నవి ఆ యున్నత గిరుల సహజ శీతలతకు వేగుబోక చల్లగాలితోడై మమ్ము వడవడ వడకింపసాగెను. అందందు వెలుగుచున్న నీగ్రోల నెగళ్ళ మంటలకు ఆ పలుచని చీకట్లు విరియుచుండ విప్లావకుల మూలబలమునకు విడిదిపట్టయిన ఆ ప్రదేశమునకు ఒక్కటొక్కటిగా నీగ్రో దళములును, సంకర జాతుల దళములును విషాద క్రోధసూచకములగు కలకలారావములతో చేరవచ్చుచుండెను. అంతకంతకు పెరుగుచున్న ఆ మూకలతో నెగళ్ళ మంటలును మెండుకొనజొచ్చెను.

నన్ను మోసి తెచ్చిన నీగ్రో అచట నొక చెట్టుకడ నన్ను కూర్చుండ బెట్టగా, నిర్వికార మానసముతో ఆ వింత నెల్ల పరికించు చుంటిని. వాడు తన పటకాతో నన్ను చెట్టునకు చేరగిల బడునట్లుగా గట్టిగా బంధించి, నేను తన సొత్తని

హెల్లము చేయుటకు తన ఎత్తినకత్తియు నా శిరమున తగిల్చి ఇంక నన్నెవరును ఎత్తుకొని పోజాలరనియు నేను కట్లుత్రెంచుకొనజాలననియు నమ్మకము కుదుర్చుకొని, వాడు నన్ను విడిచిపోవ ప్రయత్నించుచుండగా నేను వానినాపి, వాళ్ళ భాషలో నిట్లడిగితిని. "నీవు 'డాంసన్' గుంపులోని వాడవా? 'మారిన్ రూజ్' బలములోని వాడవా?" "మారన్ రూజ్ బలములోని వాడనే" అని వాడు సగర్వముగా బదులు చెప్పెను. అప్పుడు నాకొక యూహ తట్టినది. అంతకుమున్ను బయసో సేనాని తనచేత చిక్కిన వారినెల్ల నానా విధముల హింసించి చంపుట వినియుంటిని కావున, వాని చేతులలో పడుదునేమోయని భీతిపొడమి, ఎట్లయిన దయాపరుడగు 'బగ్ జార్గల్' చేతులలో పడుట మంచిదికదా అనుకొంటిని. ఉభయ పక్షముల నాకు చావెట్లును తప్పదు. అయినను 'బగ్ జార్గల్' చేతిలో పడినచో సుఖమరణము లభించు ననియే నా ఆశ. అటువంటి కోరిక కూడా భీరలక్షణమే కావచ్చును. కాని దుర్మరణము రోత కదా! ఆ ఊహతో నన్ను బగ్ జార్గల్ కడకు గొని పొమ్మని ఆ నీగ్రోను వేడుకొంటిని.

వాడా మాటలు విని ఉలికిపడి, "బగ్ జార్గలా!" అని దుఃఖముతో అరచేత మోదుకొనుచు అంతలో క్రోధ పరవశుడైన వాడివలె పిడికిలి బిగించి, నాపై ఝళిపించుచు ""బైసో'యే నీకు 'బైసో'యే!" అని అరచుచు నన్ను వీడిపోయెను.

వాని ఆ క్రోధదుఃఖములచే నా కా నాటి వృత్తాంత

మెల్ల జప్తికివచ్చి 'బగ్ జార్గల్' నకు చావో బంధనమో మా
చేతులలో మూడెనని నిశ్చయము చేసుకొంటిని. అంతట నా
ఆశ లన్నిటికిని స్వస్తి చెప్పికొని, ఇక బయసో చేతులలో నాకు
వాటిల్లనున్న పాటును గూర్చి మనసు రాయి చేసికొంటిని.

## 23

అనంతరము ఆడువాళ్ళ గుంపొకటి వచ్చి, నేనున్న
చెట్టునకు కొంచెము దూరమున పెద్ద నెగడి వెలిగించెను.
ముంజేతులకు రంగు రంగుల గాజుల వరుసలును, కాలి వ్రేళ్ళకు
మట్టెలును, చెవులకు ఊగులాడు పెద్ద పోగులును, మెడల
పూసల పేరులును, ఎదల తాయెత్తుల దండలును, నడుమున
బట్టలకు బదులు ఈకల కుచ్చులును దాల్చి 'గిరోటీ'లని
చెప్పకయే చెప్పుచుండిరి. గిరోటీలన మీరెరుగరు, చెప్పెద
వినుడు. ఆఫ్రికా దేశపు నీగ్రోలలో అదియొక తెగ. వారు
వెఱ్ఱిమొఱ్ఱి పదములు పాటలు కట్టి పాడుదురు. వారికి ఇల్లు
వాకిలిగాని, ఒకచో నిలుకడగాని ఉండదు. కొన్నాళ్ళి
రాజ్యమున, మరికొన్నాళ్ళింకొక రాజ్యమున పాటలుపాడుచు
తిరుగుచుందురు. ఇది వీళ్ళ స్థితి.

ఆ గుంపు ఆ నెగడి చుట్టును చేరి, ఒండొరుల చేతులు
దండగా కలిపి పట్టుకొని కూర్చుండగా, వారిలో నాయకురా
లనదగిన ఒక ముసలిది తన జుట్టులో నొక పాయ ఊడబెరకి
స్నగ్లో మంత్రం కాబోలు, ఉచ్చరించెను. అది చూచి తక్కిన
వాళ్లు అట్లే కేశపాశము లూడబెరికి ఆ నిప్పులలో వేయ

జొచ్చిరి. అందరును నూతులు పిరుచుచు, గొంతు లెగర
వేయుచు, కన్నుల త్రిప్పుచు, ఏమేమో వికృతచేష్టలు
చేయదొడగిరి. విచిత్రమైన ఆ భూతావాహనము, ఆ వికార
చేష్టలు చూచి, నాకు నవ్వువచ్చి ఆపుకొనలేక పకపక
నవ్వితిని. ఎట్టి కష్టపరిస్థితి యందున్నను, ఎంత విచారపూరి
తుడై యుండినను, మానవునకు ఒక్కొక్క యెడ తనను తెలియని
తకిలి నవ్వు వచ్చుట సహజము. విషాదపూరితమై యున్న నా
హృదయమునుండి కూడ అట్టి నవ్వు రాగానే రంగమంతయు
బీభత్సముగా పరిణమించెను.

నా నవ్వుచేత విఘ్నము సలుపుచున్న తంతు చూచెను
కాంబోలు, ఆ జంటలెల్ల గిఱుక్కున మరలి నా వంకజూచి,
చప్పున లేచిరి. అంతవరకు వాళ్లు నన్ను చూడరైరి. అట్లు
లేచుటయే తడవుగా 'బ్లాంకో' 'బ్లాంకో' యని హుంక
రించుచు, పండ్లు కిలించుచు, గ్రుడ్లు మిటకరించుచు, ఆ సంప
తయు రివ్వున నాపై ఉరుక జొచ్చెను. రౌద్రరసము తాండ
వించెడి, ఆ భయంకరాననములు చూడ, నాకు ఒడలు జలద
రించెను. నన్ను ఇంతింతి ముక్కలుగా చీల్చివేయువలెననియే
వాళ్ళ తలంపు కాంబోలు. ఇంతలో నాయకురాలు ఆ రాకాసుల
నెల్ల చేసన్నచే నంతంత నిలిపి, 'జోటీ, జోటీ' అని పెడమూళ్లు
ఉచ్చరించెను. అంత ఎచట నున్న దచటనే నిలిచి మొలకు
చుట్టుకొన్న ఈకల కుచ్చులనెల్ల బిరబిర విప్పి, ఆవల పార
వేసి, వికటహాసముతో వింత నర్తనము ప్రారంభించెను హస్త
విక్షేప నేత్రవిన్యాస మాత్రముగు ఆ నృత్యమును నీగ్రోలు

'లాచిక' యందురు. ఆనంద సూచకము కాదగిన ఆ నృత్యము వికృత పాత్రలు సలుపుచుండగా జుగుప్సా మాత్ర ఫలమే అయ్యెను. ఆ నృత్యము చేయుటలో ఒక్కొక్కతెయే నామీదికి వచ్చి, నా మోములో మోము పెట్టి, జంకెనలతో 'తెల్లవాడా! పవిత్రమగు మా తంతు మైలపడ జేసితివి గాన, నీకు కానున్న ఘోరశిక్ష ఇట్టిదని విప్పి చెప్పునదివోలె, చేతులు త్రిప్పుచు అభినయింప సాగెను. మానుషాదులగు నాటవికులు తాము బలిపెట్టబోవు ప్రాణి చుట్టును కొంతసేపు నృత్యము సల్పుదురని ఎన్నడో వినియుంటిని. నా కపుడా మాట జ్ఞప్తికి వచ్చి ఈనర్తనము మహోగ్రవధా పరిణామము ఘోరమగునని ఊహించి, చేయునది లేక కానున్నది మానదని నిశ్చలుడనై ఊరకొంటిని. కాని ఎంత ధృతి వాల్చియున్నను ఆ గుంపులో ఒక్కొక్కతె ఒక కత్తియో, రంపమో, గొడ్డలియో, నారసమో నెగడి నిప్పులలో గ్రుచ్చుట చూడగ ఒడలు జల్లుమనుచు నుండెను. ఆ ఆయుధములెల్ల కణకణ కాలుచుండ నృత్యము కూడా కడముట్టుచుండెను. పిమ్మట నాయకురాలు సంజ్ఞ చేయగానే, ఒక్కొకతెయు ఒక్కొక ఆయుధమును నిప్పులలో నుండి తీసి పుచ్చుకొనెను. ఆయుధములు చాలక పోవుట చేత కొందరుకాలుచున్న కట్టెలుదాల్చి నిలిచిరి. నే ననుభవింపవలసిన శిక్షయెట్టిదియో నాకు పూర్తిగా అవగతమయ్యెను. నాయకురాలుమరల ఏమోసన్న చేయగనే ఆ నృత్యమునకు ముక్తాయింపు ప్రారంభించిరి. ఆ మహాభూతములు ఎర్రగా కాలిన ఆ కొర ముట్లతో లయ తప్పకుండ కోలాటము వేయుచు తాండవింపసాగిరి. చిట

పటమును శబ్దముతో నిసుక రేణువులవలె రవ్వలు లేచి ఎగుర జొచ్చెను. నేను కనులు మూసుకొని కణకణలాడు ఆ ఆయుధములు ఏ క్షణమున నా మేన జుర్రున జూడి చర్మము మాడి, ఎముకలు నుసినుసియై, కండలు 'చుయ్ చుయ్' అనునో అని ప్రాణములు బిగబట్టుకొని యుంటిని. ఘోర యాతనా ప్రదమగు ఆ ముహూర్తము దాని పుణ్యమా యని అనతి కాలముననే తుదముట్టెను.

దూరమున నా బంటెకాని కేకలు వినిపించి, కనుల విప్పిచూచు సరికి తెల్లగా తెలవారెను. వాడు నన్నేమియో జడిపించుచు చేరవచ్చెను. వాని జూచి కాకున్నను వాని వెంట వచ్చిన మరియొక వింత మానిసిని పొడగని నా చుట్టునున్న రాకాసులు తమ వికృత నర్తనము మొకింత ఆపిరి.

వీరి విశృంఖలతకు ఆరీతి విఘ్నమై వచ్చిన ఆ క్రొత్త మానిసి కురుమట్టమై వలమైన ఒడలితో, మరుగుజ్జువలె చూపట్టెను. వాని మోమంతయు గప్పి భుజములపై వ్రేలు తెల్లని మేలిముసుగునకు కన్నులకడ నోటిచెంత మాత్రము మూడు రంధ్రము లున్నవి. రోమశమై తామ్రవర్ణమైన వాని వక్షమున బంగరు గొలుసు చివర విరూప సూర్యవిగ్రహ మొకటి వ్రేలుచుండెను. చిత్రవర్ణ శోభితమై వాని వికృత పాదములవరకు జీరాడుచున్న గాగరాను ఎర్రరంగు కాసెతో మొలకు బంధించి, అందు దోపిన చురకత్తి వంకపిడి పైకి తొంగి చూచుచున్న దానివలె నుండెను. ఆ పిడి చెంతనే పగడాల జపమాల యొకటి వ్రేలాడుచుండెను. వాని చేత

తెల్లని దంత మొక్కటే గలదు. చిరుగజ్జెలతో వాని శిరమున మెరయుచున్న కుళ్ళాయిని, దానిపై నున్న వత్తిమొత్తి వ్రాతలను జూచి అది 'హెంబ్రా కుళ్ళాయి' అని నేను గుర్తించితిని. పాప మా నిర్భాగ్యుని నెత్తురేకాబోలు నా కుళ్ళాయిపై అంటంటు మరకలై కాన్పించుచుండెను. వాని మృతికి ప్రబల సాక్ష్యముగ ఆ నెత్తుటి మరకలను గాంచి ఆ మా నమ్మిన సేవకునకు మరల కన్నీళ్ళు విడిచితిని.

ఆ విచిత్ర పురుషుని చూచినంతనే గిరోటీలందరు భయవినయ సంభ్రమములతో 'మాంత్రికుడు' 'మాంత్రికుడు' అనుచు నేలబడి వానికి సాగిలి మ్రొక్కిరి. ఈ చర్య జూచి వీడెవడో బయసో దళములో తిరుగు మాంత్రికుడు కాబోలు అని నే ననుకొనుచుండగ, వాడును గిరోటీల చెంతకేగి గంభీర స్వరమున 'చాలు, ఇక చాలు. ఈ బందీని బయసో కడకు దీసుకొని పొండు" అని వారితో అనెను.

అనుటయు ఆ మూక యెల్ల ఒక్క గంతున ఆవలికి తొలగి, చేతనున్న ఆయుధములు విసరిపారవైచి, ఈకల కుచ్చులు మరల మొలకుచుట్టుకొని, ఆతని కనుసన్న గ్రహించి మిడుతల దండువలె ఎగిరిపోయెను.

పిమ్మట ఆ మాంత్రికుడు నావైపు చూచెను. చూచి ఒక అడుగు వెనుకకు వైచి, ఆ పనుచున్న గిరోటీలను వెనుకకు పిలుచు వానివలె చేతికఱ్ఱ వారి దిక్కునకు చాచి, మరల ఏమి తోచెనో ఊరకొని, "పాపి, పాపి" అని గొణిగికొనుచు

నా బందికాని చెవిలో నేమో చెప్పి, గాథ చింతానిమగ్నుడై అల్లనల్లన అటు తొలగిపోయెను.

## 24

బియసో నన్ను పిలువ నంపెననియు, ఒక గంటలో వాని కడకు నన్ను కొనిపోవుదుననియు నా బందికాడు వచించెను. ఆ మాటలు విని నాకిక ఒకగంట ఆయు వున్నదని గ్రహించి అంత దనుక చేయు పనిలేక, వింతయగు ఆ విప్లవక శిబిరము నంతటు కలియపరికించుచు కూరుచుంటిని.

సమరమున కొల్లగొట్టి తెచ్చుకొన్న పటాలపు దుస్తులును, పాదిరీ వేసములును, ధరించుకొని, నీగ్రోలు ప్రకటించుచున్న గర్వ ప్రాభవములు వినోదకరముగా తోచెను.

నేను అవస్థాంతరుడనై యున్నచో వారు చూపు నీటు గోటులకు తనివితీర నవ్వుకొని యుందును. పాదిరీల నిలువు లుంగీలు తొడుగుకొని, వీరోచితములగు బిరుదు చిన్నెలు వానిపై నలంకరించుకొన్న వారుకొందరు, వీర వేషములు దాల్చి, తలపై పాదిరీల ముమ్మూలల టోపీలు ధరించిన వారు కొందరు, సవిలాసముగ తిరుగజొచ్చిరి. చిన్ననాటినుండి మొదలు విరుగ పాటుపడుచు, తీరికకు, స్వేచ్ఛకు మొగము వాచియున్న వారుగాన, ఆ శ్రమలెల్ల తీరుటకోయన నిర్వ్యాపార సుఖమును తనివితీర అనుభవించుచుండిరి. కొందరు నెగళ్ళ పొంత శిరములిడి ఆ లేత యెండలో హాయిగ మైమరచి నిదురించుచుండిరి మరికొందరు తాటియాకు గుడిసెల ముందు

వెలుగు నెగళ్ళపైఁబడి క్రోధారుణములై కొంతసేపు, శోభా
దరిద్రాణములై కొంతసేపు కాన్పించు నేత్రములతో ఏవియో
కూనురాగములు తీయుచు ఉబుసు పుచ్చుకొనుచుండిరి.

బిడ్డలు తమకు చేదోడుగా పొయ్యిలకడ కూరుచుండి
వంట చేయుచున్న ఇల్లాండ్రను, భర్తలు క్షేత్రస్వాముల
ఇండ్లలో దోచుకొని వచ్చిన పెద్ద పెద్ద తామ్రభాండములలో
కూరలు దుంపలు, సాయధాన్యములు, పప్పులు, పండ్లు, వివిధ
మృగమాంసములు వేసి పెద్దపెద్ద తెడ్లతో కలియబెట్టుచు
వంటలు చేయుచుండిరి. శిబిరమునకు కొద్ది దూరములో గిరో
టీలు నెగళ్ళ చుట్టును చేరి, సితారులు మీటుచు, కంజరాలు
ప్రయోగించుచు పాడుకొను పాటలు అప్పుడప్పుడు చెవుల బడు
చుండెను. బయసో సేనాని ఆ మహాశిబిరమును ముట్టడి
వేళల సంరక్షించుటకు చుట్టును వలయాకారముగ తుపాకి
మందుతో నింపి నిలిపిన బండ్లు తక్క వేరు సాధన మేదియు
లేదు. కొందరు సైనికులు మాత్రము ఉన్నత ప్రదేశముల
నిలిచి శిబిరము భద్రముగా నున్నదని తెలుపుటకు ఒకరితో
నొకరు "వట్టిది ఏమియు లేదు" అని గొంతులు బ్రద్దలగునట్లు
కేకలు వేసి చెప్పుచుండిరి. అప్పుడప్పుడు నీగ్రోలు నన్ను
చూచు వేడ్క అగ్గలముకాగా గుంపులు గుంపులుగా నా
చుట్టును జేరి నాపై భయంకర వీక్షణములు పరపుచుండిరి.

## ౨౫

కొంతసేపటికి ఆయుధపాణులగు నీగ్రో భటులు నన్ను

తోడ్కొని పోవుటకు వచ్చిరి. వారొసగిన రొక్కపు సంచి గైకొని నా బానిసకాడు నన్ను వారి కొప్పగించెను. పిమ్మట వాడా పచ్చికపై కూర్చుండి, ఆ రొక్కపు సంచిని గ్రుమ్మరించి, విప్పారిన మొగముతో లెక్కించుకొనుచుండ భటులు నన్నట నుండి కొనిపోయిరి. పసుపురంగు పట్టీలు వేసిన గౌర వర్ణములగు దుస్తులు ధరించి, ఎఱ్ఱని పేలికలతో ముడిచిన శిరస్త్రాణములు దాల్చి, చేపల బుట్టలవంటి మందు సంచులు భుజముల తగిలించుకొని, బాకులు, తుపాకులు, కత్తులు బూని నన్ను కొంపోవుచున్న ఆ భటులు బయసోకు అంగ రక్షకులని పిమ్మట నాకు తెలియవచ్చెను.

మేము చాలసేపొక చుట్టుదారి వెంట నడచి పిమ్మట ఆ లోయలో ఒకచోట ప్రకృతి నిర్మితమైన ఒక్క గుహా ముఖమును చేరితిమి. టిబెట్టు దేశములో నేసిన మెత్తని గుప్పటి ఒకటి ఆ దరీ ద్వారమునకు అడ్డుతెరయై వ్రేలాడుచుండుటవలన లోపల ఏమున్నదియు మా చూపులకు కానరాలేదు. నన్ను కొనితెచ్చిన భటులవంటి వారే రెండు వరుసలుగా నిలిచి దానిని రక్షించుచుండిరి.

అట్టి బరాబరులు సల్పు ద్వారపాలకులకు సేనాపతి ఇచ్చిన చేతి చీటి చూపెట్టి, నా వెంట వచ్చిన వారిలో మొనగాడు ఆ తెర ఇంచుక తొలగించి, నన్ను లోనికంపి, మరల మూసివైచెను. లోపల గుహోపరిభాగమునుండి వ్రేలుచున్న రాగి ప్రమిదలలో దీపములు వెలుగుచుండెను. మధ్య భాగమున ఒక పెనుగద్దియపై నీగ్రో ఒకడు ఆసీనుడై యుండెను.

ఆ గద్దె దేవదారు నిర్మితము. దానిమీద చిలుక రెక్కల ఈకలతో చేసిన తివాచి ఒకటి పరచిరి. అతని కిరుప్రక్కల సేనలు బారులుతీర్చి నిలిచియుండెను.

అన్ని విధముల తెల్ల సేనానుల ననుకరింపవలెనని వాడు వేసిన వేషమున, ఎక్కడ ఏది యెట్లుండవలయునో అట్లులుండక తారుమారై హాస్యజనకమయ్యెను. నడుమున బిగించిన వెలలేని పట్టుదట్టికి, శిరస్త్రాణమునకు, భుజబంధము లను మెరయు బిరుదులకు, ప్రక్కల వ్రేలెడి పిస్తోళ్ళ జంటకు, వాడి కత్తికి అననురూపమైన వాని ఇతర వేషము వెక్కిరింప వచ్చినట్లుండెను. బానిస దుస్తులు తొడుగుకున్న శ్వేతజాతి బాలురిద్దరు వాని వెనుక నిలిచి, నెమలి ఈకల వీవనలతో వీచుచుండిరి. ఏ చర్చినుండియో హరించి తెచ్చిన రెండు ముఖమల్ మెత్తలు వానిగద్దియ కిరుకెలంకుల నలరుచుండెను. గిరోటీల బారినుండి నన్ను విడిపించిన మాంత్రికుడు అందొక మెత్తపై కాళ్ళు ముడుచుకొని చేత తన శ్వేతదండము తాల్చి, బిర్రబిగిసికొని కూర్చుండెను. వానిని చూడగా నాకు చైనా దేవాలయము సందలి పింగాళి విగ్రహము జ్ఞప్తికి వచ్చెను. వాడు తన మేలిముసుగు రంధ్రములలో నుండి నాపై మెరపు చూపులు బరుపుచుండెను.

సేనాని కుభయ పార్శ్వము లందును వాని విజయ చిహ్నములగు ధ్వజపతాకాదులు మెరయుచుండెను. వాటిలో పద్మ చిహ్నితమగు శ్వేతపతాకమును, త్రివర్ణ పతాకమును, స్పెయిన్ దేశపు ధ్వజమును గూడ నున్నవి! చిత్ర విచిత్ర

వర్ణాభిశోభితములగు తక్కువ ఱెక్కముల నడుమ, ఉన్నతమగు నల్లరంగు పడగ యొకటి కలదు. ఆ క్రిందటి సంవత్సరమున తిరుగుబాటు సల్పి అనుచర సహితముగా కొరత వేయ బడిన 'ఓగి' యను వాని పటమొకటి గోడను వ్రేలుచుండెను.

ఆ సేనాని పొట్టివాడు. క్షుద్రరూపుడు. వాని మోమున క్రౌర్య కాపట్యములు తాండవించుచుండెను. కట్టెదుట నిల్చి యున్న నావంక కొంత తడవు దుర్నిమిత్తములు శోధించు చూపులు నిలిపి 'నేనుబైసోను' అని వాడు గాంభీర్యముట్టిపడ గద్దించెను.

చెప్పకయే నే నెరుగుదును వాడు బైసోయని. అయినను క్రౌర్యముద్రితమైన వికటహాసముతో వాడు తనపేరు చెప్పు చుండ నేను వినలేక పోతిని. హృదయము కంపించియు, మోమున వికారము తోపనీక ధీరుడనై నిలిచి యుంటిని.

అంత వాడు వచ్చియురాని ఫ్రెంచిభాషలో "ఓహో! నీ వెన్నున కొట్లు గ్రుచ్చిరేమి? ఈ దేశమునకెల్ల సర్వాధ్యక్షుడైన బైసోమ్రోల తలయైన వంచలేకయున్నావు" అని అధిక్షేపించెను.

నేను అప్పటికిని బదులు పలుకక తిరస్కారభావముతో వాని వంక నొక వాడి చూపు పరపితిని.

"బాగు బాగు! నీవు శూరుడవు వలెనున్నావు. అవు గాక. నా మాటలు విని అడిగిన ప్రశ్నలకు తగిన సమాధాన మిమ్ము. నీ జన్మభూమి ఈ ద్వీపమేనా?" అని ధిక్కరించి అడిగెను.

నేను — కాదు. నేను ఫ్రెంచివాడను.

నా నిశ్చలతకు వాని తల కంటగించినట్లయినది.

బైసో : అట్లయిన మరీ మంచిది. నీ వేషమును బట్టి చూడ పెద్ద ఉద్యోగివిగాని, సామాన్యుడవు కావని తోచుచున్నది. నీ వయస్సెంత ?

నేను : ఇరువది.

బైసో : ఇర్వదవ యేడు ఎప్పుడు వచ్చింది ?

ఈ ప్రశ్నవలన నా దుర్దశావిపాక మంతయు నొక్క మాటుగా స్మరణకువచ్చి నోటమాట వెడలక నిరుత్తరుడనైతిని. వాడు ఔద్ధత్యముతో అదియే రెట్టించి అడిగెను.

నేను : ఎప్పుడా ! మీ "లియోగిరి"ని ఉరితీసిననాడు !

బైసో : ( ఈషత్కోపముతో ) లియోగిరి ఉరి జరిగి ఇరువది మూడు నాళ్ళయినది. నేను నీ కింక్రో పూట ఆయు వొసగుచున్నాను. నేటి రాత్రి నీవు లియోగిరిని కలసికొన్నప్పుడు వానితో 'నేను నీ కంటె నిర్వది నాల్గు నాళ్లు ఎక్కువ బ్రతికితి'నని చెప్పుము. ఫ్రెంచివాడా ! మరియొక మాట వినుము. మేముస్వాతంత్ర్యము సంపాదించుకొన్న సంగతియు, ఈ బైసో సేనాని శిబిరమున నీవు చూచిన తక్కిన విశేషములను మా లియోగిరికి విన్నవింపుము.

అంత నిర్వీర భటుల వశమున నన్నొక మూల కూర్చుండ నాదేశించి, తన యంగరక్షకులలో ఒకనితో "మేము మనసేనల నన్నిటిని పరామర్శింప వలెను. సమావేశ

ఘేరి ప్రయోగింపు” డని యానతిచ్చి మాంత్రికుని దెస తిరిగి, 'స్వామీ! తమరు ఆచార్య వేషమున సన్నద్ధులై, దండునకు క్షేమ సంపాద నార్థము, మన 'కాతలిక్' మతశాస్త్రోక్తము లగు అర్చా విధానములు నెరపుడు' అని మనవి చేసెను.

ఆ మాంత్రికుడు వినయవినమితాంగుడై బైసో సేనాని చెవిలో ఏమో యనెను. అతడు“ఏమంటిరి? బలిపీఠము లేదనియా! అగుగాక భక్తులకు చిత్తశుద్ధి వలయును గాని దేవాలయములతో నేమిపని? తొంటి మన పెద్దలెల్ల ఎచ్చోటనైనను ఆరాధించువారు; పోనిండు పూజా పీఠము లేదని మీకు సందేహ మున్నచో, నిన్న మనము కొల్లగొట్టి తెచ్చిన ఆ పంచదార భోషాణము నుపయోగింపుడు.” అని బిగ్గరగా ననెను.

ఆచార్యుడును సరేనని, వెంటనే ఆ దేవపూజానటనకు అనుగుణముగా ఆ గుహారంగము నలంకరించుటకు 'ఆకల్' చర్చిలో హరించి తెచ్చిన పూజాపరికరములను తెప్పించి పచరించెను.

(ఆ చర్చిలోనే గదా, నేనును మేరీయు, నూత్న దంపతులమై నిలచి దేవతాశీర్వాదముల శిరసావహించితిమి. ఆ దీవనలు, తిట్లైపోయినవి గదా! )

పిమ్మట ఆ భోషాణముపై తెల్లని దుప్పటి యొకటి పరచి, పూజా పీఠముగా మార్చి, దాని మీద ఇరుప్రక్కల రెండు కలశములు నెలకొల్పిరి. అన్నియు సమరెనుగాని సిలువ

లేకపోయినది. అడ్డపిడి వేసియున్న తన చురకత్తిని సిలువగా జేసి, ఆచార్యుఁడా లోపమును సవరించి, బైబిలుగ్రంథము తెరచి, 'సర్వము సిద్ధమైన' దని రెండు బారు లావలగా గూర్చున్న బైసోతో అనెను.

(మా వివాహ దుర్ముహూర్తమున ఆ బైబిలేమా పురోహితు డుపయోగించినది.

అంత సేనాని యానతి నొప్పున గుహాద్వారమున కడ్డముగా నున్న తెర తొలగింపగా, నీగ్రో దళము లొక్క దాని వెనుక నొకటిగా ప్రవేశించి, బారులుతీర్చి నిలిచెను. అంత బైసో టోపీతీసివేసి, పీఠము నెదుట భక్తిపూర్వకముగా మోకరిల్లి "అందరు మోకరిల్లు"డని కేకవేసెను. 'అందరు మోకరిల్లు' డని ఆతని దండనాయకుఁడును అరచెను.

పదపడి, భేరీ భాంకృతులు మ్రోఁగ, దళము లన్నియు మోకరించెను. నేను మాత్రము, దేవుని పేరను,మతముపేరను, నా కండ్ల యెదుట వాఁడు సల్పెడి ఆ మైల తంతు సహింపలేక' మోకరిల్లుటకు నిరాకరించితిని. కాని, న న్నిరువైపుల గాచియున్న భటులు, బలముకొలఁది నా భుజములు పట్టుకొని, క్రుంగదీసి, బలవంతముగా, మోకరింపజేయ, ఆ ఆభాసపూజ యెడ ఆ యణుమాత్ర గౌరవము చూపవలసివచ్చెను. చామర గ్రాహులగు ఆ శ్వేతజాతి బాలు రిరువురు నుపాచార్యత్వము వహింప, ఆ మాంత్రికుఁడా బూటకపు పూజా కలాపమునెల్ల తెచ్చికోలు భక్తితో నిర్వర్తించెను. మున్ముందు తమ సేనా

పతి సాగిలపడుట చూచి, సైనిక వర్గములెల్ల ఆ పీఠసన్నిధాన మున సాష్టాంగముగ నేల వ్రాలెను.

అర్చావిధి ముగియగనే, ఆచార్యుడు పీఠముపైనున్న కలశము పైకెత్తి యిట్లు హెచ్చరించెను, "ఇదుగో మన దైవము దర్శింపుడు. తెల్లవాళ్ళు మనవేల్పును సంహరించిరి. మీరా తెల్లజాతినే రూపుమాపుడు."

ఆ కంఠస్వరము మున్నెచ్చటనో వింటినను సందేహ ముతో నాకొక విధమైన భ్రాంతి జనించెను. వాడు గంభీర స్వరమున అట్లు పలుకగనే సైనికులెల్లరు ఒక్క పెట్టున సింహానాదము లొనర్చుచు ఒరలనుండి ఖడ్గములు లాగి ఝుళి పించిరి. ఎదుట బైసోయే లేకున్నచో నేను ఆ క్షణముననే వారి ఆగ్రహమునకు తొలి ముద్ద అయ్యెడివాడను. చురియను సిలువగా భావించి, పూజించు ఆ పశుప్రాయుల నమ్మించుట కెంత కావలెను! వారెంతకు జాలరు!!!!

## 26

ఈ తంతు ముగిసిన పిమ్మట ఆచార్యుడు మన్ననచూప సేనానియు లేచి, నన్నుద్దేశించి యిట్లనియెను "మేము నాస్తి కులమని మీరు నిందింతురు. ఇప్పుడైనను సత్యము గ్రహించి తివా? మాది స్వచ్ఛమైన రోమను కాతలిక్కు మతము."

వాడీ మాటలు నిజముగనే అనెనో హేళనగనే అనెనో నాకు గోచరింపలేదు.

అంత కొంతసేపటికి ఒక పానపాత్రిక తెప్పించి, దాని నిండ నల్లజొన్నలునింపి, వాటిపైన గుప్పెడు మొక్కజొన్నలు చల్లి ఎల్లరకు కానవచ్చునట్లు పైకెత్తి బైసో ఇట్లనెను: "మిత్రులారా! చూడండి. మీరు నల్లజొన్నలు. మీ శత్రువులు తెల్ల మొక్కజొన్నలు" అనుచు పాత్రనటు నిటు కుదిలింపగా, తెల్లగింజలన్నియు అడుగునకుపోయి కానరాలేదు. వాడంతట ఆవేశముతో "ఏవీ ఇప్పుడు తెల్లగింజలు?" అనెను.

ఈ నిదర్శనము ఆ జనమునకెంత ఆమోదదాయక మయ్యెనో! వారు చేసిన సంతోషధ్వానములకు కొండలు మారుమ్రోగినవి.

వాడు మరింత ఉత్సాహ పూరితుడై మరల ఇట్లుపన్యసింపదొడగెను.

"ఇది మనము శాంతితో నుండదగిన సమయముకాదు. అట్టి పదను తప్పినది. గొర్రెల మందవలె మన మెన్నాళ్ళో ఓపికపట్టి చూచితిమి. తెల్లవాళ్ళు మన జుట్టును గొర్రె బొచ్చుతో పోల్తురు కనుక నేనును ఆ యుపమానమునే గైకొంటిని. ఇంక మనము గొర్రెలముకాము. ఆఫ్రికాదేశపు పెద్దపులులమో చిరుతపులులమో అగుదుము. ఈ తెల్లవాళ్ళ కారణమున మనము మన దేశమునకు కాకుండ పోతిమిగదా! ఒక్క దండోపాయమువల్లనే మనము మన స్వతంత్రతను తిరిగి సంపాదించుకొగలము. ఇది సాహసమునకు సమయముకాదు. దయాదాక్షిణ్యములు లేక శక్తివంతుడై దండప్రయోగము చేయువానికి సర్వార్థసిద్ధియగును. ఈ శ్వేతజాతులు మనకే

కాక మానవజాతికే శత్రువులై ఉద్భవించినవి. వీరు భూస్వాములవేషములతో, వర్తకుల వేషములతో, నరకముఖము నుండి ఊడిపడిన దెయ్యములు. వీరు సొగసైన దుస్తులను దాల్చి, రంగుల ఈకల కుళ్ళాయిలు పెట్టుకొని, తళతళలాడు కత్తులుపట్టి, మూర్ఖీభవించిన అహంకారములోయున, మన భూములు సొచ్చి, స్వేచ్ఛగా తిరుగుచు, మనలను గడ్డిపోచల కంటె చులకనగా చూచుచుండిరి. మనము నల్లగా ఉన్నామనియు, చక్కని దుస్తులు లేవనియే కదా! ఏమీ వీరి పొగరు! విసన కఱ్ఱతో ఈగలను దోమలను తోలునట్లు, మనలను సుకరముగా తోలివేయవచ్చునని వారి తలంపు. కాని మిత్రులారా! మనము పీనుగులమీద వ్రాలు దోమలు ఈగలువలె వీరిమీద పడితిమి. చొక్కాలు లేకపోయినను మన వట్టి చేతులే వారిని కూల్చినవి. వారు ఆ సొగసు దుస్తులతోనే కూలిరి. మన భుజములు నిస్సారములని తలచిరి కాని, పాపము! తోలువాలిచిన కర్రకు చేవ ఎక్కువయని యెరుగరు. ఇప్పుడు కదా మనలనుచూచి ఈ శ్వేతహంతకులు భయకంపితులైరి."

అందరును "అవును భయకంపితులైరి" అని జయ జయ ధ్వానములు చేసిరి.

"ఓ నల్ల సోదరులారా! వినుడు. ప్రతీకారము సల్పి స్వేచ్ఛ గైకొనుడు. ఓ సంకీర్ణులారా! తెల్లవారి వంచనలకు మోసపోకుడు. వారిలో మీ తండ్రులుండుట నిజమే! కాని మీ తల్లులు మాలో ఉన్నారు. ఆప్తులారా! వారెపుడైనా

మిమ్ము 'బిడ్డలారా!' అని పిలిచిరా? మీ తండ్రులమని చెప్పి కొన్నారా? ఈ తెల్లవారు మిమ్ము బానిసీలను గావించి మీ తలలపై స్వారి చేయుటకు మీరు చేసిన పాపమేమి? మీ తల్లుల రక్తము మీ రక్తనాళముల ప్రవహించుటయే పాపమయ్యెనా? మండు టెండలకు కమిలిపోయిన మీ యొడళ్ళకు చినిగిన గుడ్డలేమి? మీ తండ్రులకు వట్టి రోజులలో చలువ దువ్వాలువలు, పండుగనాళ్ళ ముఖమల్ దుస్తులు ఏమి? బిడ్డల నీతీరుగా ఏడ్పించు వారా మీ తండ్రులు? వీరి మానవత్వము మంట కలిసిపోవుగాక! మన ధర్మగ్రంథములు, జనకవధ నిషేధించుచున్నవి కాన, మీరు మీ తండ్రులను చంపవలదు. అందులకు నేనును అంగీకరింతును. కాని, యుద్ధభూమిలో తారసిలి నపుడు నీ మిత్రుని నీవును, నీ తండ్రిని నీ మిత్రుడును వధించుట కేమి అభ్యంతరము కలదు? కావున అన్నలారా! ప్రతీకారము, సర్వమానవులకు స్వేచ్ఛ-ఇవియే మన ఆశయములు. ఈ ఉత్తమాశయములే మన యీ ద్వీపము నట్టూత లూపినవి. 'క్యూబా' నుండి 'టొబాగో' నుండి ఈ సింహనాదమే వినవచ్చుచున్నది. కొలదిపాటి అనుచర వర్గముతో 'జమైకా' నుండి యేతెంచి ఈ విప్లవ పతాకమును లేవదీసిన 'బక్‌మన్' మనవాడేకదా. 'డామింగో' నీగ్రోలతో చేతులు కలిపి బక్‌మన్ తీసిన మొదటి దెబ్బతోనే మనకు విజయము లభించినది. మనమును ఆ మహావీరుని మార్గమునే అనుసరింతము. లెండు! అన్నలారా! ఒక చేత గొడ్డలిని, ఒక చేత చిచ్చును పూనిరండు! తెల్లవారిపై ఇక

జాలితలపరాదు. ఈ భూస్వాములను తోటలతో, పంటలతో, కుటుంబములతో, నాశన మొనర్పుడు. వీరి భూములపై పేరునకైన ఒక్క చెట్టులేకుండా చేయుడు. ఈ భూమినే బ్రద్దలుచేసి మనపాలిటి ఈ పిశాచ దూతల నందు పూడ్చి పెట్టుదము – లెండు. అన్నలారా! ధీరులై రణరంగమున కురుకుడు! వారిని నిశ్శేష మొనర్చుదము రండు. మనకు జయమో మరణమో అగుగాక! గెల్చితిమా, ఇహలోక సౌఖ్యముల చూరగొందుము. చచ్చితిమా, స్వర్గ సౌఖ్యము మన కొరకు ఎదురు చూచుచున్నది. అచట చాలినంత ధనము, త్రావినంత బ్రాంది."

ఈ వీరాలాపములు నీకు నవ్వు పుట్టించుచున్నవి. నిజమే! కాని ఆ విప్లవకుల కీపలుకెంత ఉద్రేక జనకము లగునో యోచింపుడు. రసానుగుణముగా పాటుం బోటుగు కంఠ స్వరముతో, సమయోచితములగు హావ భావములతో బైసో ఈ మాటలు చెప్పినపు డెంతయు హృదయాకర్షకములుగా నుండెను. నీగ్రోల చిత్తవృత్తి బాగుగా ఎరిగిన వాడు కావున వారికి బాగుగా నచ్చెడి సందర్భముల నొక్కి చెప్పుచు, బయసో చూపిన కౌశలము ఆ శ్రోతల నట్టిట్టుల ఊచివైచెను.

ఈ ఉపన్యాసముచే విప్లవక సైన్యముల యందు చెలరేగిన మహోద్రేకము నేను వర్ణింపజాలను. నీగ్రోలెల్ల అర్చుచు చప్పట్లు చరుచుచు సింహనాదము లొనర్చిరి. అరచేతుల రొమ్ములు చరచుకొను వారు కొందరును, నిప్పురవ్వలు రేగు

నట్లుగా ఖడ్గముల నొండొంటిని ప్రయోగించువారు కొందరున్నైరి. వీరరస వివశులగు నింక కొందరు మోకాళ్ళపై అడ్డుపడి యుండిరి. ఇక స్త్రీ జనమెల్ల సంతోషావేశముతో, చేప ఎముక దువ్వెనలతో రొమ్ములు చేతుల జీరుకొన జొచ్చెను. భేరీ భాంకృతులును, మురజధ్వానములును, తుపాకుల 'ఢాండమిా' నినదములును ఏకమై మొనగమొనగ వారు సల్పిన కోలాహలము పైశాచిక తాండవమువలె కన్పట్టెను. అప్పుడు బయసో ఒక్కసారి చేయెత్తి వారింపగా, ఆ కోలాహలమెల్ల మంత్రప్రభావము వలె చప్పున చల్లబడి, నీగ్రో సైనికులెల్లరు ఎవరి వరుసలలో వారు గ్రుక్కుమిక్కనక బారులు తీర్చి నిలిచిరి. సాటివారి నందరిని ఇట్లు తన చెప్పుచేతలలో నుంచుకొనుటకు సమర్థమైన బయసో ఇచ్ఛాశక్తి ప్రభావమునకు సమ్మాన్యమై తోచెను. గాయకుని అంగుళీ స్పర్శకు విధేయములగు వీణాతంత్రుల మాడ్కి బయసో నేత్ర సంజ్ఞా వశవర్తులై మెలగుటయే ఆ దండులోని వారిపని.

## 27

ఇదియెల్ల నిట్లు ముగిసిన పిమ్మట మోసమునకుగల చెల్లుబడికి ఇంకొక తార్కాణముగ అచట వ్రణ చికిత్సా నటన ప్రారంభమయ్యెను. ఇంతదనుక ఆచార్య పీఠమధిష్ఠించి అత్మ శోకములను మాన్పిన ఆ మాంత్రికుడే శరీరరుజలబాపు వైద్యుడై వలయుమందులు శస్త్రములు ఒక పెట్టెలో పదిలపఱచుకొని ఏతెంచెను. శస్త్రములతో విశేషించి పనికలుగ

లేదుగాని చేప ఎముక ఒకటిమాత్రము అపుడపుడు రోగుల రక్తము నోడ్చుటకు ఉపయోగించుచుండెను. శస్త్ర ప్రయోగమున వానికి ప్రావీణ్యములేని మాట తెలియుచునే యుండెను. ఇక మందులంటిరా! నారింజ పూవుల కషాయము, సుగంధి పాలవ్రేళ్ళు, ఒక గ్రుక్కెడు రమ్ము సారా వీనితోనే చాలవరకు పని జరిగిపోవుచుండెను. వీని యన్నింటికన్న మిన్నయై, సర్వరోగ నివారణ సమర్థమగు ఔషధ యోగమొకటి వానియొద్ద కలదు. పుటపాకముగ ఉడుకబెట్టిన ఒక కోడిగ్రుడ్డు సొనయు, ఇంత జాజికాయ పొడియు, మూడు గ్లాసుల ద్రాక్షా రసముతో చేర్చి సేవించినచో అమృతమువలె పని చేయునట. వాని అచార్యకత్వ మెట్టి నటనయో వైద్యము కూడ నట్టి బూటకమే యని మీరు గ్రహించియుందురు. ఈ మందులతో ఏ ఒకటి రెండు రోగములో కుదిరిన కుదిరి యుండవచ్చునుగాని. ఈ మందులతో కలిపి వాడు ప్రయోగించు మంత్రముల ప్రభావమే నీగ్రోలకు వానిపై గురి కుదురుటకు మూల కారణము. కావుననే వ్రణ పరీక్ష చేయునపుడుకూడ వాడేదియో మంత్రమును గొణుగుచునేయుండును. కొన్నికొన్ని రాళ్ళయందుకూడ ఎంతో మహిమ యుండునని నీగ్రోలకు నమ్మకముగాన ఈ వైద్యుడు గాయములపై వేసి కట్టెడి దూదిలో ఏ చిల్ల పెంకో యుంచి మంత్రించి కట్టుచుండును. వ్రణితు డెవ్వడైన మరణించెనని వార్త వచ్చినపుడు ఈ మాయదారి వైద్యుడు గంభీరముగ నిట్లుపలుకును. "ఔను నేను మొదటనే యనుకొంటిని, వాడు ద్రోహి. ఆ రేయి యిల్లు

కాలునపుడు ఈపాపి తెల్లవానిని బయటికిలాగి రక్షించెనుగదా! ఇకనేమి? చచ్చెనుగదా! మంచిశాస్తి జరిగినది" ఈ మాటలకు చెంతనున్న నీగ్రోలెల్ల ద్వేషోత్కృతి శత్రు మారణోత్సాహులై చప్పట్లు చఱచుచు వైద్యుని పొగడుచుండిరి.

ఇట్టి వెన్నియో మాయలు నేర్చిన ఆ జగజంతి వాడు. అందునాకు మిక్కిలి అక్కజము గొల్పిన దొకటి వినిపింతును. ఆ క్రిందటినాటి యుద్ధముననే నీగ్రో దండ నాథులలో ఒకనికి ప్రబలమగు గాయమయ్యెను. వైద్యుడా వ్రణమును పదిలముగా పరీక్షించి, తన చేతనైనట్లు దానికి కట్టుకట్టి "దీనిలో ఏమియున్నదిగాని అనడు" అని చెప్పి, పూజాపీఠము నెక్కి బైబిలులోని పుటలు రెండు చింపి కాల్చి మసిచేసి పూజా కలశ మందలి ద్రాక్షాసవములో ఆ మసికల్పి "ఇదిగో దీనిని త్రాగుము. గాయము క్షణములో మానును అని అందించెను. వ్రణితుడు ఆ మాయలాని వంక సివ్వెంపాటున జూచుచు దానిని గుటుక్కున మ్రింగుచుండ ఆ టక్కరి వాని శిరముపై చేయిడి దీవించు చుండెను. వాని విశ్వాసమే పిమ్మట వానికా గాయమును కుదిర్చి యుండబోలును.

## 28

ఆచార్యులెల్ల వైద్యులై, వైద్యుడు మరల మాంత్రికుడై రంగమును కవలరించి మరల ఇంకొక క్రొత్త కథ మొదలు పెట్టెను.

అతి లాఘవమున పూజా పీఠము పైకెగిరి పద్మాస నమునైచి కూర్చుండి "రండు,రండు, మీకు రాగల మేలు కీళ్ళు వచింతును. 'జిప్సీ' శాస్త్రములెల్ల పార జదివిన పండితు డను నేను. జోస్యమున మరినన్ను మించిన వాడు లేడు." అని వాడనగా, నీగ్రోలు, సంకరులును పీఠము చుట్టును మూగిరి. వాడంతట జోస్యము చెప్పుచుండ, వాని కంఠస్వరము నా స్మృతి ముకురమున అస్పష్ట బింబము లీనుచుండెను. "ఒక రొక్కరే రండు. అందరును ఒక్కపరి మూగుదురేని, ఒక్క మాటుగనే మృత్యువు నోట పడుదురు" అని వాడు బెదరింప, ఆ మూఢులందరు వెను వెనుక కొదిగిరి.

అప్పుడు తెల్లని యుడుపుల ధరించిన సంకరు డొకడు గుహలోని కేతెంచెను. వెరపువాని మోమున నిల్లు గట్టుకొని వ్రేలుచుండెను. సేనాని వానిని గాంచి "ఏమి 'రిగాడ్?' విశే షము లేమి?" అని ప్రశ్నించెను.

ఈ 'రిగాడ్' 'లాగ్' ప్రాంతము లందలి సంకరులకు మొనగాడు. వీనికి సేనాని బిరుదుకూడ కలదు. కాపట్య ఖనియు, క్రౌర్యరాశియు నయ్యు పైకి దయాపరుడు, నిష్కప టియువలె కాన్పించు ఆ రిగాడ్‌వంక నేను తదేకదృష్టితో చూచుచుంటిని. వాడు బయసోతో నెమ్మదిగ నిట్లు చెప్పెను "సేనాపతీ! 'ఫ్రాంకాయి' సేనానికడనుండి వార్తాహరు డొక డేతెంచి శిబిరమున కావల నున్నాడు. బక్‌మన్ రణనిహతు డయ్యెనట. తెల్లవారు వాని తల కోట కొమ్మున విజయ చిహ్నముగ వ్రేలగట్టిరట"

ఈ మాటలన్నియు సమీపమున నున్న నా చెవిని బడుచునే యుండెను. విప్లావక నాయకుల సంఖ్య తగ్గుటయెల్ల తన ప్రాముఖ్యము అతిశయించుటకే యగును గాన బయసో ఆనందముతో కనుదోయి వికసింప "ఇంతేకదా!" అనెను.

రిగాడ్ : ఫ్రాంకాయి సేనాని పంపిన ఆ వార్తాహరుడు నీకింకొక వార్తకూడ తెచ్చెను.

బైసో : మంచిది కాని నీ వేటికి అంత అలజడి చెందు తున్నావు ?

రిగాడ్ : బక్మన్ మరణవార్త విని సేనావారము లెట్లగునో యని నీకు మాత్రము వెరపు పుట్టుటలేదా ?

బైసో : పైకి అట్లందువు కాని, బయసో శక్తి సామర్థ్యములు నీవు మాత్ర మెరుగవా? నీకెందులకు, ఆ వార్తాహరుని పది నిముసములపాటు ఇచటికి రాకుండ నిలిపి యుంచుము. నే నంతయు చక్క చేసెదను.

అని రిగాడ్‌ను పంపి బయసో మాంత్రికుని యొద్దకు వచ్చెను. ఆవల ఆ మంతనము జరుగుచున్నంతసేపును, ఈవల నా మాంత్రికుడు దూరక కూరుచుండలేదు. నీగ్రోలందరు, తన ప్రక్కనున్న దిబ్బెములో శక్తికొలది కానుకలు వేసి తన ప్రజ్ఞా విశేషముల కచ్చెరువందుచు వెఱ్ఱి మొగములతో చూచుచుండగా, వారి అరచేతులలోని రేఖలు చూచియు, మొగమున గుర్తులు పరిశీలించియు, మధ్య మధ్య ఏమేమో ప్రశ్నలడుగుచు, వారు సమర్పించిన కానుకల హెచ్చు తగ్గులనుబట్టి రాగల మేలు కీళ్ళను వినిపించుచుండెను. ఇంతలో

బయసో వచ్చి, వాని చెవిలోనేమో గుసగుస లాడెను. బయసో కేమియు నూరు చెప్పకయే జోస్యుడు ఎప్పటివలె మరల వారికి జోస్యము చెప్పనారంభించెను.

"నుదుట త్రికోణ రేఖ యున్నవారికి శ్రమ లేకయే ఐశ్వర్యము లభించును. కాని మూడు 'స' వర్ణముల పోలిన రేఖలు నుదుట మెరిసికొని యుండుట మంచి లక్షణముకాదు. అట్టివారికి నీటి గండము తప్పదు. భ్రూ మధ్యమునుండి ఇరు వంకలకు రెండేసి గీరలు కనుబొమలపై కానవచ్చునేని అట్టి వాడు బంధితుడై, విజాతీయుల కారాగారములలో చాలా కాలము కృశించిపోవును."

అని కొంచెమూగి, "అన్నలారా! మన 'మారన్ రూజి' సేనాపతియు, ధీరుడు నగు బగ్ జార్గల్ నుదుట ఈ రేఖలు నేను చూచితిని సుడీ!" అనెను.

ఈ మాటలతో 'బగ్ జార్గల్' బంది యయ్యె ననెడి నా అనుమానము నిజమేకదా యనుకొంటిని. అచటనున్న 'మారన్ రూజి' నీగ్రోలెల్లరు ఈ మాటలువిని గొల్లున విలపింపసాగిరి.

వాడు మరల జోస్యము ప్రారంభించెను. "వింటిరా! ఫాలమున కుడివైపున, చంద్రరేఖ దగ్గర, అంకుశ రేఖ యున్నవారు ప్రాలుమాలిక చెందరాదు. దుర్వ్యసనముల పొంత పోరాదు"

ఇట్లు చెప్పుచుండ వ్రణితు డొకడు దేకికొనుచు వాని చెంతకు వచ్చెను. పాపము! వానికి మొగమున పెద్ద గాయమై

ఒక కనుగ్రుడ్డు వెలికివచ్చి వ్రేలాడుచుండెను. ఇందాక వైద్య వేషమున నున్నప్పుడు మాంత్రికుడు వీనిమాట మరచుటచే, ఇపుడు వాడువచ్చి "కట్టు కట్టు"మని గోలపెట్టుచుండెను. వానిని చూచియు మాంత్రికుడు వాని మొర వినిపించుకొనక మరల జోస్యము చెప్పనారంభించెను.

"నుదుట కుడివైపున సుడి యున్నచో దృష్టి లోపము సంభవించును. ఏదిరా! నీ చేయి చూపుము."

ఆవ్రణితుడు "చేయికాదు బాబూ ? కన్నుచూడు" మని వేడెను.

"కన్ను చూడనేలరా? నీ చేయి చూపుము, చాలును."

"అయ్యో, నా కన్ను, నా కన్ను" అని విలపించుచు వాడు చేయి చూపెట్టెను. "భళీ ! ఇక నేమి? ఇదిగో, ఆయుష్య రేఖలపై నిచట సుడి, వృద్ధుడా ! నీకొక కన్ను గ్రుడ్డిదగును."

"కానే అయినది స్వామీ !" అని వాడు రోదనము సల్పుచుండ వాని నావలకు ద్రోసివైచి మరల మాంత్రికుడు జ్యోతిషము ప్రారంభించెను, "వినుడు మీరు వినుడు. ఫాల భాగమున రేఖ లేదను అలికికొనిపోయి స్పష్టముగ కాన్పించ వేని, అట్టివాడు అర్ధాయుష్కు డగును. భ్రూమధ్య భాగమునకు ఇంచుకమీదుగా కత్తెర రేఖ యున్నవానికి యుద్ధమున చావు తప్పదు. చేతిలో ఆయుర్దాయ రేఖ మూలమున కత్తెర యున్నచో వానికి ఉరికంబముపై చావు నిజము. అన్నలారా ! మీ కేమని చెప్పుదును ? మన స్వాతంత్ర్య రక్షకులలో అగ్ర

గణ్యుడగు బక్‌మన్ సేనానికి నేను చెప్పిన ఈ దుర్లక్షణము లన్నియు పట్టినవి."

ఈ మాటలు విని శ్రోతలెల్లరు నోళ్ళు తెరచుకొని ఆ మాయలానివంక చూచుచుండ, వాడు మరల "కాని, సమర రంగమున మరణమును, ఉరికంబముపై మృతియు—ఈరెండును ఎట్లు సమన్వయ మగునా ? అని చూచుచుంటిని. ఏది ఎట్లయి నను నా శాస్త్రము మాత్రము తప్పదు." అని బయసోవంక సాభిప్రాయమగు ఒకచూపు బరపెను. సేనాని అది గాంచి ఒక సైనికుని చెవిలో నేమియో చెప్ప, వాడు వెలుపలి కేగెను.

జోస్యుడు మరల "తెల్లమొగమును, ఈడుపు కాళ్లను ఊగు చేతులును, బుద్ధిలేమికిని, సారహీనతకును లక్షణములు" అని చెప్పుచుండ బయసో పకపకన నవ్వెను.

ఆ సమయమున ధూళి ధూసరితమై, చెమ్మటలు క్రమ్మి మేనితో, దీర్ఘ ప్రయాణము చేత అలసిన కాళ్ళతో, తూగాడు చున్న ఒక నీగ్రోను వెంటబెట్టుకొని ఇందాక బయసో పంపిన సైనికుడు లోపలికి వచ్చెను. ఈ క్రొత్త మనిషియే ఫ్రాంకో పంపిన వార్తాహరుడు. వాని కుడిచేత ఒక ఉత్తరమును, ఎడమచేత మండుచున్న మానవ హృదయ ముద్రగల ఒక రహదారి చీటియు గలవు. ఆ ముద్రచుట్టును నీగ్రో సంకీర్ణ జాతులచే ఏకీభావమును తెల్పు సంకేతములును, అడుగు భాగమున "ఇనుప దండము విరిగినది; ప్రతీకారము నెరవేరి నది; రాజునకు జయము !" అను వాక్యములును గలవు.

సర్వత్ర సులభ ప్రవేశార్థము 'జీన్ ఫ్రాంకో' యిచ్చిన రహదారి చీటి యిది.

వాడును వినమ్రుడై ఆ యుత్తరమును హైసోకర్పించుకొనుటయు, అతడు దానిని చింపి చదువుకొని, అతి విచారఖిన్నుడైనవానివలె "సోదరులారా!" అని సంబోధించెను.

వెంటనే అందరును అవహితచిత్తులై నిలిచిరి. "సోదరులారా! ఆలకింపుడు. సేనాధ్యక్షులమగు మాకు జీన్ ఫ్రాంకో పంపిన వృత్తాంత మిది. నల్లగొండలలోని నీగ్రోల కధిపతియై మా వలెనే ఈ ధర్మయుద్ధమున బద్ధకంకణుడై నిలిచి పోరాడుచుండిన నా మిత్రుడు బక్‌మన్ సేనాపతి రణరంగమున చేతికత్తి విడువకయే కూలెనట. ఈ శ్వేత రాక్షసు లా వీరుని తలను మొండెమును వేరుచేసి, ఆ శిరము నిపుడు కాపు నగర చతుష్పథమున ఉరికంబమునకు వ్రేలదీయబోవుచుండిరట. ఎంత ఘోరమో వింటిరా? ఇంకను చూచెద రేమి? ప్రతీకారము సల్పుడు" అని ఆ యుత్తరములోని సంగతులు వినిపించుచుండ, సైనికు లెల్లరు విచారగ్రస్తులై మాటాడక నేల వంక చూచుచుండిరి.

జోస్యుడు మాత్రము మంత్రదండము త్రిప్పికొనుచు, లేచి, ఎగిరిపడుచు సగర్వముగా నిట్లనియెను. "ఆహా! గ్రహములకు నాయందు సంపూర్ణానుగ్రహముగలదు. పుత్రులారా! మిత్రులారా! బాలులారా! వృద్ధులారా! అమ్మలారా! మీరందరు నిటు చూడుడు. నేనిందాక చెప్పిన జోస్యము వింటిరిగదా! బక్‌మన్ ముఖరేఖలనుబట్టి ఆతడు దీర్ఘాయుష్కు

డగుననియు, రణనిహతు డగుననియు, వాని శిరము ఉరికంబ మున వ్రేలాడుననియు గ్రహించితి నని నేను చెప్పలేదా ?

నా చెప్పిన ప్రత్యుత్తరము ఎట్లు నిజమైనదో చూడుడు. దురవగాహములగు నెట్టెట్టి విషయములు తమంత గోచరించు చున్నవో చూచితిరా! మిత్రులారా! నన్ను మెచ్చుకొన రేమి?

తత్పూర్వము విచారగ్రస్తమైయున్న జనమంతయు భయ విశ్వాసములు హృదయముల మల్లడిగొన నాలకించు చుండగా, ఆ జోస్యుడు పట్టరాని సంతోషమున ఆ భోషాణము మీద అటునిటు అంగలు వేసికొనుచు ఈ ప్రసంగము గావించెను.

బైసో ఒక వెడనవ్వు నవ్వి "స్వామీ! త్రికాలవేదు లగు మీ రెరుగని విషయము లుండవు. అనుగ్రహించి నా భవిష్యత్తును చెప్పుడు" అని వేడుకొనగా, అతడు "ఇటు దగ్గరకు దయచేయుడు" అనెను. ఆ క్షణమున అంతమందిలోను జోస్యుడే ప్రధానపాత్రగా నుండెను. మంత్ర బలము ఖడ్గబల మునకు పైచెయ్యి అయినది.

బైసో వినమితో తనూంగుడై చెంతకు రాగా "ఏదీ! నీ చేయి చూపు" మని, వానిచేయి గ్రహించి జోస్యు డిట్లు మొదలిడెను:

"ఇదిగో, చెప్పుచున్నాను. సమదీర్ఘములై ఒకచో గూడిన ఈ రెండు రేఖలు సిరిసంపద లొసగును – వంపు లేక తుదిదాకా సాగిన ఆయుర్దాయ రేఖ ఆరోగ్యవంతమును సుఖ పరిణామమును అయిన పూర్ణ జీవితమునకు లక్షణము.

మరియు అది సన్నముగా నుండుటకూడ శుభ సూచకమే. అనగా మీ అసాధారణ ప్రజ్ఞకు, విజ్ఞానమునకు, ఔదార్యమునకు అది తార్కాణము. ఇల్లిదిగో, ఈ వృత్త రేఖను గాంచితిరా? సాముద్రికులు దీనిని మహాదృష్ట చిహ్నముగా నెన్నుదురు. గొప్ప ఐశ్వర్యవంతులకు, వీరాగ్రేసరులకు గాని ఈ రేఖ యుండదు. అందును, ఇది చిటికెన వ్రేలిపై కెక్కివచ్చి మీ యుచితదండమునకు సాక్ష్యమొసగుచున్నది." అని వాడు తన మేలిముసుగు క్రంతలలోనుండి నావంక జూచెను. మరల ఆకంఠ మెచటనో విన్నట్లు నాకు స్మృతికి వచ్చుచుండెను.

వాడు మరల ప్రారంభించెను. "ఈ ఆరోగ్య రేఖ చిత్తగించితిరా? ధర్మరక్షణార్థమె మీరు పెక్కు తలలు తీయింతురని సూచించుచున్నది. ఈ రేఖ కిచట అర్ధ చంద్ర రేఖ అడ్డమై వచ్చినది. ఇది క్రూరమృగ భయమును దెల్పును. అనగా క్రూరులగు తెల్లవారి వలని భయమని యర్థము. నీవు వారి నంతమొందించినచో ఆ గండము తప్పును ఈ సౌభాగ్యరేఖ, హస్తాగ్రమునకు మలకలై ప్రాకి దైవము మీ కనుగ్రహించిన ఉత్తమ పదము చిరస్థాయి యగునని తెల్పుచున్నది. అది ఇంచుక దక్షిణమునకు వ్రాలుట మీ పరిపాలనా దక్షతకు నిదర్శనము, నడిమి వ్రేలు కడనున్న ఈ రేఖ మీరు పట్టినదెల్ల బంగారము చేయును. ఏదీ ? మీ వ్రేళ్ళను బరిశీలింపనిండు, చూచితిరా ? బొటన వ్రేలిపై ఈ చక్రము? మీకు మహా ప్రాభవము సంక్రమించు

నని ఇది సూచించుచున్నది. సందేహ మేమి ? బక్మన్ ప్రాభవమెల్ల మిమ్ము వరించును. చిటికెన వ్రేలిపై ఈ కత్తెర ప్రత్యర్థి జయమును, శత్రు నాశనమును దెల్పుచున్నది. ఈ తిర్యగ్రేఖలు మీ దూరదృష్టికిని, ఉన్మేష బుద్ధికిని తార్కాణము.

ఇంక మీ ఫాలమును పరీక్షింపనిండు. ఇదిగో! సూర్య రేఖ. ఇచట త్రికోణ రేఖతో గూడి మహైశ్వర్య లాభమును వచింపుచున్నది. ఇది ఇంచుక కుడిమీదికి ప్రాలి వెనుక చెప్పిన ప్రాభవ సంక్రమణమునకు ప్రబలసాక్ష్య మొసగు చున్నది. చెప్పితినిగదా ! బక్మన్ ప్రాభవమెల్ల మిమ్ము వరింపనున్నదని. భ్రూమధ్యగతమైన ఈ అశ్వఖుర రేఖ — చిత్తగింపు డిదిగో! ఈ రేఖ నా భ్రూమధ్యముననుగలదు. ప్రాభవమునకు, అవమానమునకు ప్రతీకారము చేసి నిర్వహించుకొనుట కిది గుర్తు.

"ఇదిగో! నా భ్రూమధ్యముననుగల"దని వాడు చిత్రముగా నుదువుట నా మనస్సున ఏలనో గట్టిగా నాటినది.

"ఎడమకన్ను రెప్పపై నున్న ఈ సింహపాదము సింహ సంహనన పరాక్రములకు గాని అన్యుల కుండదు. బైసో సేనాని! వేయేల? నీ ముఖము సర్వలక్షణ సంపన్నము. ఆ రేఖా సమామ్నాయ మెల్ల మేరీమాత పేరులోని ప్రథ మాక్షరమగు 'మ' కారమును బోలియున్నది. మరేమి కావల యును. ఆ చిహ్నముగల భాగ్యశాలి ఏమి తలపెట్టిన నెర వేరదు ? ఆ మహాభాగుని ఆశ్రయించిన వారికి సర్వ కామ్య

ములు సిద్ధించును. సమస్త సేనావారమును ఒక యెత్తు; ఈ శుభ చిహ్నాంకితుఁడొక యెత్తు. సేనాపతీ! భాగ్య దేవతయే నిన్ను వరించినది. నీ కఖండ విజయము కానున్నది."

బైసో అంతట "చిత్తము, దండములు" అని సింహాసనోన్ముఖుఁడగుచుండ, జోస్యుఁడు "ఆగుఁడు, ఇంకొక మాటచెప్ప మఱచితిని. స్ఫుట ప్రకాశమై మీ నుదుట వెలుగుచున్న ఆ సూర్య చిహ్నము, లోకవృత్తి పరిజ్ఞానము, దాక్షిణ్యము, త్యాగశీలత, మీకు సహజ లక్షణములనుటకు నిదర్శనము. ఇంతే" అని చాలించెను. అంతగా నుగ్గడించిన తన త్యాగశీలతకెక్కడ భంగము వచ్చి పోవునో యని బైసో జేబునుండి డబ్బు సంచిని తీసి ఆ డిబ్బెములో వైచెను. ఆ సూర్యరేఖ వంచించునా మరి! బైసోకు వచించిన ఈ జ్యోతిష మించుకయు వృథ కాలేదు. బక్మన్ మరణ వార్త విన్నది మొదలు నీగ్రోలకు జోస్యునిపైగల నమ్మకము నూరు రెట్లయినది. కావున నిప్పుడు బైసో విషయమునఁగూడా అతఁడు చెప్పినదెల్ల సత్యమే యగునని మూఢ విశ్వాసముచే మహోత్సాహ పూరితులై "ఆచార్యునకు జయము! మా సేనాపతికి జయము, జయము" అని అరచుచుండఁగా. మాంత్రికుఁడును సేనానియు, ఒండొరుల చూచి నవ్వుకొనుట జనాంతిక సంభాషణమువలె నాకు దోఁచినది.

కారణ మేమో చెప్పలేనుగాని ఆ మాంత్రికుడు నన్ను హృదయ శల్యమై వేధింపఁదొడఁగెను. వీని నెచ్చటనో చూచియుందునని మాటిమాటికి తలపునకు వచ్చుచుండ,

ఏమైనా కానిమ్మని వానితోడ మాటలాడ సంకల్పించి "ఓ ఆచార్యా! భిషఙ్మణీ! మాటు" అని పిలిచితిని. వాడు గిరుక్కున నావెనకు మరలెను. "నీ వందరి యదృష్టములు చెప్పితివి కాని, నాయొక్కనికి మాత్రమే చెప్పవైతి"వని చేయి చాచితిని. వాడు నావంక గంభీరముగా జూచుచు నిలిచెనే కాని, "ఔను, కాదు" అనలేదు అంత నేను "మాట సామెతకు మిమ్ముల నడుగుట లేదు. నా భవిష్యత్తును గూర్చి మీ నోట వినవలెనని మిక్కిలి కుతూహలముగా నున్నది. కాని దక్షిణ లేక మీరు చెప్పరు కాబోలు. అది నా యొద్ద లేదు. యోగ్యులైన మీ సైనికులు నాయొద్దనున్న డబ్బును, గడియారమునుకూడా సంగ్రహించికొనిరి" అని ఊరకొంటిని.

వాడు చరచర నా యొద్దకు వచ్చి; చెవికడనోరు పెట్టి "నీవు పొరబడితివి నీకును చెప్పెదను. చేయి చూపుము" అని అరచెను.

నేను చే యందిచ్చి వానివంక నిశ్చలముగా జూచుచు నిలచితిని. నా హస్తమును బరీక్షించుటకు వాడు తల వంచి నపుడు మేలి ముసుగు క్రంతలనుండి వాని గ్రుడ్లు, రాత్రి పూట పిల్లి గ్రుడ్లవలె మెరసెను. "నీ ఆయుర్దాయ రేఖ కిచట కత్తెర తగిలినది. కావున నీకు చావు సమీపించిన దన్నమాట. ఈ రేఖ హస్తమధ్యము నందుండ వలసినది. అది యటు లుండ, ఆయుర్దాయ రేఖయు, భాగ్య రేఖయు ఈ మూల గల సినవి. కావున నీకు బలవన్మరణము తప్పదు. పండి, రాలు భాగ్యము నీకు లేదు. చూపుడు వ్రేలి యడుగున నున్న ఈ

రేఖయు దానినే దృఢపరచుచున్నది" అని వాడు సంతో
షము వెల్లి విరియు ఘూక స్వరమున నా చావు వచింపగా,
నేనది సరకు సేయక, యనాదరమందహాసము సల్పుచు "మంత్ర
గాడా! అవశ్యంభావినిగూర్చి జోస్యము చెప్పుటలో నీవు కడు
నేర్పరివి సుమా!" అంటిని.

ఆ మాటలు విని వాడు మరల నన్ను సమీపించి "నీకు
శాస్త్రవిశ్వాసము లేనట్లున్నది. వినుము, మరియొక విషయము
చెప్పెదను. నీవు మిత్రుని శత్రునిగను, శత్రుని మిత్రునిగను
భావింతువని నీ నుదుట భిన్నమై కనబడు ఆ సూర్యరేఖ
వచించుచున్నది. దీని కేమందువు?" అనెను.

నిజమే, నేను పీరట్‌ను నమ్మి మోసపోతిని. విశ్వాస
పాత్రుడగు 'హెబిబ్రా'ను శంకించితిని అయినను వానితో
"నీవు చెప్పునది ఏమో నాకు తెలియలేదు" అంటిని.

"తొందరపడకుము. ఇంతవరకు అనాగతము చెప్పి
తిని. ఇక ఆగతము వినుము. నీ నుదుటి చంద్రరేఖ వక్రిం
చుటచే నీ భార్య పరాపహృతయై యుండునని తోచుచున్నది."
అని వాడు పల్కగా, గజగజలాడు మేనితో నేను ముందునకు
దుముక గమకించుచుండ, పార్శ్వమున గాచియున్న భటులు
వెనుకకు లాగిరి.

వాడు మరల ఇట్లు చెప్పెను: "అంత తొందర పడెద
వేలా? తుదముట్ట వినుము. వక్రించిన ఈ రేఖకు చిగురున ఒక
అడ్డరేఖకూడ నున్నది. కావున నీకు పెండ్లినాడే భార్యా
వియోగము కలిగినది."

నేనా మాటలు విని "తుచ్ఛుడా! నా ప్రియురాలి జాడయు నీ వెరిగియే యుంటివి. నీ వెవ్వడవో నిజము చెప్పుము" అని గర్జించుచు, ఎట్లయిన విడిపించుకొని వాని ముసుగు చీల్చి ముక్కలు చేయవలెనని ఎంతయు పెనగులాడియు పదిమంది భటులు బలవంతముగ నన్నణచి పెట్టగా ఆ మాయా మాంత్రికుడు: "ఇప్పుడైనా నన్నెరిగిన కుతి రెనా? చావునకు సిద్ధము కమ్ము" అని పల్కి వెడలిపోయెను. కనులప్పగించి చూచుచు, ఊరకుండవలసిన వాడనైతిని.

# 29

మాంత్రిక సేనాపతు లాడిన ఆ ప్రహసన మిట్లు ముగిసినది. విషాద వికలమైయున్న నా మనస్సును మరల్చుటకో యన భయానకరస ప్రధానమైన యింకొక నాటకము ప్రారంభమైనది.

మాంత్రికుడును, రిగాడ్‌ను, ఉభయపార్శ్వముల నొల్చి యుండగా, సేనాని మరల సింహాసనాసీనుడయ్యెను. మాంత్రికుడేదో దీర్ఘాలోచన చేయుచుండగా, తక్కిన యిర్వురును పొగాకు నములుచుండిరి.

అపుడొక నీగ్రోగుంపు, ముగురు తెల్లఖైదీలను రెక్కలు విరిచికట్టి తెచ్చి గుహాద్వారమున నిల్పి, "మరణ శిక్ష, మరణ శిక్ష" అని పెడబొబ్బలు పెట్టుచుండెను. నాయకుడైన బక్‌మన్ చనిపోగా, విచ్ఛిన్నమై, బైసో దండును చేరవచ్చిన వారా గుంపులో చాలామంది గలరు.

బైసో చేయెత్తి యీా సన్నను వారించి, ఖైదీల నెదుటికి గొని తెప్పించి విచారింప దొడగెను. ఆ ముప్పురిలో ఇద్దరను నేను బాగుగా నెరుగుదును. వారు బంధితులై వచ్చుట నా కాశ్చర్యమైనది. అందొకడు 'నిగ్రో జాత్యుద్ధరణార్థము బద్ధకంకణులై నానా దేశముల కృషి సల్పుచున్న భూతదయాపరులలో నొకడ'నని చెప్పుకొన్న మహానుభావుడు. నాటి రాత్రి, విప్లావకుల చిత్రవధ సల్పి తలలు తోరణ గట్టవలెనని గవర్నరు కుపదేశించిన వాడీతడే!

పవిత్రత విషయమున సందేహాస్పదమైన జననము గలవాడయ్యును, తాను సంకరుల ద్వేషించుచు, శ్వేత జాతిచే తానును ద్వేషింపబడినవాడు రెండవవాడు. మూడవవాడు నిరుపేదలగు తెల్లవారి వర్గమునకు జేరినవాడువలె కన్పట్టెను. ఈ తెగవారు దేశీయులవలెనే కూలినాలి చేసుకుని జీవింతురు.

ప్రాణార్తులై యే కొండగుట్టలలోనో తలదాచుకొనుటకు పారిపోవు సమయమున ఈ ముగ్గురను మూడుచోట్ల పట్టుకొనిరట.

అందు ఆపేదవాని విచారణ ముందు ప్రారంభమైనది.

"నీవెవ్వడవు?" అని బైసో వానిని ప్రశ్నింప, వాడు "నేనా! కాపునగరపు టాసుపత్రిలో పని చేయు వడ్రంగిని. నా పేరు "జాకెస్ బెలిన్" అని సగర్వముగా జవాబిచ్చెను.

బైసో, మనమున లజ్జాశ్చర్యములు మల్లడిగొన, ఔడు గరచుచు "జాకెస్ బెలిన్" అని కాకువుగా ననెను.

వడ్రంగి: అవును. జాకెస్ బెలిన్ ! నన్ను నీవు గుర్తింపలేదా ?

బైసో: (కన్నులింత చేసి ఉగ్రుడై గద్దించుచు) ముందు నేనెవరో గుర్తించి, నాకు నమస్కరించి, మరి నీ కథ చెప్పుము.

వడ్రంగి: నా బానిసకు నేను నమస్కరింపను.

బైసో: తుచ్ఛుడా ! నేను నీ బానిసనా ?

వడ్రంగి: అవును కాకేమి ? నీవు మొదట నా సేవకుడవే. నన్నెరిగియు నెరుగని యట్లు నటించుచున్నావు. కాని జ్ఞాపకము చేసికో. నిన్ను డామింగో బజారులో ముప్పది రూపాయల కమ్మినమాట జ్ఞాపకము చేసికో.

బైసో: (కోప పరీతమైన చిత్తముతో కటము లదర నిర్విణ్ణుడై యుండెను.)

వడ్రంగి: సెబాసు ! నా యొద్ద నౌకరి చేసితివని చెప్పికొనుట నీకు లజ్జాకరముగా నున్నట్లున్నదే ? జాకెస్ బెలిన్ సేవక వర్గములో నే నొకడనని చెప్పుకొని జీన్ బైసో గర్వింపదగినది కాదా ? అది సరికాని, జ్ఞాపకమున్నదా ? ఆ ముదుసలి ముండ నీ తల్లి నా వాకిలి యూడ్చుట. దానితో విసివి తుదకు ఆసుపత్రి మేస్త్రీకి అమ్మివైచితిని. పీనుగుముండ ముప్పది రెండు రూపాయలకంటె ఎక్కువ వెల తేలకపోయినది. ఇది మన ఇర్వురి చరిత్ర. ఇంతగాథ యుండగా జాకెస్ బెలిన్ పాదసేవకుడై కొలిచిన దినములే ఎట్లు మరచిపోతివి ? సంకరుల కిప్పుడు గర్వము బలియుచున్నట్లున్నదే ?"

బైసో, పెద్దపులివలె విషపు నవ్వు నవ్వుచు దీని నంతయు నాలకించి తుదకు దీర్ఘ నిశ్వాసపూర్వకముగా “మంచిది” అనెను.

పిమ్మట “పోయి రెండు చేబాడితెలు, రెండు ఉలులు, ఒక రంపము తెచ్చి వీనిని బైటికి కొనిపొండు” అని వడ్రంగిని కట్టి తెచ్చిన నీగ్రోల కానతిచ్చి, “జాకెస్ బెలిన్! నీ కెంత మేలు చేయుచున్నానో చూడుము. వడ్రంగికి ఉచితమైన మరణమునే నీకు విధించితిని” అని పెద్దపులివలె నవ్వెను. వాడు నోట చెప్పకున్నను తన పూర్వయజమాని కెట్టి ఘోర శిక్ష విధించెనో ఆ నవ్వే చెప్పుచుండెను.

వడ్రంగి ఇంచుకేని చలింపక సగర్వముగ మరల నిట్లనెను: “అవును. నేను నీ మేలు మరువను. నిన్ను కొన్నది ముప్పది రూపాయలకే యైనను, దానికన్నియో రెట్లు పని నీచే చేయించుకొంటిని.”

ఇదియే వాని తుదిమాట. వాని నావలను లాగికొని పోయిరి.

తమతోడి వానికి వాటిల్లిన ఈ బెడిదపు ముప్పును జూచి మిగిలిన ఇద్దరు తమకేమి మూడునోయని కొన యూపిరితో గజగజలాడుచుండిరి.

ఈ భీరుల విహ్వల భావ మెక్కడ? సమ్మాన్యమగు వడ్రంగి ధైర్య ప్రవృత్తి యెక్కడ? బైసో వారివంక నక్క వలె దొంగచూపులు చూచి, కొంతకాల విలంబనము చేసి, వారిని మరియు పీడించి సంతోషింపదలచినవానివలె, రిగాడ్‌తో

పొగాకు రకములగూర్చిన సంభాషణలోనికి దిగి, 'హావానా' సరకు చుట్టలకు మంచిదనియు, స్పెయిన్ దేశపు సరకు పొడు మునకు నాణెమనియు, తన యనుభవములు దెల్పి, తటాలున ఖైదీ లిరువురిలో పౌర సేనానివంక తిరిగి "ఈ విషయమున నీ అభిప్రాయ మేమి?" అని ప్రశ్నించెను.

మొదలే భయకంపితుడై యున్న వానికిఈ హాఠాత్సంబోధనమువల్ల మరియు మనసు చెదరి, ఏమి చెప్పుటకును తోచక, ఎట్టకేలకు నత్తుచు వాడు "చిత్తము. దేవరవారి అభిప్రాయమే నా యభిప్రాయమును" అనెను.

బైసో : ఈ ముఖస్తుతులు చాలించి నీ అభిప్రాయమేమో చెప్పుము. నాదికాదు. పొడుమునకు స్పానిష్ సరకు కంటె మంచిది నీ వేమైన ఎరుగుదువా?

పౌర సేనాని : ఎరుగను ప్రభూ!

అనునపుడు, వాని కంపము తనకు వినోదముకలిగింపగా_

బైసో : "ప్రభూ!" "దేవరవారు" "చిత్తము" "బాగు బాగు" నీవు రాజబంధువువలె నున్నావు.

పౌ. సే : అయ్యో! కాను కాదు. నేను శుద్ధ దేశభక్తుడను. నీగ్రో పక్షపాతిని.

బైసో : నీగ్రో పక్షపాతివా? అంతమాత్రమున చాలదు. నీవు సంకీర్ణుల పక్షమునుగూడ వహింపవలెను.

పౌ. సే : అవును! సంకీర్ణాభిమానినిగూడ. ప్రపంచమునగల సంకీర్ణనీగ్రో పక్షపాతులందరితోను నాకు సంబంధమున్నది!

బైసో : (తెల్లజాతిని అవమాన పరచుటకు మంచి అదను దొరకెగదా యన్న సంతోషముచే) నీగ్రోలును, సంకీర్ణులును అనగా అర్థము? మీా తెల్లవారు కల్పించిన ఆ నిందా వాక్యములు నా యెదుట నేనా? ఇచట తెల్లవారు రంగువారు తక్క ఇతరులు లేరు. ఆ మాట ఎరిగి మసలు కొనండి దొరగారూ!

పొ. సే: చిత్తము. అపరాధము. చిన్ననాటనుండి ఈ దురభ్యాసము అలవడినది. ప్రభువువారి కాగ్రహము కల్పించుట నా ఉద్దేశముకాదు. మన్నించవలెను.

బైసో : నీప్రభు సంబోధనములిక కట్టిపెట్టుము. నాకీ రాజమర్యాదలు పనికిరావని ఇంతకుముందే చెప్పితిని.

పాపము, అతడు మరల నేనియో క్షమాపణము చెప్పి కొనవలయునని నీళ్ళు నములుచు "పౌర మిత్రమా! నీ వెరుగవు గాని—" అనఅర్థోకిలో...

బైసో : (తెచ్చికోలు కోపముతో) పౌరుడా! బళా! నాకీ యరాజక సాంప్రదాయము లనిన తలనొప్పి. చూడగా నీవు రాజ ద్వేషివలె నున్నావు. జాగ్రత్త! నీవు మాటలాడునది సార్వభౌముని సర్వ సేనాధిపతితో.

పాపము! ఆ నీగ్రో పక్షపాతికి నూయియు గోయియుగా నుండెను. 'ఆఁ' యన్న అపరాధము, 'ఊఁ' యన్న ఉపరోధము, అయినచో మరి ఏమిగతి? వాని సంకటము గాంచి బైసో లో లోన నవ్వుకొనుచుండెను. 'ప్రభువా' యన్నను 'పౌరుడా' యన్నను ఏవగించుకొనుచున్న వానినిసంబోధించుట కాతడు

ఎట్టకేలకు అర్థరహిత దీర్ఘపద ప్రయోగము గావింప దలచి ఇట్లనియె ! "ఓ మానవాభ్యుదయార్థ సమవతరణ మహనీయ మూర్తీ! నీవు నా విషయమున న్యాయము విచారించుట లేదు."

బైసో : (వానిని లక్షించి చూచుచు) నీకు నల్లవారి పైనను రంగు వారిపైనను ప్రీతియే కాదూ ?

పా. సే : ప్రీతి మాత్రమేకాదు. ఆ విషయమున నెంతయో వ్యవహారము నడపు ——

బైసో : (అర్ధోక్తిలో విషపు నవ్వుతో) ధన్యులము, ధన్యులము మా పక్షమున నీవంటి మిత్రుడొకడుండుట మా భాగ్యము.మా యుద్యమమును నిర్దాక్షిణ్యముగ శిక్షించుచున్న ఈ నీచ భూస్వాములనిన నీకసహ్యమన్న మాటే కాదూ? ఇక నేమి? నిస్తావకులు తెల్లవారే కాని నల్లవారు కారు. ప్రకృతి సూత్రములపైనను మానవ ధర్మములపైనను కత్తి కట్టిన యీ తెల్ల పిశాచములనేమి చేసినను పాపము లేదు. ఏమం దువు? నీవును దీని కంగీకరింతువన్న మాటయే గదా ?

పా. సే: నిజమే. ఏమి చేసినను పాపము లేదు.

బైసో: మంచిది. స్వాతంత్ర్య సంపాదనోద్యమమును భగ్న మొనర్చుటకు ఏబదిమంది నల్లవారిని వధించి, పుఱ్ఱెలు తనయింటిముందు వ్రేలగట్టినవాని నేమిచేయవలెనో చెప్పుము.

పా. సే : (భయ వివర్ణ వదనుడై నిరుత్తరుడై యుండెను.)

బైసో : కాపు నగరము చుట్టును నీగ్రోల పుఱ్ఱెలను

త్రేలాడ దీయవలెనని సంకల్పించిన తెల్లవాని నేమి చేయ వలెను?

పా. సే : (వడవడ వడకుచు) అపరాధిని, అపరాధిని అనుగ్రహించవలయును.

బైసో : భయపడెదవేల? నిన్నేమంటిని? నన్ను చెప్ప నిమ్ము. 'పికోలెట్' కోట మొదలుకొని 'కారకల్' వరకును తలలు త్రేలగట్టవలయునట! దీని కేమందువు ? చెప్పుము !

'భయపడెద వేల' 'నిన్నేమంటిని' అను వాక్యములు ఆ నిర్భాగ్యున కించుక ఆస కల్గింప, అట్టి ఘోర సంకల్ప మొనర్చినది తానే యని బైసో యెరిగియుండడని యెంచి, ఒకవేళ ఇంచుక యెరిగియున్నను ఆ యనుమానమును బాప దలచి, ధైర్యమున నిట్లనెను.

పా. సే: అట్లు సంకల్పించిన వాడు ఘోర పాపియని నా యభిప్రాయము.

బైసో : (ఆనంద పులకితుడై) సెబాసు ! అట్టి వాని కెట్టి శిక్ష విధింప వలయునో వచింపుము.

పా. సే. (తటపటాయించుచుండును)

బైసో : ఓహో ! సందేహించుచుంటివే? నిజము చెప్పుము. నీవు నల్లవారికి మిత్రుడవగుదువా ? కావా ?

అప్పటికా ముప్పు తప్పించుకొనుటకు గత్యంతరము గానక, బైసో కన్నులు కోపారుణములు కాకుండుట గుర్తించి, వాడల్లన నిట్లనెను. "అట్టి ద్రోహికి మరణమే శిక్ష"

బైసో నములుచున్న పొగాకు నమిలి, "చక్కగా చెప్పితివి" అనెను. అట్లనునపుడు బైసో నటించిన ఔదార్యము గాంచి, పాపమా పౌర సేనాని మోసపోయెను. ఇంకను తనమీద సేనాపతి కనుమానలేశ మేమూలనైన ఉన్నచో దానినికూడ తొలగింప నెంచి...

"మీ విజయము కాంక్షించువారిలో నేనగ్రగణ్యుడను. నల్లవారి హితము నభిలషించి నేను సంతతము ఫ్రాన్సు దేశమందలి 'బిసాట్' ప్రముఖుల తోడను, అమెరికా యందలి 'మాగా' తోడను, ఇంకను 'హాలండు' 'ఇటలీ' దేశములందలి భూతదయాపరుల తోడను సంప్రదించుచుందును" అని, నాడు గవర్నరు సభలో ప్రయోజనాంతర మభిలషించి కావించిన ఉపన్యాసమే మరల నేకరువెట్ట దొడగెను.

బయసో వాని మాటల కడ్డమువచ్చి "నీ వెవరితో సంప్రదించిన నాకేమి కావలయును? ప్రస్తుతము నా సైన్యమునకు సంబారములు నిండుకొనెను. కావున నీ ధాన్యపుగరిసెలు, తక్కసామగ్రియు నెచటనున్నవో చెప్పుము. నీ పైరు పంటలు సమృద్ధములు. ఇన్ని దేశముల, నిందరు వర్తకులతో సంబంధమున్నవాడవు గావున నీ వ్యాపారము లాభకరమే కానోపును" అనెను.

అత డెట్టులో సాహసించి, "దీనరక్షకా! వారందరు తత్త్వవేత్తలు, భూతహితార్థులు, నల్లవారి శ్రేయము నభిలషించువారేకాని, వర్తకులుగారు" అనెను.

బైసో: (తల పంకించి) మేము దోచుకొనుటకు అక్కరకు రానివాడవు; నీ వలన ప్రయోజనమేమి ?

ఈ ప్రశ్నతో ఆ దీనునకు మరల బ్రతుకు తెరువించుకతోప, ఆతురముగా "శూరశిఖామణీ! మీ సైన్యమున అర్థశాస్త్రజ్ఞుడు కలడా ?" అని యడిగెను.

బైసో: అది యేమి ?

భయగ్రస్తమయ్యు నించుకించుక వెలికి నిగుడు ధైర్యముతో ఆత డిట్లు చెప్పదొడగెను. "అర్థశాస్త్రజ్ఞుడనగా చాల అవసరమైన ఒక మనుష్యుడు. ఆతని అవశ్యకత అందరకు తెలిసినదియే. ఆతడు సామ్రాజ్యమునందలి మూలాదాయములను పరిశీలించి, వాటి తారతమ్యముల నేర్పరించి, తత్తత్ప్రయోజనముల పరిగణనముసల్పి, తత్తత్కార్య కారణ సమన్వయముచే పెంచి, ఆయా ప్రవాహములను దేశోపయోగ మహావాహిని యందు సంక్రమింపజేసి, తన్మూలమున ప్రజైశ్వర్య మహోదధిని నించుచుండును."

బైసో: (మాంత్రికుని దెసవ్రాలి) ఈ గొడవ యేమి స్వామీ ? మీ జపమాలలో గ్రుచ్చిన పగడములవలె నున్నవి; తల తోక లేక, గుది గ్రుచ్చిన యీ మాటలు, మీ కేమైన తెలియుచున్నవా ?

వాడును తన కేమియు తెలియుట లేదన్నట్టుల అనాదరముగ చప్పరించెను.

పా. సే: డామింగో ద్వీపోద్ధారకులలో మేటివగు, ఓ శూర శిఖామణీ! నా మనవి కొంచెము చిత్తగింపుము. అర్థ

శాస్త్ర వేత్తలలో అగ్రగణ్యులగు "టర్గాట్" "రెనాల్"
"మిరాబూ" ప్రముఖులు రచించిన గ్రంథము లన్నింటినీ
నేను సవిమర్శముగా అవగతము చేసుకొంటిని. రాజమాత్రుల
కెల్ల అత్యంతావశ్యకమగు ఈ శాస్త్రమును నేను తరచి,
నిగ్గుతీసితిని.

రిగాడ్: (సహజ కపటహాసముతో) ఈ అర్థశాస్త్ర
జ్ఞుడు మాటల పోదు పెరుగడు.

బైసో: అవునోయీ! వాచాలుడా! ముందు నేనేలు
టకు రాజ్యము తెచ్చుట నున్నదో చెప్పుము.

పా. సే: మహానుభావా! ప్రస్తుతము లేకపోవచ్చును
గాని ముందు ముందు రాకూడదా? అది యటులుండ నిండు.
మీ సైన్యపు టాదాయ వ్యయ నిర్ణయము, దాని పరిపాలనా
సౌకర్యములు, మున్నగు విషయములు కూడ నాకు కరతలా
మలకములే.

బైసో: (వానిమాట కడ్డమై) సైన్యపరిపాల నా సౌకర్య
ములతోను, దాని ఆదాయ వ్యవహారములతోను నాకు నిమి
త్తము లేదు. నేను దాని నియంతను మాత్రమే.

పా. సే: చిత్తము. మరీ మంచిది. మీరు నియంత
లైనచో నేను వ్యవహా రనగుదును. పశుసంతాన వివృద్ధి విష
యమున గూడ నాకు విశేష పరిజ్ఞానము కలదు.

బైసో: (విషపునవ్వు నవ్వి) మేము పశువుల మంద
పెంచతలంచితి మనుకొంటివా యేమి? మేము వానిని చంపి
తినువారమే కాని, తెచ్చి పెంచవలసినవారము కాము. ఈ

ఫ్రెంచి సీమలో పశుమాంసము కరువై పోయినచో, మేమీ కొండలనుదాటి ఆవలి బయళ్ళలో తిరుగు గొఱ్ఱెలను, ఎడ్లను, తెచ్చుకొనగలము. అంతగా అవసరమని తోచిన యెడల, మిక్కిలి దూర భూములకైన నేగగలము. మాంసాహార విషయమై మాకేమియు దిగులు లేదు. కావున నీ పరిజ్ఞానముతో మాకు పని లేదు.

ఇట్లు మరుగు విడిచి చెప్పుటచే ఆ యర్థశాస్త్రజ్ఞునకు మరియొక దారి దొరకదయ్యెను. ఎట్లయినను ప్రాణరక్షణము కర్తవ్యము గాన మరల నొకయెత్తు ఎత్తి చూసెను. "పోనిండు, పశువృద్ధి కాకున్న మరియొకటాయెను. నాకు ఇంకా ఎన్నియో విషయములతో అనుభవ మున్నది. మీ కనేకవిధముల ఉప కరింతును: చెట్ల జిగురు తీయింపగలను. బొగ్గుగనులు త్రవ్వింపగలను. మరియు——"

బైసో: నాకు నీ ఈ ప్రజ్ఞ లేమియు నక్కరకు రావు. బొగ్గు వలసినప్పుడు పదిమైళ్ళ పొడవు నొక యడవిని కాల్పింతునేని మాకు వలసినంత బొగ్గు.

పా. సే: పోనిండు. నౌకా నిర్మాణమున ఏయే దారువు లుపయోగింపవలయునో నాకు తెలియును: ఓకు ఎచ్చట ఉపయోగింపవలెనో, మద్ది యే భాగమునకు పనికివచ్చునో, ఏకిస నెచట వాడవలయునో, చంద్ర నెచట——

బైసో: ఓరి నీగోల కాలిపోను! నిన్ను మృత్యుకింకరు లెత్తుకుపోనూ! నాకు నీవెచట దాపురించితివిరా ?

స్పానిషు భాషలో ఆతడిట్లు విసివికొనుచుండ ఆ యర్థ శాస్త్రవేత్త కది యర్థముగాక, వణకుచు, "కామందుల వారేమియో. సెలవిచ్చుచున్నారు?" అనెను.

బైసో: ఏమియు లేదు. ఇటు వినుము. మేము నౌకలేమియు నిర్మింపబోవుటలేదు. మేము నీకు చెప్పతగ్గపని ఒకటే ఉన్నది. అది అంత ముఖ్యమైనదిగాదు. మమ్మెల్ల వేళలా కొల్చియుండుట కొకమనుష్యుడు కావలసియున్నాడు. తత్వజ్ఞమణీ! నీకాపని యనుకూలించునేమో చెప్పుము. ఇంక నీవు చేయవలసిన పనులా? నిత్యము మోకాళ్ళపై నిల్చి మమ్ము సేవించుట, నా చొంగ గొట్టమును పొగాకుతో నింపి, నిప్పు ముట్టించి అందించుట, నాకు భోజన పానీయా లమర్చుట, పని లేని వేళల నా దాసు లిగువురివలె నీవును చామరము దాల్చి మా వెనుక నిల్చుట_ ఏమందువు? నీకు సమ్మతిమేనా?

వానికి కావలసినదెల్ల ప్రాణభరణమే కావున, పరమానంద భరితుడై పొంగిపొరలు విశ్వాసమున సాష్టాంగ నమస్కారము చేసెను.

బైసో: ఏమి! నేను చెప్పిన పని కంగీకరించితివన్న మాట.

స్పా. వే: చిత్తము. ఏలినవా రెంతమాట సెలవిచ్చితిరి! నిత్యము ఏలినవారిని కొల్చియుండు మహాభాగ్యముకన్న నాకేమి కావలయును.

ఈ ప్రత్యుత్తరము విని బయసో వికటహాస మొనర్చుచు విజయగర్వితుడైన వాడునువోలె నిట్టనిలచి, తనపాద

సమీపమున ఎరగియున్న ఆ తెల్లవాని శిరము పాదమున తొలగద్రోసి ఇట్లనెను.

"తెల్లవాని క్రౌర్య మెట్టిదో మున్నే ఎరుగుదును. కాని నేను వాని నైచ్యము కూడ మూలముట్ట నెరుగ జాలి తిని. నీ దయవలన అపూర్వమగు ఈ యనుభవము నాకు లభించినది. మూఘూకా! నేను గ్రుడ్డివాడనని ఎంచితివి కాబోలు నా కన్నియును తెలియును. జూన్, జూలై, నెలలలో నీగ్రోల నరిదీయునప్పుడు పెత్తరికము వహించిన వాడవు నీవే! ఇంటి చుట్టును ఏబది నీగ్రో పునుకలు వ్రేలదీసిన వాడవు నీవే, నీగ్రో బందీల తలలు తీయించి కాపునగరము చుట్టును వ్రేలగట్టుడని గవర్నరు సభలో సలహా ఇచ్చినవాడవు నీవే! ఈమాట సాగినది కాదుగాని, నీవపుడు నా తలకూడ తీయించి ఆ తోరణములలో గ్రుచ్చియుండవా? అట్టి నిన్ను నేడు నాకు దాస్య మొనర్చుట మహాభాగ్యముగా నెంచుకొనుచున్నాను. నీవెంత నిరభిమానత కగ్గమైనను నాకు నీపై ఇంకను గౌరవము కలదు. కాన నిన్ను అట్టి నైచ్యమునకు పాల్పరచి అవమానింప జాలను—చచ్చుటకు సంసిద్ధుడవు కమ్ము."

సేనాపతి చేసన్న చేయగా పాపమా నీగ్రో శ్రేయ స్వామిని నా చెంత కీడ్చుకొని వచ్చిరి. వాడు నోటమాట వెడలక నేలబడి మూర్ఛిల్లెను.

## 30

ఆ నాడు తన్ను సంకీర్ణు డంటినని నాతో పోరిన

భూస్వామి యింకను మిగిలియుండెను. సేనాపతి వానివంకకు తిరిగి "ఇంక నీ వంతు వచ్చినది" అనెను. వాడేమో మారు పలికెనుగాని, నీగ్రోలెల్ల పండ్లుకొరుకుచు పిడికిళ్ళు ఝళిపించుచును "వీనికిని మరణము, వీనికిని మరణము" అని గోల సల్పుచుండుటచే వాని పలుకులు వినరావయ్యెను.

ఆ కోలాహలము నెల్ల ముంచివేసి వినవచ్చు ఉచ్చైస్వరమున నొక సంకీర్ణుడు "సేనాపతీ! ఈ తెల్లవాడు చావవలసినదే!" అని యరచెను. పాప మా దీను డెట్లో మాట పెగల్చుకొని "వట్టిది, సేనాపతీ! వట్టిది. అన్నలారా! నా తలపై లేనిపోని ఈ నిందలు వేయకుడు. మీ వలెనే, నేనును, సంకరుడనేగాని, తెల్లవాడనుగాను. మీ తల్లుల వలెనే నా తల్లియు నీగ్రోయే" అని గోలపెట్టెను.

క్రోధవివశులగు ఆ నీగ్రోలెల్ల "అసత్యము, వీడు తెల్లవాడే. సంకరులన్న వీనికి మొదటినుండియు ఏవగింపే" అనుచుండ ఆ బంధితుడు "ఇది అసత్యము. నాకు తెల్లవారి మీదనే రోషము. నేను మీవలెనే 'నీగ్రోలే యజమానులు, తెల్లవారే బానిసలని యెప్పుడు వాదించుచుండు" నని మొరపెట్టసాగెను.

నీగ్రోలు: ఎన్నడును లేదు. వట్టిది, చంపుడు. ఈ తెల్లవానిని చంపుడు.

వాడు: అయ్యో! నేను సంకీర్ణుడను, మీవాడను, రక్షింపుడు.

బైసో: దానికి తార్కాణమేమి?

వాడు : తారాల్కాణమూ! నన్నెప్పుడును తెల్లవారు ఏవగించుకొనుటయే తారాల్కాణము.

బైసో: కావచ్చును. కాని, ఓరి కుక్కా! ఆ మాట యనుటకు నీకు నోరెట్లు వచ్చినదిరా!

అంతట ఒక పసుపు సంకరుడు ముందుకువచ్చి ఆవేశముతో ఇట్లు పలికెను. "నిన్ను తెల్లవారు చీకొట్టు మాట నిజమే,—నీకా సంకరులపై అసహ్యమనుటయు, వారిని నీవు నీచముగా చూచుటయు కూడా సత్యమే. నిన్నొక తూరి సంకరడన్నందులకొక తెల్లవానిపై నీవు పోరికి కాలు దువ్వితివని కూడా తెలియవచ్చినది."

ఈ మాటలకు నీగ్రోలెల్ల చీత్కారములు సల్పుచు, కేకిసలు కొట్టుచు, "చంపుడు, చంపుడు" అని యినుమడించిన ఉద్రేకముతో కోలాహలముసల్ప, ఆ దీనుడు కనికరము గొల్పు చూపులతో నన్ను చూచుచు కనుల నీరు పెట్టుకొని "దైవమా! ఈ అపనింద నాకేల చుట్టెదరు. నల్లవాడ ననిపించుకొనుట కన్న నాకు వేరొక కీర్తియు, గర్వకారణమును లేదు. నేను సంకరుడను. ముమ్మాటికి సంకరుడను" అనివిలపించెను.

"నీవు నిజముగా సంకరుడవే యైనచో, సంకర శబ్దము నీనోట రాజాలదు." అని రిగాడ్ నిదానముగా ఎత్తిపొడిచెను. వెరపువేకియెత్తిన ఆ నీచుడంతట "ఆ మాటలో దోసమేమో నాకు తెలియునా? పోనిండు, అంత ఎందులకు? సేనాధిపా! నేను సంకరుడ ననుటకు నా నఖమూలము లందున్న

యీ నల్ల మచ్చలకన్న వేరేమి గుర్తు కావలయును." అని వాపోవుచు చేయి చాపి చూపెట్టెను.

బైసో ఆ చేతి నావలకుద్రోచి "చేయిచూచి యేజాతి వాడవో గ్రహించు ప్రజ్ఞ నాకులేదు. ఆవిద్య మా ఆచార్యునిది. కాని నేను చెప్పునది వినుము. నాసైనికులు కొందరు నిన్ను తెల్లవాడ వనుచున్నారు. కొందరు దొంగ నీగ్రో వనుచున్నారు.ఇందేది నిజమైనను నిన్ను వధింప వలసినది కాని నీవో "నేను మీవాడనే నేనెన్నడు కాదనలేదు." అని చెప్పికొనుచున్నావు. కాబట్టి నీవాదము స్థిరపరచుకొనుటకొక్కటే మార్గమున్నది. ఇదిగో! ఈ ఖడ్గముగైకొని యీ తెల్ల ఖైదీల నిర్వురను వధింపుము." అని నన్నును ఆ నీగ్రో పక్షపాతిని చూపి వికటహాసమునుసల్పుచు తన చేతికత్తివాని కందీయబోవ, వాడు వెనుకకు తగ్గెను. అంతట బైసో "ఏమి! సందేహించెద వేల? నీవు తెల్లవాడవు కావు మా వాడవే అని నమ్మించుటకు మార్గాంతరము లేదు. ఏమాటయు శీఘ్రముగా జెప్పుము. మాకు తొందర పనియున్నది." అని రెట్టించెను.

చేయునదిలేక, వెలవెలబోవు చూపులతో ఆ దీనుడు కత్తిగైకొనుటకు చేయి సాచెను. కాని మరల మనసు వెనుకాడి చేయి వ్రాలిపోవ, మాగుమోమిడి ఆపాదమస్తకము కంపింపగా నిలిచిపోయెను.

బైసో, వేగిరపాటును గినుకయు తోచునట్లుగా, "ఏమి మాటాడవు? మాకావల తొందర పనియున్నది. చెప్పుము.

వారల చంపెదవా? వారితోఁగూడ చచ్చెదవా ?" అని గర్జించెను.

వాడు మారుమాటలేక రాతి బొమ్మవలె ప్రాణస్పడి యుండుటగాంచి, బైసో "మంచిది. వీడీ తెల్లవారిని వధించు నట్లు లేదు; వీనినే వధింపుము. వీడు ముమ్మాటికి తెల్లవాడే. నా యెదుటనుండి వీనిని తీసికొని పొండు" అని నీగ్రోల కాన తిచ్చెను.

ఆ నీగ్రోలు పట్టుకొనుటకు సమీపింపగా వానికి మరల చైతన్యమువచ్చి కర్తవ్యము నిర్ణయించుకొనెను. ఒక్కొక్క ప్పుడు మితిమీరిన పిరికితనము గూడ ఒక తీరు ధైర్యమును పుట్టించునుకదా! వాడు ముందున కడుగిడి, బైసో యింకను చాపి యుంచిన చేతిలోని ఖడ్గము నూడబెరికికొని, వెనుక ముందు చూడక, చరాలున వ్యాఘ్రమువలె ఆ బంధితుని పైకి లంఘించెను. అంతకుమున్ను కుసులుగాలి రాకపోక లొనర్చు ప్రాణములతోఁ వేగుచున్నవాడుగాన ఆ నీగ్రో క్షేమంకరు డీ వృత్తాంత మేమియు నెరుగక నిముషములు లెక్కించుకొనుచుండెను. తనపైకి వాడ ట్లురుకుటయు: వాని చేత ఖడ్గము తళతళ లాడుచుండుటయు గాంచి, ఆ యుపద్ర వము తొలఁగుటకు వెంటనే లేచి, కత్తితోనున్న వాని చేయి పట్టుకొని, గద్గద కంఠుడై "రక్షింపుము. రక్షింపుము. నాపై కేలవచ్చెదవు? నేనేమి జేసితిని?" అని పెనగజొచ్చెను. తన ఖడ్గధార కెరగానున్న వానిపై తన పిచ్చిచూపులు నిలిపి ఆ సంకరుడు "నీ వెట్లును చావవలయునట, నేనే చంపెదను.

చంపనిమ్ము, నొప్పిలేకుండ చంపెదను." అనుచు తన చేయి వదలించుకొనుచుండెను.

బంధితుడు : నీచే జావవలయునా? ఎందులకు? వలదు వలదు. నన్ను బ్రతుకనిమ్ము. నిన్ను, మున్ను సంకరుడాయని యంటినన్న కోపమేమో? వద్దు నన్ను విడువుము. నీ పాదమాన, నీవు తెల్లవాడవని ప్రమాణము చేసెదను. అంతయేల? నీవు తెల్లవాడవే! ఎవరు కాదనిరి? వలసినచో నేనీ మాట దేశమెల్ల చాటి వచ్చెదను నన్ను విడువుము.

పాపమా దౌర్భాగ్యుడు వానిని వేడుకొనుటలో తప్పదారి ద్రొక్కెను. వాడును నీగ్రో లీవాక్యములు విన్న మరల నేమి మునుగునో యన్న భీతిచే "మూయుము, నోరు మూయుము" అని యదలించుచున్నకొలది, ఆ బంధితుడు మరింత బిగ్గరగా "నీవు తెల్లవాడవే నేనెరుగుదును. మీ కుటుంబమెంత మంచిది. నీవెంత మంచివాడవు" అని అరచుట మొదలిడెను.

ఆ సంకరుడును, ఎట్లయిన వానినోరు మూయవలయునని మరల ప్రయత్నించియు ఫలము గానక, వాని చేతు లావలకు ద్రోచివైచి, రొమ్మున ఖడ్గము నానించెను. వాడును ఖడ్గము రొమ్మున నాటుచుండుట గాంచి, ఏమియు తోచక, కత్తిని పట్టియున్న వాని చేయి కరచి "రాక్షసుడా! పిశాచమా! నన్నేల చంపెదవురా?" అని యరచుచు బైసోను దీనదృష్టులతో జూచి "అగతిక గతికుడా! శరణు, కాపాడుము" అని విలపించెను.

అంతలో వాడాఖడ్గమును మరింత బలముతో నాటగా, బుస్సున నెత్తురుచిందె వాని చేతిమీదను మొగముమీదను బడెను. దౌర్భాగ్యుడగు ఆ నీగ్రో క్షేమంకరుని మోకాళ్ళు వంగి, చేతులు వ్రాలి, కనులు మూతలుపడి, ఒక్క మూల్గున నేలబడి యీల్గెను.

## 31

నేనీ భయద వృత్తాంతమెల్ల కనులప్పగించి గాంచుచు నా వంతెప్పుడు వచ్చునోయని వేచియుంటిని.

చెక్కు చెదరక, రెప్పపాటైన వ్రాల్పక ఆ 'అగతిక గతికుడు' ఈ ఘోరమెల్ల తిలకించి, 'మరికొంచెము తంబాకు' అని కేకవైచి, నిర్వికారుడై, ఆ తమ్మ నములుచు కూర్చుండెను. మాంత్రికుడును, రిగాడ్నుగూడ అట్లే అచంచలులై కాన్పించిరి; కాని నీగ్రోలు మాత్రము తమ కనులయెదుట సేనాని నడపిన ఈ ఘోరమును గాంచి భయచకితులైరి.

చంపగా మిగిలిన తెల్లవాడ నింక నే నొకడనే మిగిలియుంటిని తుదకు నా వంతును వచ్చినది. ఇక నన్నుగూడ తుదముట్టింప నున్న ఆ హంత వంక చూడ నాకు కనికరము జనించుచుండెను. రక్తారుణములగు ఓష్ఠములతో, కరచుకొని పోయిన పండ్లతో, నిలువెల్ల వడంకు మేనితో, ఆతడు నిలిచియుండెను. మొగమెల్ల కలయచిందిన నెత్తురును పోదుడిచికొనుటకోయన అప్రయత్నముగ వాని హస్త మొడనెడ నుదుటిమీది కరుగుచుండెను. తన కత్తి కెరయై నేల బడియున్న ఆ

నెత్తురుమూటను వదలి రానొల్లని వాని నేత్రములు భయాశ్చర్యముల కిరవై ఆ శవముపై లగ్నమై యుండెను. వాడు మరల వధప్రయత్నమున కెపుడు దొరకొనునో యని నేనెదురు చూచుచుంటిని. మా ఇరువురి యవస్థయు నెంత చిత్రముగా నున్నదో చూడు. ఇంతకుము న్నొకపరి వాడు తెల్లవాడ ననిపించుకొననెంచి నాపై కత్తి దూసియు చంపనేరడయ్యెను. నేడు మరల నల్లవాడ ననిపించుకొనుటకు వాడే నన్ను చంపనుండెను.

ఇట్లు నిలిచియున్న వానిని బయసో చేరబిలిచి "అబ్బీ! మంచిపని చేసితివి. నీవు నాకు నచ్చితివి." అని నా వంక చూచుచు "ఇక రెండవ వానిని నీవు చంపనక్కరలేదు. నీ వింక మావాడ వైతివి. ఇది మొదలు నీవు మా సైన్యమున తలవరివికమ్ము."

అనుచుండ భటశ్రేణినుండి నీగ్రోయొకడు ముందునకు వచ్చి, ముమ్మారు మ్రొక్కి, "సేనాపతీ! మరి నేనో?" అనెను.

బైసో : ఏమిరా! నీకేమి కావలయును ?

వాడు : స్వామీ! నేనువచ్చిన యీ తెల్లకుక్క శరీరము కాపాడుకొననెంచి యీ హత్య కావించినందులకే యింత ముఖ్యమైన ఉద్యోగ మొసంగితిరే! నా మాట యేమి చెప్పెదరు? నేనచ్చపు నల్లవాడనుగదా! నాకేమియు నుద్యోగ మొసగరా ?

ఈ విన్నపము తేలవని తలంపై బైసో నించుక కలత పెట్టెను. రెగాడ్, అంతట బైసో చెవిలో "నీవు వానిని మెప్పింప

జాలవు. నీదియో చెప్పి తప్పుకొమ్ము" అని యుపదేశించెను.

బైసో అంతట ఆ నల్లవానినిగాంచి "ఏమిరా ! నీకేమి యుద్యోగము కావలయునో చెప్పుము. చూచెదను" అనెను.

వాడు : సేనాపతీ ! నన్ను నా గుంపునకు హావల్ దారును కావింపుము.

బైసో : హావల్ దారు పని కావలయునో! మంచిది. నీ యోగ్యతలు ?

వాడు : దేవరా! అవధరింపుడు. గడచిన ఆగస్టు నెలలో తెల్లవారి ఇళ్ళకు మున్ముందు చిచ్చుపెట్టిన వాడను నేనే. 'క్లెమెంట్' అను భూస్వామిని వధించి, వాని ప్రధానోద్యోగి శిరమును బల్లెపుమొనకు గ్రుచ్చి యెత్తినవాడను నేనే. మరియును, పదిమంది యువతులను, ఏడుగురు పసిపిల్లలను వధించి, అందొక బాలుని బల్లెపు మొనకు గ్రుచ్చి, బక్‌మన్ సేనలకు పతాకగా నొసగినది నేనే. తదనంతరము, నలుగురు భూస్వాముల కుటుంబములను గాలిఫెట్ కోటలో ఒక గదిలో బంధించి, నిప్పు ముట్టించి, మలమల మాడ్చి చంపినవాడను నేనే.ఇదియెల్ల నటులుండగా,నా తండ్రిని తెల్లవారు కాపునగరమున కొరతవైచి చంపిరి. 'రాక్రో' లో నా యన్నను ఉరి తీసిరి.నన్నుకూడ ఫిరంగివాత వేయనెంచిరి గాని, నే నెట్టులో బయట పడితిని. ఇంకను చిత్తగింపుడు. పది కాఫీ తోటలు, ఆరు నీలిమందు తోటలు, రెండువందల యకరముల చెరకు తోటలు నేనొక్కడినే చేతులార కాల్చి

బూడిద చేసితిని. నా యజమానిని వధించితిని. వాని తల్లిని గూడ___"

"ఇక చాలింపుము నీ యోగ్యతాప్రశంస." అని రిగాడ్ వానిని వారించెను. సౌమ్యతావగుంఠిత మగు క్రౌర్యములకు అనుగ్రహ కవచితమగు ఆగ్రహమునకు నిలయమగు రిగాడ్, ఈ దారుణ మారణ కర్మప్రశంస వినలేక పోయెను.

ఆ నీగ్రోయు సగర్వముగా "ఇంక నిట్టివన్నియో చెప్ప గలను. కాని నేను కోరిన వరమొసగుట కివియే చాలునని చిత్తగింతురేని నాకా వరము ప్రసాదింపుడు" అనెను. సేనాపతి కొంతవడి యోచనా నిమగ్నుడైన వాడువోలె ఊరకుండి, గంభీరముగా నిట్లు వచించెను. "నీ సేవ నాకు సంతసము గూర్చి నది. నీవు నా మనసువచ్చిన వాడవు. నీ కేయుద్యోగ మొస గుట కభ్యంతరములేదు కాని, నన్నొక సందేహము బాధించు చున్నది. నీకు లాటిను భాష వచ్చునాయని, ఏమి వచ్చునా?"

అబ్బురపాటుతో నెడదలైన నేత్రములతో వాడు "చిత్తము ఏమి సెలవు?" అనెను.

బైసో: నీకు లాటిన్ భాష వచ్చునా యని యడుగు చుంటిని.

వాడు: లా___లా___టి___నా! దేవరా!

బైసో: ఔను. లాటినే. వచ్చునా నీకు?

(లాటిన్ పాట వ్రాసియున్న అచటి పతాకము విప్పి) నీ వెరుంగుదువేని దీని యర్థమేమో తెలుపుము.

అది యేమో, దానియర్థ మేమో తెలియ నెరుగని

ఆ మూర్ఖుడు, ఏమి చెప్పుటకు తోచక, చేతులు నులిమికొనుచు, పతాక వంకను, సేనాని వంకను, ఎగాదిగా చూచుచు, పెదవి మెదల్పక మొద్దువలె నిలిచియుండెను.

"అట్లు చూచెద వేమి? కానీ, చెప్పుము" అని బైసో కోపగింప, వాడును పలుమారు పెదవులాడించి, తల గోకికొనుచు, వినీ వినరానియట్లుగా "స్వామీ! నాకది తెలియ లేదు" అనెను. ఎట్టెటూ! దొంగ వెధవా! నీకీమాత్రము లాటిన్ రాదుకాని హావల్దార్ పని కావలయునేమి?" అని బైసో కన్నులెఱ్ఱ జేసెను.

"కాని దొరా!" అని వాడేమో నత్తుచూ విన్నవింప బోవ, బైసో మరింత కోపఘూర్ణితుడై "నోరు మూయుము. నిన్ను పట్టున త్రేల్చి వేసినను దోషములేదు. రిగాడ్! నీ చెప్పు డేని యిట్టి వింత వింటివా! ఈ విధవకు లాటిన్ రాదట! కాని పెద్ద ఉద్యోగము కావలెనట! మంచిది. ఓరీ వ్యర్థుడా! ఆభాష నీ వెరుగవు. ఆ జెండాపై వ్రాతకు నేనర్థము చెప్పెద నిటు వినుము. లాటిన్ రాని ఏ సైనికుడును ఉద్యోగి కాజాలడు" అని దాని యర్థము. తలవరి యుద్యోగము పొందెనని నీ వెవనితో మచ్చరించితివో ఆ మా సోదరునకు లాటిన్ వచ్చును." అనుచు, క్రొత్త తలవరి వంక తిరిగి "నీకు లాటిన్ వచ్చును కాదూ? ఏదీ! ఈ వాక్యమున కర్థము చెప్పుము. ఈ మొద్దునకు బుద్ధివచ్చును" అని ఒక లాటిన్ వాక్యమున కర్థ మడిగెను.

నిమీలితచిత్తుడై, తలవంచియున్న ఆ నిర్భాగ్య సంకే

ర్ణుడు, భయావహుడగు బయసో మాట విని ఉలికిపడి తల పైకెత్తి చూచెను. ఆవల తానొనర్చిన నికృష్టవధ తన్ను బాధించుచున్నను ఈవల భయంకరుడగు బైసో ఆజ్ఞ శిరసా వహింపవలసి వచ్చెను. పాపము! అప్పటి వాని యవస్థ శోచనీయముగ నుండెను. అనుతాపపూర్వకమైన చిత్తాందోళనలో ఎన్నడో చిన్ననాడు బడిలో చదివిన ఆ భాష జ్ఞాపకము చేసికొనుచు, వచ్చీరాని పాఠము నొప్పజెప్పు పిల్లవానివలె 'నీకు దైవము తోడుగాక' అని యర్థము చెప్పెను.

పిమ్మట బైసో పట్టరాని కోపమున ఆ సైనికుని నోటికి వచ్చినట్లెల్లా దిట్టుచు, అందు మధ్య మధ్య లాటిన్ మాటలు ప్రయోగించి తన పాండిత్యమును బయలుచేసి, పిమ్మట వానిని "పొమ్ము. వెనుక కేగి నీ వుండదగిన చోటనుండుము. లాటిన్ భాషా పాండిత్యముచే లభింపదగిన పదవుల కాసింతువేని నీ తల తీయుదును. జాగ్రత్త" అని బొబ్బలిడెను.

భయభ్రాంతుడై ఆ దీనుడు సేనాని తిట్లను, తోడి వారి సీత్కార ఫూత్కారములను భరించి, సగము చచ్చిన వానివలె వెనుక కొదిగెను.

ఈ జరిగిన చిత్రకథ యెంత అపహాస్యముగా నున్నను, అందు బయసో పరిపాలనా దక్షత మాత్రము కొనియాడదగనది. అది నా మనస్సుకు బాగుగా నచ్చెను. ఇంతేకాదు. వీడు వంచకుడయ్యు గొప్ప మేధావి యనియు, వీని యనుచరులు కడు నమాయకులనియు కూడ కానవచ్చెను. తలకు తగని కోరికలు గలవారిని నల్వురిలో నగుబాటు పాలుచేసి నోరు

మూాయించుట వీని నీతి. అశిక్షిత జనములకు అట్టి కోర్కెలు పొడముట తదధికారులకు ప్రాణగొడ్డము కాదా !

## 32

ఇంతలో తిండివేళయయ్యెను. ఒక జొన్నరొట్టె, ఒక బుడ్డి బ్రాంది, కొన్ని రకముల మాంసపు వంటకములు తెచ్చి బైసో ముందర పెట్టిరి. వాడు తన జేబులో నుండి యిన్ని వెల్లుల్లిపాయలు తీసి, వాటిని కొరికికొనుచు ఆ తిండి తినదొడగెను. అది చూచి, వానిది దయ్యపుటాకలివలె నుండెను. రిగాడ్ కూడా వానితో కలియబడి ఆ తిండియే తినుచుండెను. కాని మాంత్రికుడు దాని జోలికి పోలేదు. నిరాహారులై జీవితము గడిపెడి యోగీశ్వరు లనిపించుకొని, జగమును వంచించుటకు కాబోలు, వీనివంటి దొంగ యోగులెవ్వరును ఇతరుల ఎదుట నేమియు తినరు.

తిండి తినుచునే బైసో తన అంగరక్షకుని బిలిచి "సైన్యములను చిత్తగింపవలెను, సాగింపుము" అన వాని యానతిని దళములన్నియు ఒకదానివెంట నొకటి బయలుదేరెను. మొదటి దళము 'మోరన్ రూజ్' నీగ్రోలది. అందు తుపాకులు, కత్తులు, బల్లెములు, విండ్లను దాల్చి ఆజానుబాహులును, శక్తిసంపన్నులును అగు నాల్గువేల మంది కలరు. వాళ్ళకు పతాకములేదు. విచార వదనములతో ఆ సేన నడచిపోవుచుండ, బైసో, రిగాడ్ చెవిలో నిట్లనెను: "ఈ మోరన్ రూజీ' దళము లెన్నడు శత్రు శతఘ్నులవాతబడి ధ్వంసము లగునా,

యెన్నడు నాకు వీరిపీడ వదలునా, అని కోరుకొనుచున్నాను. వీరు నాకు గిట్టరు. ఈ జాతికి మన యుద్ధ పద్ధతులు పనికిరావు వీరు 'ముఖాముఖిని పోరాడవలెనుగాని, దొంగపోటు కూడ' దందురు. బగ్ జార్గల్ వీరికిచేసిన బోధ యిది. ఆ కుత్ర విధవ, మహోదారత నటించెడివాడు. వానిని నీ వెప్పుడును చూడ లేదు. ఇక చూడవులే. వాడు తెల్లవారి బారినిపడి బక్‌మన్‌వలె నేడో రేపో కడతేరనున్నాడు."

ఇది యాలకించుచునే సేనా పరిక్రమణము చూచుచున్న రిగాడ్ బైసోతో ఇట్లనెను. "అరుగో మకాయా నిగ్రోలు బక్‌మన్‌గూర్చి మాటలాడుకొనుచు పోవుచున్నారు. జీన్ ఫ్రాంకోనుండి నీకు వార్త తెచ్చిన భటుడు వారిలో కలడు. ప్రవేశార్థము వాని నరగంటసేపు వాకిట నిల్పుటయు, బక్‌మన్ మరణవార్త వాడు ముందు నాతో చెప్పుటయు, సైన్యము తెలిసినచో మన జోస్యుని బూటకము బైట పడునేమో" బైసో సంతోషించి "బాగుగా జ్ఞాపకము చేసినావు. మిత్రుడా! వీని నోరు నొక్కవలెను. క్షణముండుము" అని "ఓ మకాయా సైనికులారా!" అని యెలుగెత్తి పిలిచెను. వారి నాయకుడు ముందునకు వచ్చి, వినమ్రుడై నిలువగా, బైసో "మీలో ఆ వార్తాహారుడు నడుచుచున్నాడు. వానిది వేరొక దళము. వాని నిటు పంపుము" అని ఆజ్ఞాపింప నా నాయకుడు తత్క్షణము పోయి వానిని గొనివచ్చెను.

బైసో లేనికోపము తెచ్చుకొని వానిని "ఎవడవురా నీవు?" అని గద్దించెను.

వార్తాహారుడు: స్వామీ! నేను నల్లవాడను.

బైసో: నీవు నల్లవాడవని నే నెరుగుదును. నాకు కావలసినది నీ పేరు.

వా. హా: నా పేరు "పావిలాన్" నా యిష్టదైవము 'సాబాన్'

బైసో: మంచిది. ఆయుధపాణులైన సైనికులు బారులు తీర్చి నడచు సమయమున, ఒరలేని కత్తితో, చినిగిన గుడ్డలతో బురద యంటిన కాళ్ళతో, వారిమధ్య నిన్నెవ్వరు నడువ మనిరి?

వా. హా: స్వామీ! అది నా తప్పుకాదు. జీన్ ఫ్రాంక్‌గారు పంపిన కబురు మీ కందజేయుటకు, దారిలో ఎచ్చటను నిలువక, నీటిని బురదను త్రొక్కికొనుచు, చావు బ్రతుకులమీద పరుగిడుచు వచ్చినందున నా కాళ్లును, గుడ్డలును ఇట్టులయినవి. అదిగాక నన్ను అరగంటసేపు వాకిట...

బైసో: (వానిమాట కడ్డమై బొమలు ముడిచి కనులింత చేసి) నేను సన్నిదియంతయు నడుగలేదు. ఈ చినుగుగుడ్డలతో నా సైన్యము నెట్లు చేర సాహసించితివో చెప్పుమంటిని, పొమ్ము నా మాటగా చెప్పి తుపాకి వాతబడుము.

ఈ కథలో బైసో దక్షత మరల నాకు పొడగట్టినది. ఆ నిర్భాగ్య వార్తాహారుడు "అవును, కాదు" అని నోరుమెదల్పక చేతులు కట్టుకొని సేనానికిని, మాంత్రికునకు మూడుసార్లు తలవంచి దండముపెట్టి, తుపాకివాతె పడబోయెను. నాలుగైదు

నిముషములకు ఆ కొండప్రక్క వినవచ్చిన తుపాకిమ్రోతవలన వాడంతమయ్యెనని ఊహింపనయ్యెను.

ఈ విధముగా అన్ని యాటంకములు పరిహరించుకొని బైసో రిగాడ్‌వంక చూచి "నా శక్తి మెచ్చవేమి ?" అనునట్లు చిరునవ్వు నవ్వెను.

## 33

సైన్య పరిశీలన ముగియలేదు. అంతకుమున్ను ఈ మూకలెల్ల స్కంధావారమున నున్నపుడెంతవింతగానుండెనో, ఇపుడు సాయుధములై యుద్ధసన్నాహము నెరయనడచు నపుడు గూడ అంత వింతగనే యుండెను. ముందు కొమ్ము లూదుచు కొందరు చనుచుండ, ఆ మ్రోత కనుగుణముగా అడుగు లిడుచు, ఛింకి పేలికలు మొలలకుజుట్టి, చేతులలో కట్టెలు, ములుకోలలు పూని, కొందరాటవికులు వెనుక నరుగుచుండిరి. వారి వెంట ఆంగ్ల స్పానిషు దళమువలె వేషములు దాల్చిన సంకీర్ణుల దళములు, సాయుధ పరికరములై భేరీనాదానుగుణముగా పదవిన్యాసము సలుపుచు నడచిపోయెను. పిమ్మట కొంకులు కొడవళ్ళు బూని నడచెడి నీగ్రో స్త్రీ బాల సమూహమును, ఆ వెనుక పనికి రాని ప్రాత తుపాకి కట్టెలు భుజముల బరువై తోప కాళ్ళీడ్చుకొనుచు జను ముక్కుడి మూకలును, వారి వెనుక ఈకల బొంతలను దాల్చి, చితారులు, తప్పెటలు మ్రోయించుచు, ఆడుచు పాడుచు చనుచున్న గిరోటి

తండములును, అనంతరము ఆచార్య మాంత్రిక సమాజ
మును చనుచుండ, వారి వెన్నుదన్ని సంకీర్ణులు,
అధమసంకీర్ణులు, స్వతంత్రులు, పారిపోయి వచ్చిన తిరుగు
బోతు బానిసలును, గుంపులు గుంపులై సగర్వములగు
చూడ్కులు దెసల బరపుచు, భుజముల మీద తుపాకులు
తాల్చినవారును బండ్లను, విజయ చిహ్నమాత్రము లగు
శతఘ్నులును ఈడ్చుకొని పోవుచు, దిక్కు లవియునట్లు
పాటలు పాడుచు నేగుచుండిరి. అందర తలలపైనను నానా
వర్ణములగు ధ్వజ పతాకా కేతనాదులు గాలిలో పటపట
మని యెగుర జొచ్చెను. అందు కొన్నిటిపై "గురువులకు
ప్రభువులకు సర్వనాశనము" అనియు, కొన్నిటిపై "మతమునకు
జయము" అనియు, ఇంక కొన్నిటిపై "స్వాతంత్ర్యము సర్వ
సమత్వము" అనియు, వేరకొన్నిటిపై "రాజునకు విజయము"
అనియు, ఇంక నేమేమో తలయు తోకయు లేని వాక్యములు
వ్రాయబడి యుండెను. పరస్పర విరుద్ధములగు ఈ వాక్యములే
వారి వివేక విహీనతను అవిమృశ్యకారిత్వమును వెల్లడి
చేయుటకు చాలియుండెను.

వివిధములగు ఈ వరుసలెల్ల, గుహా ద్వారమును
సమీపింపగనే, ధ్వజములు వంచి వినమ్రములై, సేనాపతికి
ప్రణామములు సల్ప, బయసో వానినెల్ల ఆదరమున శిరము
వంచి గైకొనుచు, కొన్ని దళములను బొగడుచు, కొన్నిటిని
తెగడుచుండ, వానినోట వెడలు ఆ పల్కులను సైనికులు
భయ సంభ్రమములు పెనగొన అవహితులై వినుచుండిరి.

ఆ యనాగరక సేనలిట్లు చనుచుండ నాకు కొంతసేపు వినోదమై. తుదకు విసువెత్తెను. అంతలో ఆ దరీద్వారము అరుణకాంతి నిమజ్జితముగా భాస్కరుడస్తంగతుడయ్యెను.

# 34

పిమ్మట బియసో కొంత తడవు కలగనుచున్నట్లు మైమరచి యుండి, మరల తెలిసి, దండనాయకుల కవసరములగు ఆజ్ఞ లొసగి పంపి, సైనికు లెల్లరు వారివారి గుడిసెల కేగిన పిమ్మట, నను క్రీగంట కనుంగొనుచు "యువకుడా ! చూచితివిగదా, నా ప్రజ్ఞయు ప్రతాపమును, నీ వింక 'లిమోగిరి'కి వార్త గొంపోవు సమయమాసన్నమగుచున్నది" అనెను.

నేను నిశ్చలుడనై "ఈవరకే కొంపోవలసినది. ఇందు నా యాలస్య మేమియు లేదు" అంటిని.

"నిజము చెప్పితివి" అని, ముందు తాను చెప్పనున్న మాటలకు నేనెట్లగుదునో చూచుటకో యన, కొంచెమాగి, మరల, "ఇప్పటికైనను, ఈవార్త కైకొని వెళ్ళుటయు మానుటయు, నీలోనే యున్నది" అనెను.

ఆ పలుకులకు నే నాశ్చర్యమంది "అది యెట్లు ?" అని అడిగితిని. "వలసినచో ప్రాణము రక్షించుకొను మార్గము నీ చేతిలోనే యున్నది అని వాడు బదులు పలికెను.

ఎన్నడు లేని వాని ఈ విపరీతపు జాలి నన్నాశ్చర్యమున ముంచెను. ఆచార్యుడును ఆశ్చర్యచకితుడై,

సభాలున నేల నుండి సేనాపతి కభిముఖుడై కోపముతో "అది ఏమి! యట్లులంటివి? నీ వొసర్చిన వాగ్దానమును మరచితివా? ఏమి? వీని ప్రాణములు నీ చేతిలోను, ఈశ్వరుని చేతిలోనూ కూడా లేవు. అవి నావి సుమా!" అని మందలించెను.

అపుడు వాని కంఠ ధ్వని మరల నాకు జ్ఞప్తికి వచ్చియు, అంతలో స్మృతినుండి జారిపోయెను.

బయసో అంతట ఆసనము దిగి మోమున ఆగ్రహ లేశమేనియు తోపనీయక, కొంతసేపు ఆచార్యునితో గుసగుస లాడి, అచటనున్న నలుపు రంగు పతాకము దెస చేయి చాచి వానికి చూపెట్టెను. ఆచార్యుడును 'సరే' యనెను. అంతట ఎవరి యాసనమును వారధిష్ఠించిరి.

పిమ్మట 'జీన్ ఫ్రాంకో' పంపిన కాగితములు జేబు నుండి వెలికి దీసి, బయసో నాతో నిట్లు వచించెను.

"వింటివా! మా వ్యవహారమంతయు చెడుచున్నది. 'బక్‌మన్' ఆ తీరమ్మేగదా, 'కల్‌డిసాక్' ప్రాంతముల మా వారిని రెండువేలమందిని తెల్లవారు పరిమార్చిరి. భూస్వాము లెల్లరు ఆత్మరక్షణమున ఏమరక కోటలు మున్నగునవి సురక్షిత మొనర్చుకొనుచున్నారు. మా చేతబడుటకు సిద్ధమైన 'కాపు' నగరమును గూడ మేము చేతులార పోగొట్టుకొంటిమి. మరల మాకింతలో అట్టి యవకాశము లభింపదు. తూర్పు దెసగా నేగుదుమన్న అచట ఏరొకటి అడ్డమయ్యెను. దానిని మేము దాటుటకు తావు లేకుండా తెల్లవారు ఆవలి

రెండ్డున ఫిరంగులతో కాచియుండిరి. దక్షిణమునకూడ ఆ పర్వతమార్గము నల్లశతఘ్నులతో కాచుచున్నారు. కావున కాపు నగర మింక మాకు చిక్కుట కల్ల. ఆ రేయి కొండలలో అట్లు పొంచి ఆక్రమింప అదియును వ్యర్థమయ్యెను. ఇవి యన్నియు-జాలక స్కంధావారమున జ్వరదేవత ప్రవేశించి పీల్చుకొని తినుచున్నది. ఇదియెల్ల విచారించి మా సర్వసేనాపతి గవర్నరుతోడను తత్సభిక వర్గముతోడను సంధిగొనదల్చ కొన నిశ్చయించెను. నాకు అదియో ఉచితముగా తోచినది. ఇదిగో గవర్నరు సభ్యులకు మేము వ్రాసిన ఉత్తరము వినుము.

"శాసన సభ్యుల సముఖమునకు

ఆర్యులారా!

ఈ మహారాజ్యముపై వెల్లివిరిసిన విపదంబుధిలో మేమును మునిగితిమి. మేము చేసిన పని మంచిదని చెప్ప జాలము, కాని ఎన్నటికైన మా మంచితనమును మీరుకూడ గ్రహింపకపోరు.

మా దృష్టిలో స్పెయిన్ రాజు చాలా మంచివాడు. మా యందలి అనుగ్రహముచే ఆ మహారాజు మా కెన్నియో ఉపకారము లొనర్చెను. కావున మేము ఎప్పటి యట్లు భయభక్తులతో ఆతనిని కొల్చుచుందుము.

1791 వ సంవత్సరము సెప్టెంబరు 28వ నాడు చేసిన శాసనముచే జాతీయ శాసనసభయు రాజునుకూడ బానిసల హోదాను, రంగు జాతుల రాజకీయ స్థితిని స్పష్టీకరించి నిర్ణయించుట కనుమతించిన వారైరి. మేము ఆబాల గోపాలము

ఆ శాసనమునకు కట్టుబడి తత్పక్షార్థము ప్రాణములనైనవిడువ సంకల్పించుకొంటిమి.

బానిసల స్థితిగతుల విషయమున మీ యుద్దేశములను మీ సేనాని యనుమతినిపొంది, ప్రకటించినచో, తెలిసికొన వలయునని మా కెంతయు కుతూహలముగా నున్నది. తమ నాయకుల ద్వారా ఈ విన్నప మంపుచున్న భవదనుగ్రహ పాత్రులను ఈ బానిసలందరును, ప్రస్తుత వైషమ్యము లంత రించి మరల తొంటి సద్భావము నెలకొనినచో సంతసింతురు. అంతేకాని, సభ్యవరులారా! ఈ యరాచక సభల యానతిని తలదాల్చి, మేము ఆయుధములుదాల్చి వచ్చెదమని మాత్రము మీ రనుకొన నక్కరలేదు. మాకు మువ్వురు ప్రభువులుకలరు. నల్లవాండ్ర కందరకు జన్మతః ప్రభువైన కాంగో రాజొకడు, మా తండ్రులందరకు ప్రతినిధియగు ఫ్రాన్సు రాజొకడు, మా తల్లులకెల్ల ప్రతినిధియగు స్పెయిన్ రాజొకడు. ఈ యేలికల పూర్వులందరు సత్యపథగాములై తరతరముల నుండి మానవ సేవయే ఈశ్వరారాధనముగా భావించి లోకారాధన మొనర్చు చుండిరి. అట్టి ప్రభువుల యేల్బడిని సుఖించుచున్న మా సోద రులపై ఈ యరాచక సభల యానతిచే మేము కత్తిగట్టితి మేని మా రాజభక్తికే మోసము రాగలదు. అదియునుగాక, ఈ ప్రపంచము పుట్టినప్పటినుండియు మేము రాజాజ్ఞను ఔదలదాల్చుటయేకాని, ఈ 'జాతీయతలు, స్వాతంత్ర్యములు' అను మాటలేమో యెరుగము. ఫ్రాన్సు రాజుకు మాపై అను గ్రహము. స్పెయిన్ రాజు మాకు సర్వసహాయము. వారికి

మేము, మాకు వారు తోడునీడలమై యుందుము. మానవాభ్యుదయము కొరకే మేమిట్లు శ్రమపడుచున్నాము. ఒకవేళ ఆ ప్రభువులు మాకు కాకపోవుదురేని పోనిండు. మేము మా వానినే ఒకనిని అభిషిక్తు గావించుకొందుము. మేము సంధికి విముఖులము గాము, కాని మా యూహాలు మాత్ర మివి.”

జీన్ ఫ్రాంక్లో — సర్వసేనాపతి

బైసో — సేనా నాయకుడు

డెస్ప్రెజ్<br>
మాంజూ<br>
పొజంట్<br>
ఆబర్టు } వ్యవహర్తలు,

నీగ్రో రాజనీతికి లక్ష్యమగు ఆ యుత్తర మంతయు నా మనమున అచ్చుగ్రుద్దినటు లుండెను.

ఉత్తరము ముగిసిన పిమ్మట బయసో మరల ఇట్లు వచించెను: “చూచితివా? మేము శాంతినే కోరుచున్నాము. మరినీవు మా కొక్కపని చేసిపెట్టవలెను. నాకుగాని, జీన్ ఫ్రాంక్లోకుగాని మీ చదువులు రావు. మీ భాషలో మాట పొందికలు మాకు కుదరవు. మేము కత్తిపోటు నెరుంగుదుము గాని కలముపోటు నెరుంగము. కావున మా యుత్తరమును చూచి మా తొల్లిటి యజమానులు నవ్వుకొనుటకు సందుండ రాదని నా కోరిక. మాకురాని యీ అల్పవిద్యలలో నీకు

మంచి ప్రవేశమున్నట్లు తోచుచున్నది. కావున యీ యుత్తరమున దోషము లేమైన ఉన్నచో మరల ఆ తెల్లవారుచూచి నవ్వకుండ సవరించి పెట్టుము నిన్ను ప్రాణములతో విడిచెదను”

తుదకు బయసో వ్రాసిన వ్రాతలో తప్పులు దిద్ది శరీరమును రక్షించుకొను దుర్గతికి నా మనసు పాల్పడక, నాకు ప్రాణములపై తీపియు లేక, వాని యీ కోర్కె త్రికరణశుద్ధిగా నిరాకరించితిని.

వాడు నా నిరాకరణకు ఆశ్చర్య చకితుడై “ఏమి ? ఈ కాగితముపై నాలుగుగీట్లు పెట్టుటకన్న నీకు చావె మంచిదయ్యెగా !” అనెను.

నేను ‘అవును’ అని జవాబిచ్చితిని. నా నిశ్చయము వాని మనస్సును కలచెను. కొంతవడి యేమో యోచించి మరల నిట్లనెను: “బుద్ధిహీనుడా ! నీ పడుచుదనపు బింకములు మాని నా మాట వినుము. నేను నీవలె మొండికెత్తుట లేదు. చూడు ! నీకు రేపటి సాయంతనము సూర్యాస్తమయమువరకు గడు వొసంగితిని. మరల అపుడు పిలిపింతును. పొమ్ము. తొందరపడక నా మాటలు బాగుగా యోచించుకొనుము. ఈ రాత్రి నీకు సద్బుద్ధి పొడమగలదు. మాచే చచ్చుట యనగా నీ వేమనుకొంటివో గాని చావునకు ముందు బోలెడు గాథ జరుగవలయును సుమీ ?”

అనుచు వాడు సల్పు వికటహాసము చూడ, చంపుటకు ముందు వాడు పెట్టు ఘోరహింసలన్నియు ఒక్కమారుగా నా మనమున స్ఫురించెను.

"కాన్డి! ఈ బంధితుని గొంపోయి మారెన్ రూజీ సైనికుల వశమున నుంచుము. ఇతరులైనచో నే నొసగిన ఈ ఒక్కనాటి గడువైనను వీనికి దక్కనీయరు" అని బైసో ఆనతిచ్చెను. వారు నా రెక్కలు వెనుకకు విరిచికట్టి ఆ తాడు గైకొని నన్నావలకు గొనిపోయిరి.

# 35

పుట్టినది మొదలు ప్రశాంతమై సౌఖ్యప్రదమై గడచిన జీవితమునకు ఒక్కపెట్టున కడగండ్లు ముంచుకొని వచ్చెనేని, అఖండ సుఖస్వప్నముల తేలియాడు ఆత్మకు శాంతిభంగము వాటిల్లును. అట్లు చుట్టుముట్టిన కష్టములు సుఖస్వప్నము నుండి మేల్కొనినట్లు గాక పీడకలవలె ఆవరించును. అవిరత సుఖభాజనులైన వారికి దైన్యము కలిగినపుడు ముందుగా మూర్ఛపుట్టును. తలవని తలంపుగా వచ్చిన దుఃఖములు పక్షవాతమువలె మనుజుని చచ్చువడజేయును. అప్పుడు దృశ్యమానమగు ప్రపంచమెల్ల మిథ్యయై కలలోవలె జరుగుచుండును. పూర్వానుభూతములగు సుఖస్మృతులెల్ల కనుల యెదుట మెరసియాడుచు వర్తమాన దురవస్థను బుద్ధి కవగతము కానీయవు. అవి మాయమై పోవువరకు ఆ కల లట్లేయుండి సర్వము అసంబద్ధమై మాయవలె కాన్పించును. పూర్వపరిచితము లెవ్వియు కానరాక, "మనలను గూడ వానివెంట నేల గొంపోవయ్యెనో" అని సందియము పుట్టి, "మన బ్రతుకే మనకు మిగులదాయె" అనిపించి, మన అస్తిత్వ విషయముననే సందే

హము జనించును. కొంతవడికైన ఈ ఆత్మవేదనము తుద ముట్టక ఇంకను కొనసాగునేని, మనస్సునకు గూడ కుదిరిక చెడి పిచ్చిగా పరిణమించును. బహుశః ఆ పిచ్చియే మంచి దేమో ? అపుడీ జీవితము దయ్యపు రూపు దాల్చిన పూర్వ దుఃఖములు మాత్రమే యగును.

## 36

నా యీ చిత్తవృత్తినెల్ల మీకేల వివరించుచుంటినో నే నెరుగను. దుర్బోధము, దుర్గ్రాహ్యమునగు నిదియెల్ల అనుభవైకవేద్యము. బైసో అంగరక్షకులు నన్ను మారిన్ రూజీ నీగ్రోల పర మొనర్చునప్పటికి నా స్థితి యిట్లుండెను. ఆ స్వప్నావస్థ నన్నింకను విడువలేదు. ఒక భూతము చేతిలో నుండి ఇంకొక భూతము చేతిలో పడినట్లుంటిని. వారు నన్నొక చెట్టునకు కట్టుచుండ నే నేమియు సద్దుచేయక కట్టునిచ్చితిని. పిదప ఉడకబెట్టిన ఉర్లగడ్డ లిన్ని నా కొసగ, ఎట్లో వానినెల్ల తింటిని. ఎట్లు తింటినో నే నెఱుగను. చింతాభరమున మానస మెంత క్రుంగియున్నను, దైవవిలాస మేమో, ఆహారము దానియంతట అదియే లోనికి పోవునుకదా !

ఇంతలో చీకట్లు బాగుగా వ్యాపింపగా, నీగ్రోలెల్ల తమతమ గుడిసెల కేగిరి. అయిదార్గురు మాత్రము నాకు కావలిగా నిలిచిరి. వారును పెద్దమంట చుట్టును జేరి చలి కాగుచు కొంతవడి కూరుచుండి నిద్రబోయిరి.

నాకు శరీరము విశ్రమించెను. మనోభావములు విచిత్ర

ప్రచారములతో పరిపరి విధముల నేగుచుండెను. మొన్న మొన్నటిదనుక మేరీ సాహచర్యమున సౌఖ్యప్రదములై కడచిన ఆ శుభదినములెల్ల అప్పుడు జ్ఞప్తికి వచ్చెను. అకటా! ఆ సుఖముల్లో కొనసాగు ననుకొంటినిగాని ఇంతలో నిట్లు ముంచుకొని వచ్చునని కలలోనైన తలపనైతిని గదా! స్మరణ మాత్ర సుఖావహములగు ఆ సుదినము లెక్కడ! ఇంత విచిత్రముగా నడచిన ఈ దుర్దినమెక్కడ! నిజముగా నే డిన్ని చిత్రములు జరిగినవా? నేను కలగనుచుంటినా! అనుకొంటిని. ఒక్కనాడే, మూడుసారులు మృత్యుముఖమునకు తప్పియు నింకను పూర్ణముగా గండము గడచి బ్రతుకనైతిని. పోనీ, నా కింకను మిగిలియున్న రేపటి మాట విచారింతునన్న, అదియు దుఃఖమయము, మరణప్రదము నయ్యెను. కాకపోయిన ఆ మరణము దూరమున లేదుగదా యన్న తృప్తి మాత్రము కాన్పించుచున్నది. అది యంతయు నాకేమో పీడకల గాంచుచున్నటులై 'ఇదియెల్ల ఇట్లు జరుగుట నిక్కమేనా!' అని మాటిమాటికి సందియ మందుచుంటిని. క్రూరాత్ముడగు ఈ బైసో చేతులలో నేను చిక్కుట నిక్కమేనా! నిజముగా నా మేరీ నాకింక లభింపదా! మరణ శిక్ష కర్హమై యీ చెట్టున బంధింపబడి, ఈ ఆర్గురు నీగ్రోల కావలిలో నున్న యీ ఖైదీ నేనే యగుదునా!

ఎంత ప్రయత్నించినను మేరీని గూర్చిన తలపులు నన్ను వీడవయ్యెను. ఆ ముగుద యెట్టి కష్టపు పాటునకు లోనయ్యెనో యని డెందము కొందలమంద, నా బంధనముల

నుండి యెట్లాయున విడివడి ఆమెను రక్షించుకొందునని కట్టు త్రాళ్ళు జవజవ లాడునట్లు పెనగులాడితిని. అది యంతయు పీడకలగా పరిణమించుచున్న ఆశ నన్నింకనూ విడువక, "పవిత్ర వివాహ వేళ నా చేపట్టిన మేరీకి దైవమిట్టి సంకటము లేల కూర్చును ? ఇదియెల్ల నా భ్రాంతియే !" అనుకొంటిని. ఇట్టి విచారములచే అన్యాయ త్రమైయున్న నా చిత్తమున మరల పీడకటు ప్రత్యక్షమై క్రోధము తలయెత్తెను. క్రమముగా కోపము హెచ్చు పెరిగి కణతలు బ్రద్దలగునో యనునట్లు కొట్టుకొన సాగెను. అక్కసుకొలంది వానిని తెగతిట్టితిని. "ఆవల, మేరీకి హృదయము మారవిడిచియు, ఈవల ఈ దుర్జాతునితో నెయ్యమెట్లు నెరపజాలితినో" అని నన్ను నేను నిందించు కొంటిని. "వాడా రేయి నదీ గర్భమున నట్లు దుమికి నా చేత బడక తప్పించుకొని పోయెనే" అని వగచితినేగాని, వాడట్లు దుముకుటకు కారణ మెద్దియో యనిమాత్రము విచారింప నైతిని. ఇంతకును వాడు చచ్చెను. నేను చావనుంటిని. పగ తీర్పనైతినే యను దుఃఖము మాత్రము నన్ను విడువదయ్యెను.

ఇట్టి తలంపులతో నా తిరుపు మరపు టవస్థలో నెంత కాల ముంటినో యెరుగను. నాకు సుపరిచితమగు "సరఫరా చేతు చాటుగా సరకు లేను" అని స్పానిషు పాట నెవ్వడో దవ్వుల సుస్పష్టమగు స్వరము పాడుచుండ మెలకువ వచ్చి, దడదడలాడు గుండియతో కనులు విప్పి చూచితిని. అంతయు నంధకార బంధురము. ఆ నీగ్రోలట్లే నిదురించు చుండిరి. వారు చలికాగు మంట లారిపోవుచుండెను. మరల నేమియు వినరాక

పోవుటచే కలగనుచుంటినేమో యనుకొంటిని. నిద్రాభరమున కనులు మరల మూతలు పడెను. కాని మరల ఆ పాటయే దరి దాపై కరుణ రసభరితమగు స్వరమున వినవచ్చెను. మరల కన్నులు తెరచి ఆలకించితిని.

ఇంక నెక్కడి భ్రాంతి!ముమ్మాటికీ అది పీరట్టు కంఠమే! సద్దు చప్పుడు లేని ఆ యంధకారమున ఆ ప్రాత పాటయే మరల కొంచెమాగి వినిపించెను. అంత నొక కుక్క నన్ను పల్కరించుచున్నదో యన తోకయాడించుచు చెంతకు వచ్చి, నా పాదముల చెంత నేలబడి దొరలుచు కుశలప్రశ్న సల్పుచుండెను. పరికించి చూతునుగదా! అది రాస్కు — తలయెత్తి చూచునప్పటికి సమున్నతాకారుడగు నీగ్రో యొకడు కట్టెదుట నిల్చియుండెను. అచటి చలిమంట వెలుతురులో ఆ పచ్చికపై బడిన వాని నీడ సుదీర్ఘమై కాన్పించుచుండెను. ఆతడు పీరట్టని వేరుగ చెప్పనక్కరలేదు.

ప్రతీకార వాంఛానలము మనస్సున భగ్గునరేగ అక్కజపడి చేష్టలుడిగి మూగనైతిని. నేను నిదురించుచుంటినా? లేదు—మరి, చచ్చిన పీరటు తిరిగి వచ్చుటెట్లు! నిజముగా నేను కలయే గాంచుచుండవలయును. కానిచో అది పీరట్ భూతమైన కావలయును. నే నంతట భయభ్రాంతులచే మోము ప్రక్కకు త్రిప్పికొంటిని.

నేను మారుమోమిడుట గాంచి, ఆతడు తన మొగము ప్రక్కకు తిప్పుకొని, కపోలము భుజమునకు ఆన్చి, అల్లన

నిట్లనియె "తమ్ముడా! ఈ పాట విన్నచో నన్ను శంకింప నని మాట ఇచ్చితివి కదా! నీ విచ్చిన వరము మరచితివా యేమి ?"

దానితో నా కోపములుమండి నోట మాటరాలేదు. కొంతసేపటికి ఎట్లో నోరు పెగల్చుకొని "రాక్షసుడా! ఎన్నాళ్ళకు దొరకితివిరా! నా మామను పొట్టనిడుకొన్న కసాయివి నీవు; నా మేరీని వలలో వైచికొనియు నన్నింకను 'తమ్ముడా!' యని పిలుచుటకు నోరెట్లాడెనురా దురాత్మా! నా చెంతకు రాకుము, జాగ్రత్త!" అనుచు చెట్టునకు కట్టువడి మొసల జాలకుంటి ననుమాట మరచి ఖడ్గముకొరకు కెడమవైపున చూచుకొంటిని.

నన్ను కనుపెట్టిచూ యున్న పీరట్‌జాలి పెంపున గద్గద స్వరముతో మరల నిట్లనియె: "అక్కరలేదు. నేను నీ దరికి రాను. నీ కన్న నే నెక్కుడు దురవస్థలో నున్నానుసుమీ! నీకు జాలిలేదు కాని, నీ యవస్థ నా కెంతయు జాలి గొల్పుచున్నది."

ఈ మాటలకు నేను చిడిముడిపడుట చూచి, నా భావము గ్రహించి, అతడు కలలో పలువరించుచున్న వానివలె ఇట్లనెను. "నిజమే, నీవు చాల నష్టపడితివి. కాని నే నంతకు మిక్కిలిగా నష్టపడితిని. నామాట నమ్ముము"

మా ఈ మాటలచే కావలి నీగ్రోలకు నిద్రాభంగ మయ్యెను. వారు ఆ క్రొత్తమానిసిని గాంచి అదిరిపాటున లేచి, ఆయుధ పాణులై నిలిచిరి. కాని అతలో కనుల

ఎదుటనున్న ఆ పురుషుని గుర్తించి, పొంగి పొరలు ఆనంద
మున తటాలున నేలకు సాగిలపడిరి.

వీరలుపట్ల భక్తిచే వారట్లు సాష్టాంగ మెరగుటగాని,
వానిపై కెరలుచు రాస్క చెరలాడుచుండుటగాని నాకు
కాన్పించుటలేదు. క్రోధాతిరేకమున ఒడలు తపించుచుండ,
ఆకట్లు త్రాళ్ళ చిక్కి బయటపడనేరకున్న నాకు పిచ్చి ఎత్తు
చుండెను. ఒక్కతూరియు నా యావేశము తుదకు, "అయ్యో
నేనెంత నిర్భాగ్యుడను" అను మాటలుగా వ్యక్తమై కన్నుల
క్రోధ బాష్పములు జారదొడగెను. "ఈ క్రూరుడు ఆత్మహత్య
యొనర్చుకొని, నాకు పగతీర్చుకొను భాగ్యము దక్క
నీయడాయెను అని తలంచుచుండియు, నీ వట్లు బ్రతికివచ్చి, నా
యెదుట నున్న కేరడ మాడుచుండ, వీని పట్టి యొక్క వ్రేటున
చీల్చజాలకుంటిని. అక్కటా! నన్ను కట్లనుండి విడిపించు
వారు లేరా" అని ప్రశ్నించితిని. ఈ మాటలువిని వీరట్లు తమ
పాదములకడ నంకెనట్లు వ్రాలియున్న నీగ్రోలతో "అన్నలారా!
వీని కట్లు విప్పు"డనెను.

## 37

సంభ్రమమున లేచి వారు నా బంధనము లెచటి వచటనే
కోసివైచిరి. స్వేచ్ఛగా లేచి నేను నిలచిన వాడను నిలచినట్లే
యుంటిని. అబ్బురపాటుతో నాకు మ్రాన్పాటు ఘటిల్లెను.

"ఇంతేకాదు" అనుచు వీడు నీగ్రోల చేతులలోని
బల్లెముగైకొని నాకొసగ "ఇదిగో! నీ కోర్కె తీర్చుకొన

వచ్చెను. ఇంతకుమునుపు నీవు మూడుసారులు ప్రోచిన ఈ
శరీరము ఇదే. దీనిని నీవేమి చేసుకొన్నను నేను అడ్డము
చెప్పను. చెప్పిన దైవము మెచ్చడు. ఊఁ పొడువుము.
చూచెదవేమి? ఇదే ఈ శరీరము. పొడిచి కోర్కె తీర్చు
కొనుము." అని వాడు పలుకునపుడు వాని మోమున ఖేద
మును, మరణ సన్నద్ధతయు దక్క, కోపతాపము లించుకై
నను పొడగట్టుటలేదు.

ఎవడు నా కంటబడిన చాలునని తహతహలాడు
చుంటినో, అట్టివాడే తనకుతానై 'చంపుకొమ్మ'ని ఒడలప్ప
గింప నాకు చేతులు రావయ్యెను. పీరటుపై నాకెంత పగ
యున్నను, మేరీపై ఎంత ప్రేమయున్నను, నీచమగు హత్యా
సల్పుట మాత్రము నా వల్లకాదు. అదియునుగాక స్థూలదృష్టికి
దోషిగా కాన్పించుచున్నను, వీడు నిక్కముగా పాపియు
ద్రోహియు నగునేని, ఇంత ధైర్యముగా నా యెదుట నిలువ
గలడా యని నా యంతరాత్మ బోధింపదొడగెను. ఇవియెల్ల
నటులుండ, ఇంక దాపనేల? ఆ యలౌకిక మూర్తియందుగల
మాహాత్మ్య మెద్దియోగాని అది నన్ను ముగ్ధునొనర్చెను. వాడు
నా చేతికిచ్చిన బల్లెము నావల పారవైచి, "నీచుడా! నిన్నిట్లు
చంపుటకు నేనేమి హంతకుడనుగాను. రమ్ము! కత్తిదూసి కలియ
బడుము" అని యంటిని.

పీరటు : (అక్కజపడుచు) కత్తిదూయుటయా! ఎవ
రిపై !

నేను : నాపై.

పీరటు : (ఉలికిపడి వెనుకకు తగ్గి) నీపైననా? నీవు మరియేమి చేయుచున్నను చేయగలను కాని ఇదిమాత్రము నావల్ల గాదు. అట పండుకొనిన రాస్కను జూచితివా? దానిని నే నిట్టే చంపగలను. అదియును మెదలకుండా నన్ను చంపనిచ్చును. అంతేకాని నాపై కురుకుచున్నట్లనర్ప నాశక్యముగునా? ఇంతకును అసలు నాపైకి ఉరుకుటయననేమో దానికి అర్థముగునా? అట్లే నీపైకి ఉరుకుటయననేమో నా కర్థముకాదు. నేను నీపట్ల రాస్కను. (ఇంచుకయాగి) ఒకప్పుడు నా కనులలో నీవు కాంచిన క్రోధజ్వాల నేడు నీ కనులలో నేను కాంచుచున్నాను. నిజమే! నీకు చాల కష్టములు వచ్చినవి. నీమామ హతుడగుటయు, మీ తోటలన్నియు బూడిదయగుటయు, మీవారెల్ల నశించుటయు నిజమే. మీ యింటినిగాల్చి మీ సంపదనెల్ల కొల్లగొనిరి; నిజమే. ఈపని యంతయు మావారిదిగాని, నాది కాదు. మరియు వినివినుము. నే నొక్కనాడు నీతో అంటిని _ "మీవారు నన్ను చాల దుఃఖముపాలుచేసి"రని; అపుడు నీవేమంటివి? "ఒకరు చేసినదానికి నన్ను నిందింప వల"దంటివి. దానిపై నేనేమంటినో జ్ఞప్తియున్నదా?

ఈమాటలకు బదులుగా నేను తన్ను కౌగిటకు చేర్చుకొందునని, విప్పారిన మోముతో నా దెసను చూచుచుండెను.

నేను : (చురచుర చూచుచు) మీవారి దోషమునకు నీవు బాధ్యుడవుకావు. సరి. నీవు చేసినదాని కేమందువు?

పీరటు : ఏమి చేసితిని నేను?

నేను : (వానిమీదికి దూకి) మేరీఏది? ఏమి చేసితివిరా, నామేరీని ?

పీరటు : (మోమునవిషాదచ్ఛాయ అలముకొన కళవళ పడుచు) మేరీయా? అవును, నిజమే! కాని ఇచట మన సంభాషణ ఇతరులు విందురు.

వాని కళవళపాటును, 'అవును నిజమే' అను మాటలును, నా హృదయమున మరల అనుమాన పిశాచమును పుట్టించెను. వాడట్లే నిర్వికారుడై నన్ను చూచుచు దగ్గుత్తికతో నిట్లనియె.

"నన్ను అనుమానింపకుము; నిన్ను వేడుకొందును. నీ కంతయు జెప్పుదును. నిన్ను నేను ప్రేమించుచున్నట్లు, నీవును నన్ను నమ్మి నాపై చెలికారము నెరపుము." ఈ మాటలచే నా మది కరిగెనేమోయని నావంక జూచుచు, "నన్ను మరల నెప్పటియట్లు 'తమ్ముడా' యని పిలువనిచ్చెదవా ?" అనెను.

అనుమానగ్రస్తుడనై యున్న నాకు వాని చెలికారము గాఢవంచనమువలె తోచి, కోపము మరియు పెచ్చుపెరుగ "ఛీ! కృతఘ్నతా పిశాచమా! నన్ను 'తమ్ముడా' యని పిలిచిన కాలమును స్మరించుటకెట్లు సాహసించితివిరా" యని ఉదిరిపడితిని.

పీరటు : (కనుగొలకుల నొక బాష్పబిందువు తొలకుచుండ) "నేనుగాను కృతఘ్నుడను."

నేను : అట్లయినచో మేరీని ఏమి చేసితివో చెప్పుము?

పీరట్ : ఇచటగాదు. ఇతరులెల్ల నిచట విందురు. నీకు నచ్చచెప్పుటకు వ్యవధిలేదు. ముందు నిన్నిచటనుండి తొలగింపవలెను. అక్కటా! అంతయును తీరెగదా! నా యందంత నమ్మకము లేనివాడవు నన్నా భల్లమున తుద ముట్టించిన మేలయ్యెడిది గదా! కానిమ్ము, ఇంచుక యోపిక పట్టుము. ఆవల నీ పగ యట్లే తీర్చుకొందువుగాని, ముందు నిన్ను విడిపింతును. బయసో కడ కేగుదము రమ్ము.

వాని ఈ మాటలు చేతలు నా కర్థముగాకపోయినను అందేదో రహస్యమున్నది. వానియెడల నా కెంతటి యనుమానమున్నను, అదియేమో, వాడు మాటలాడుచున్నపుడెల్ల నా హృదయము కరగును. వానియందు గుప్తమైయున్న శక్తి యేమోకాని, నేను వానికి వశుడనై పోవుచుందును. ఒకవంక ప్రతీకారవాంఛ, ఒకవంక జాలి, ఆవల యనుమానము, ఈవల గ్రుడ్డినమ్మకము, వీనిమధ్య డెంద ముయ్యాలలూగుచుండ, వాని వెంటనంటి యేగితిని.

## 38

వహారన్ రూజీ సైనిక కుటీరములు గడిచి మేము స్కంధావార మధ్యమున ప్రవేశించి చనుచుంటిమి. నిన్న నన్ను పీకుకొని తినుటకు సిద్ధమైన ఆ యనాగరక జనులెల్ల నేడు వారలమధ్య మే మేగుచుండ, మమ్ము అడ్డగింపరు సరి కదా, నీగ్రోలు, సంకరులు అందరును మాకు నెడగలుగ తొలగి, దారి నొసగుచు భక్తి సంభ్రమములు పెనగొన,

సాగిలపడి మ్రొక్కఁ జొచ్చిరి. వీరి భయభక్తుల కింతగా పాత్రుడగు ఈ వీరటు ఈ సైన్యమున ఏ తరమువాఁడో గదా ! యని యక్కజమందియు, మున్నితఁడు బానిసలకెల్ల సమ్మాన్యుడగుట ఎరిగిన వాఁడనుగాన, నేఁడును అట్లే ఉపచరించుచుండిరని సమాధాన పడితిని.

మేమట్లు దరిద్వారమును చేర నేఁగుచుండ, ద్వారిక నాయకుఁడగు 'కాండీ' మమ్ము దవ్వులఁగాంచి "యెవఁడురా ? సేనాని శిబిరమును సమీపించుచున్నా"డని మాపై కసరుచు, దరిదాపై వచ్చిన మమ్ముఁగాంచి, వీరటును గుర్తించి తటాలున చేతులుమోడ్చి, తన యత్యాచారమునకు నొచ్చుకొనుచు, సగౌరవముగా ముందునడువ, అనాదర మందస్మితుడగు వీరటును నేనును గుహా ముఖముం జొచ్చి, బైసో సమ్ముఖమున కేగితిమి.

ఒకప్పుడు మా మేనమామకు దాసుఁడైన ఈ వీరటును గాంచి సైనిక సాధారణులెల్ల నేల వ్రాలి మ్రొక్కినప్పటికన్న ప్రధానోద్యోగియగు 'కాండీ' చేతులు జోడించినపుడు నాకు అమితాశ్చర్యము పొడమి "ఇంతటి ప్రభావసంపన్నుఁడు వీఁడెవఁడు కానోపునా?"యని వెరగుపడ జొచ్చితిని. దీనికంతకు మెరుగు పెట్టినట్లు బైసోకూడ వానిని గాంచగనే పొడముచున్న ఆశాభంగాశ్చర్యములు మాటుఁగొనుచు తటాలునలేచి నిలిచి, సమ్మానపూర్వకముగా నెదురువచ్చి వినయవినమితుఁడై తన పీఠము నలంకరింపుమని వేఁడినపుడు నా ఆశ్చర్యమేమి చెప్పను.

పీరటు వాని యాసనమును స్వీకరింపకయే, "వలదు బైసో! వలదు. నేను నీ యాసన మాక్రమించుటకు రాలేదు. నిన్నొకటి యాచింప వచ్చితిని" అనెను.

బైసో మరియు వంగిమ్రొక్కుచు "మహాప్రభూ ! అట్లు సెలవీయవలదు.. మీ కొసగుట కీ బైసో ఎవడు ? వీడు మీ వాడు కాడా ! వీని యర్థప్రాణములు భవదధీనములు. చిత్తము వచ్చిన ట్లుపయోగింపుడు."

పీరటు : అంతవర కక్కర లేదు. నే కోరునదియెల్ల ఈ బంధితుని విమోచనము." అని నన్ను చూపెను.

బైసో ఒకక్షణము ఇతికర్తవ్యతామూఢుడై నిలిచి, వెంటనే స్థిరచిత్తుడై "ఏలినవారు ఈ సేవకుని శిక్షింపుమించిన కోరికకోరి సంకటముగూర్చిరి. చిత్తగింపుడు. ఈ జీన్ బైసో వీనిని బంధింపనులేదు; ఈవాడు బైసో పాత్రునుగాడు. వీనికి బైసోతో ఎట్టిసంబంధమును లేదు" అనెను.

పీరటు : (స్వరమున పారుష్యముతోప) అదియెట్లు ? నీ పాత్రుకానిచో ఆతడు మరి ఎవరిపాత్రు ? ఇచట వేరధికారు లెవరున్నారు ?

బైసో : ఉన్నారు, ప్రభూ ! ఉన్నారు.

పీరటు: ఎవరు వారు ?

బైసో : నా సైన్యము

పీరటు కచ్చితముగ అడుగుదాని కంగీకరింపక, వంక వంక దండములు పెట్టుచు ఏలి మాటల బైసో తప్పించు కొనుటచూచి, వాడు విధిలేక పీరటునకు వంగియుండెనుగాని,

లేనిచో నిర్లక్ష్యము చేయువాడే యని నాకు తోచుచుండెను.

పీరటు: (బిగ్గరగా) నీ సైన్యమా! దాని కధిపతివి నీవు కావో!

బైసో: (మనసు దాచనివాని వోలె) ప్రభూ! చెప్పిన మాట వినకూడదను నిశ్చయముచే తిరుగబడుచున్న వారినెవరు శాసింపగలరు? ఏలినవారికి విశదముకాని విషయమేమున్నది?

బైసో నిరంకుశ చర్యలును, సైనికులు వానినిగాంచి గజగజ లాడుటయు, నిన్న కన్నులార చూచియుంటినిగాన, వాని యీ మాట లసత్యములని ఆ మోసమును బైటపెట్టి యుందునుగాని, ప్రాణభరణ కుతూహలము లేని నా కట్టి యవసరము కాన్పింపక, ఉపేక్షించి యూరకుంటిని. అంతట పీరటు "మంచిది. సైనికులు నీ మాటవినక, వారే నీకు యజమానులైనచో నీ ఖైసైపై వారలకు మరి యాగ్రహమేటికి?" అని యడిగెను.

బైసో తన కుటిల హాసమును, తెచ్చికోలు దుఃఖమున మాటుకొనుచు వానికిట్లు బదులుపలికెను. "తెల్లవారు బక్మన్‌ను నిహతునిగావించినదానికి మారుసేతగా నా సైనికులీ తెల్లవానిని వధించుటకు నిశ్చయించిరి. బక్మన్ శిరము తెల్లవారికి విజయచిహ్నమైనచో వీనితల మనకు విజయచిహ్నము కాగలదనియు, రేపు రణదేవత యిరువాగుల పరాక్రమములు తూచునపుడు, బక్మన్ తలతో వీని తల సరితూగుననియు వాళ్ళ తలంపు."

పీరటు: అక్కటా! ఈ ఘోర ప్రతీకారవాంఛ ఇంకను

మిమ్ము విడువదయ్యెగదా! బైసో! నేనొక్కటి చెప్పెద నాలకింపుము. ఈ దారుణకృత్యములే మన సత్య సంకల్ప నాశనమునకు మూలకారణములు. నేనిపుడెట్లో చెరనుండి తప్పించుకొని వచ్చితిని, కాని యిందనుక తెల్లవారి బందినై యుండియు బక్మన్ మరణవార్త నేను విననైతిని. ఇప్పుడు నీవు చెప్ప వినుచుంటిని, దానికేమి? నీవుమాత్రము, బక్మన్ చేసిన ఘోరపాపములే యిట్లు ఫలించినవని నమ్ముము. ఇది యిటులుండె నీవు వింటివో? లేదో? ఆనాడు తెల్లవారిని మోసగించి తీసికొనివచ్చి మనబారి కగ్గముగావించిన నీగ్రో నాయకు నెరుగుదువుకదా!—'జీనట్టు'ను. వానికి నిట్టి శాస్తియే జరిగినది, తాళుము. నామాట కడ్డముగాకుము. జీనట్టుకూడ, క్రూరకర్మముల నిన్నును, బక్మన్‌ను మించ నెంచుట నీవెరు గనిదికాదు. కాని వానికీశాస్తి యెవరుచేసిరో నీ వెరుగక పోవచ్చును. నేను చెప్పెదను వినుము. జీనట్టును తుదముట్టిం చినది, ఈశ్వరుని కోపాగ్నియు, తెల్లవారి ఖడ్గధారయుకాదు; జీన్‌ఫ్రాంకోయే వానికీశాస్తి చేయించినాడని మాత్రము మఱువకుము.

ప్రసన్నతా దూరమగు శ్రద్ధతో బైసో, ఈ మాటలు విని, నిర్విణ్ణుడయ్యెను. అయ్యవసరమున రిగాడ్ లోపలికివచ్చి పీరట్‌నకు చేతులుమోడ్చి, బైసో చెవిలో నేమో చెప్పెను. వెలుపల నేదియో సద్దు వినవచ్చెను. పీరట్ మరల చెప్ప దొడగెను: "వింటివా, మరి? విపరీత భోగలాలసతయు, వృథా డంబరమును దక్క జీన్‌ఫ్రాంకోయెడ ఇతర దోషములు లేవు.

అనుదినమును ఆరు గుఱ్ఱములు పూన్చిన బండిలో చర్చికేగుట వానివేడుక. అట్టి జీన్ ఫ్రాంకో, జీన్స్టు దురాగతములను తుదముట్టించిన వాడయ్యెను. ప్రాణావసానసమయమున చెంతనున్న పురోహితుని కాళ్ళవ్రేళ్ళబడి యెంత వేడుకొన్నను తెరవాటుకాడగు పంద జీసట్‌నకు చావు తప్పదయ్యెను. మున్ను ఈ నికృష్టుడు తన చేతబడిన తెల్లవారినెల్ల ఇనుపనారసములగ్రుచ్చి, యేచెట్టున వ్రేలవైచి చంపెడివాడో ఆ చెట్టుక్రిందనే వానికిని మృత్యువు దాపురించి తుపాకులవాతబడెను. జైసో! దీనికి ఏమందువు? బాగుగా ఆలోచించుకొనుము. మిస్సారీ కఠోర హత్యలు గావించుట, తెల్లవారలు మరల దారుణ ప్రతిక్రియలు సల్పుట, ఇవియెల్ల ఎందులకు వచ్చినట్లు? ఇదియును గాక, దీనులగు ఈయన చెలికాండ్రందరును మునపలే క్రోధవివశులు గదా! వారి కింకను సివమెత్తించు నీ ఇంద్రజాలములెల్ల దేనికి? పవిత్రములగు భగవత్పూజా కైంకర్యాదులను దంభనీచతంత్రములచే కళంకితములు సల్పు మహాపాతక మేటికి? 'మేరీమాత' పేరుచెప్పి యీ నృశంసనము సలుపనేల? ఈ దోపిడులేల? ఈ కొల్లగొట్టుటలేల? ఇవి యన్నియు ఈశ్వర ప్రీతికరములా?"

పీరటు కంఠమున 'మేరీ' యను పదమును మధురభాష విలసితమై వెడలుట చూచి, కేవలము వేలుపు పేరైనచో అంత సముత్సుక స్వరమున పలికియుండడని నాకు కొరకొరగా నుండెను.

పీరటు మరల చెప్పుచునే యుండెను: "ఈ మాయలెల్ల

నల్పుటకు నీ సైన్యమునగూడ నొక మాంత్రికుడు కలడని వింటిని. నానావిధములగు నీ మూకలనెల్ల నొక్కత్రాటిపై నడిపించుట కేదియైన నొక మార్గముండవలసిన మాట నిజమే! నేను దానికి కాదనను. కాని ఈ బూటకపు తంత్రములు, ఇంద్రజాలములేనా ప్రయోగింపవలసినది! వీటికన్న వేరు సాధనములు లేవా ? మరియు బైసో! నేనొక్కటి చెప్పెదను. నా మాట నమ్ముము, తెల్లవారందరు మన యంత క్రూర కర్ములు కారుసుమీ! తమ బానిసల ప్రాణములు కాపాడు తెల్లవారి నెందరినో నే నెరుగుదును. కొందరు సామ్యాభ్యాది ప్రీతిచేతనే బానిసలనట్లు రక్షింతురనికూడ నాకు తెలియును. అగుగాక, ఆ స్వార్థపరతయే వారికి సుగుణము నాపాదించుచున్నదా, లేదా ? ఏమందువు ? కరుణాపరత్వమున మనము మాత్రము తెల్లవారి కేల తీసిపోవలయును ? పోనిమ్ము. ఈ క్రౌర్యమువలన మన కేమైన లాభించుచున్నదా ? అదియును లేదే! ఈ శిశు పశు వనితా మారణములు, ఈ భయంకర గృహదహనములు, మనము పూనిన సత్కార్యము నించుకైన పవిత్రీకరించుచున్నవా ? ధర్మయుక్తములుగా నల్పుచున్నవా ఆలోచింపుము."

"ఈ ఘోరకృత్యములు నానాటికి పరిపాటియైపోవు చున్నవి గదా! బైసో! యేమి మాటాడవు? మన పురోగమన మిట్లెప్పుడును రక్తపంకిలమై దహన జ్వాలా భీలమై జరుగ వలసినదేనా ?"

పీటర్, ఇట్లు పలికి యూరకొనెను. వాడిచూపుల

కెంజాయలు నిగుడ, అధికారధూర్వహమగు గంభీర స్వరమున, పరమ ప్రామాణికముగా, శ్రోతల మదికెక్కునట్లు, వాడు పల్కిన ఆ పల్కు లపుడు విని తీరవలసినవేకాని, నేనేమి చెప్పగలను ? సింహముచే జిక్కిన నక్కవలె, తన్మహాప్రభావముచే అరికట్టబడిన బైసో గిజగిజలాడుచు, తప్పించుకొను వెరవు లూహించుచుండెను.

బైసో ఇట్లు తెన్నుగానక, గిజగిజ పడుచుండ, నిన్న తన కెదుట జరిగిన ఘోరముల నన్నిటిని కనుల పండువుగా గాంచిన రిగాడ్, పీరట్ చిత్రించిన యీ బీభత్స కర్మల కేవ పడువానివలె తెచ్చికోలు విచారము నభినయింపుచు, "దైవమా! నివమెక్కిన వారికన్న రక్కసులు మేలుకదా" అని ఖేదము వెడలబోసెను.

# 39

ఆవల స్కంధావారమున కలకల మంతకంతకు నధికమై బైసోను మరింత కలవరపెట్టుచుండెను. నాకు బంధవిమోచన ప్రదాతయగు తమ నాయకుని రాకను మారన్ రూజ్ నీగ్రోలు సైనికులకెల్ల చాటుచు "ఆయన బైసో శిబిరమున కేతెంచిన పని యేదైనను సరే, మా ప్రాణములొడ్డి నెరవేర్తుమని ప్రతిజ్ఞలు సల్పుచుండిరట. ఇదియెల్ల నాకు పిమ్మట తెలియ వచ్చెను. ఇందాక బైసో చెవిలో రిగాడ్ చెప్పినదీ వార్తయే. కావుననే పీరట్ కోరిక తీర్పనిచో సైన్యమున చీలికలేర్పడి ఆత్మ వినాశనకారణము లగునేమోయని బైసో భీతిల్లెను.

వృథగా నిందింపబడిన నిర్దోషివలె అభినయించుచు బైసో పీరట్‌తో "ఎల్లవారియొక మేము కఠినులమైనందులకు మాపై ఏలినవారు కాఠిన్యము దాల్చి ఎంతుకు వంతు దీర్చిరి. ప్రభూ! మేమెల్ల ఈ ప్రవాహమునబడి కొట్టుకొని పోవుచుండ మమ్ము నిందించి ప్రయోజనమేమి? దీనికి మేము కర్తలమా? దీని నెవరాపగలరు? ఇంతకును ప్రస్తుతము దేవరవారు నన్ను అనుగ్రహింపవచ్చిన కారణము తెలుపకైతిరి." అని విన్నవించెను.

పీరట్, "ఇంతకుమున్నే చెప్పితినిగదా! బైసో! ఈ బందీని నావెంట గొనిపోనిమ్ము" అని యడిగెను.

బైసో కొంతతడవు గాఢ విచారమగ్నుడువోలె ఊర కుండి, పిమ్మట మొగమున కెక్కుడలేని నిష్కాపట్యమును తెచ్చుకొని "చిత్తము, ఏలినవారికి అనుగ్రహ పాత్రుడనగుట కన్న నాకేమి కావలయును? సెలవొసంగెదరేని, ఈ బంధితు నితో రెండుమాటలు మాటాడి తీసుకొని వచ్చెదను. పిమ్మట మీ చిత్తానుసారము వెంటగొని పోవచ్చును" అనెను.

ఇంతదనుక బైసో ఏమనునో అని అటునిటు చంచల దృష్టిని బరపుచున్న పీరట్ సంతుష్టుడై 'కానిమ్ము' అని కొంచెమావలి కేగెను.

బయసో నన్ను కొంచె మావలకు గొనిపోయి "నిన్న నేను చెప్పినమాట కేమందువు? దాని కొడంబడనిచో నిన్ను విడువను. ఏమి? ఆ పని ఇప్పుడైన నెరవేర్చెదవా?" అని జీన్‌ఫ్రాంకో పంపిన కాగితమును తీసి చూపెను.

వాని కోరిక కంగీకరించుటకు నా కిష్టములేక "నేను వ్రాయను" అని ఖండితముగా బల్కితిని.

వాడు వెకిలినవ్వు నవ్వుచు "ఓహో! నీవు బిగువు సడలినట్లులేదే! నిన్నితడు రక్షించునని నమ్మకము కాబోలు! ఎరుగుదువా నీ వీతనిని?" అని యడుగ, నేను వెంటనే, "ఎరుగ కేమి? నీవంటి రాక్షసుడే వాడును. వంచనమున వాడు నీ కన్న మిన్న" యంటిని.

ఈ పలుకులు వాని కాశ్చర్యమును గొల్పెను. ఒకవేళ నేను పరిహాస మాడుచుంటినేమోయని నా చూపుల నారయుచు, "ఏమి! ఈతని నీ వెరుగనట్లున్నావే?" అనెను.

నేను: (అలక్ష్యముగా) వానిని నా మామ బానిసగా నెరుగుదును, వానిపేరు పీరట్.

బైసో: (నవ్వుచునే) ఓహో! ఇది చిత్రముగా నున్నదే ఆతడు నీ బంధమోక్షము వేడుటయు, నీ వాతనిని నా వంటి రాక్షసుడే యనుటయునా? బాగుబాగు.

నేను: అయిన నేమాయె? నా కించుక స్వేచ్ఛలభించునేని, అది వాని ప్రాణములు పొరిగొనుటకే యగును గాని, నా ప్రాణములు రక్షించుకొనుటకుగాదు.

బైసో: ఏమంటివి? నీ వసత్యమాడుచున్నట్లు గూడ లేదే! నీ ప్రాణములు నీకింత చులుకనయని నమ్మజాలను. ఇందలి రహస్యమేమో నా కర్థమగుటలేదు. నీ వింతగా ద్వేషించు నాతడు నీ ప్రాణదానమును వేడుటయా? నిన్నె ట్లయిన రక్షించుట కాతడు దీక్ష వహింప, వాని నెట్లయిన

భక్షించుటకు నీవు ఉవ్విళ్ళూరు చుంటివా? వింతగనే యున్నది. కానిమ్ము, నాకా జోలియేల? నీవు కోరునదియెల్ల నించుక స్వేచ్ఛ; కానిమ్ము, నేనొసగునదియు నంతియే. నీవు వానివెంట నేగుట కనుమతించితిని, కాని, ఇంకను రెండు గంటల ప్రొద్దున్నదనగనే, నీవు తిరిగివచ్చి,మరల నాకు బందీ కావలయును. అట్లు ప్రమాణముచేసి పొమ్ము, నీవు క్రొంచి వాడవు, మాటతప్పవని నాకు నమ్మకమే.

అయ్యా! నా కపుడు కర్తవ్యమేమో మీరే యోజింపుడు, ప్రాణములా? నాకు భారముగా నుండెను. సర్వథా నాకు ద్వేషియగు పీరట్ దయవలన ప్రాణములు కాపాడు కొందునా? అంతకన్న నైచ్యము, నిరభిమానతయు వేరొకటి లేదు. ఇంకనిటు బైసోను చూతునా?వాడు చేజిక్కిన యెరను మైమై బోనిచ్చువాడు కాడు. వాడి పద్ధతి కంగీకరింపనిచో నన్ను విడుచుటకల్ల. ఇంచుక స్వేచ్ఛ లభించినచో నా జీవితేశ్వరి గతి యేమయ్యెనో తెలిసికొనుటకన్న వేరొండు కోరికయును నాకు లేదయ్యెను. నాకా భాగ్యము లభింపవలెనన్న బైసో కోర్కెవెంట ప్రమాణముసేయుటకన్న వేరొకమార్గము కానరాదయ్యెను. మరి ఏమి చేయుకును? నిస్సంశయముగా వానికి బాసయిచ్చితిని.

బైసో అంతట కపట వినయ ముట్టిపడ పీరట్ చెంతకేతెంచి "ప్రభూ! బంధితు నిదే మీ పర మొనర్చుచున్నాను, కొనిపొండు. ఆతడు మీ యిచ్చవచ్చిన యెడకెల్ల నరుగుట కెట్టి అభ్యంతరమును లేదు." అని విన్నవించెను.

పీరట్ బైసోకు తన పాణితలము సందించి, "బైసో ! పరమసంతోషము! నీవు నా కొనర్చిన యీ మేలు మరువజాలను. నన్నింక నీవానినిగా దలంపుము. నేను తిరిగి వచ్చుదనుక మారన్ గూజీ సోదరులనుగూడ నీవే పాలించుచుండుము." అని నా వంకకు తిరిగెను. వాని మొగమున మున్నెన్నడు నే నంతటి ఆనంద పారవశ్యమును గాంచియుండ లేదు. అత్యంతాదరమున నా హస్తము గ్రహించి "నీ వింక స్వతంత్రుడ వైతివి, ఏగుదము రమ్ము" అని తన వెంట లాగికొని పోయెను.

బైసో నిర్విణ్ణుడయ్యును ఎట్లో నా సహచరునికడ సెలవు గైకొని ప్రతిమవలె మా దెస వీక్షించుచు నిలిచెను.

# 40

పీరట్తోడి ఏకాంతమునకు నేను తహతహ పడుచుంటిని. ఆనాడు నాకు నామమాత్ర భార్యయైన మేరీని గాలిఫెట్ దుర్గము నలమిన అగ్నిజ్వాలలనుండి వాడు నా యెట్టెదుట హరించుకొని పోవుచుండ కనులార కాంచినప్పటికన్న నేను 'నా మేరీ నేమి చేసితి'వని ప్రశ్నించినపుడు వాడు కళవళపాటును, మేరీ నామ ముచ్చరించినపుడు అనివార్యమైన వాని యౌత్సుక్యమును చూచి నా హృదయమున అసూయాక్రోధములు ఇనుమడిగా రగుల్కొని మండజొచ్చెను. వాడు కరుణా పరతంత్రుడై బైసో ఘాతుక కృత్యములను నిరసించెగాక, నన్ను రక్షించుటకు పలుపాట్లు పడుగాక

వాని మాటలు, చేతలు అపూర్వము లగుకాక, అంత మాత్ర మున నాకేమి ? నా కనుల యెదుట మరణించియు తిరిగి సజీవుడై నిలిచిన వాని ప్రభావముతో మాత్రము నాకేమి పని? నదీ గర్భమున మునిగి కడతేరెనని నేను నమ్ముట పొరపాటనియు, నా బలముచే బంధితుడయ్యెననియు తెల్ల మయ్యెను. దాసుడు ప్రభువయ్యెను ! బంధితుడు మోక్ష ప్రదాతమయ్యెను ! ! నిజమే ఇదియంతయు నెంత మాయగా నున్నను, నా మేకీని వీడు హరించుటమాత్రము ప్రత్యక్షమే కదా! నా కంతే కావలసినది, ఈ ద్రోహమును నేను శిక్షింప వలయును. ఈ యత్యాచారమునకు నేను ప్రతీకారము సల్ప వలయును. ఇంతవరకు స్పష్టము. నా కనులయెదుట నడచిన వాని ప్రవర్తనము లెంత విచిత్రములైన నగుగాక, అంత మాత్రమున నా నిశ్చయము చలింపదు. ఈ రహస్యములెల్ల వానినోట క్రక్కించు తరుణ మెప్పుడు వచ్చునా యని నేను తహతహ లాడుచుండ, ఎట్టకేల కాశుభ ముహూర్తము వచ్చినది.

మేమట్లు తిరిగి యేగునపుడు, మరల ఆ స్త్రీగోమూక లెల్ల వానికి సాగిలబడెను. “ఏమి యీ వింత, చెరనుండి బైటబడెనే!” అని అబ్బుర పడజొచ్చెను. వారి యక్కజము నకు కారణము నేనో? వీరటో? నాకు తెలియదు. నే నా విషయము విచారింపను లేదు. మేము కొంతసేపటికి శిబిర ములు గడచి వచ్చితిమి. చెట్లులు గుట్టలు చాటై, స్కంధావార మించుకయు మాకు గాన్పించుట లేదు. రాస్కు పరమానంద

మున గంతు లిడుచు మున్ముందు పరుగిడు చుండెను. దాని వెనుక పెద్ద పెద్ద యంగలు వైచుకొనుచు పీరట్ బిర బిర చనుచుండెను. నేను వానిని నిలిపి యిట్లంటిని. "ఇటు చూడుము, మనమింక ముందున కేగవలసిన యవసరములేదు. ఇచట నీ మాట లెవ్వరైన వినిపోదురను భయము లేదు. మేరీ నేమి చేసితివో చెప్పుము?"

హృదయమున పిక్కటిల్లుచున్న భావభరమున డగ్గుత్తిక పడు ఎలుగుతో నిల్లదుసుచున్న నన్ను, వాడు, నెనరుజెందు చూపులతో చూచుచు, ఇప్పటికిని అదియే ప్రశ్నయా?" అనెను.

నేను : (కోపమాపుకొనలేక) అవును. ఇప్పటికిని, ఇంక ఏనాటికిని ఇదియే! యంత్య నిశ్వాస మప్పుడును, నా తుది యుచ్ఛ్వాస మప్పుడును ఇదియే ప్రశ్న- చెప్పుము ఏమైనది మేరీ ?

పీరట్ : నిన్ని సందేహము విడువదా ? నన్నింక ఎప్పటికిని విశ్వసింపవా? కానిమ్ము. అచిరకాలమున నంతయు నీకే తెలియును.

నేను : అచిరకాలముననా? దోసకారీ ! 'అచిరకాల' మనగా నింకెప్పుడు? అట్లు నలనుపడదు. ఇప్పుడే, ఈ క్షణ ముననే సర్వమును తెలుపవలయును. మేరీ యెచ్చట నున్నది? చెప్పవేమి ? నా మేరీ ఏమైనదిరా ? దురాత్మా ! చెప్పనిచో నా ప్రాణములకు నీ ప్రాణము లొడ్డికాచుకొమ్ము.

పీరట్ : (సవిచారముగా) నీ కింతకుముందే చెప్పితిని, అది అసంభావ్యమని; కన్న తల్లిపై బిడ్డయెన్నడును చేయిచేసి కొనదు. నీవు మువ్మారు కాపాడిన యీ దేహము నీపై కలియబడదు. ఒకవేళ నాకా యిచ్ఛయున్నను అది పొసగదు. ఇరువురము ఒక్క కత్తితో ఎట్లు పోరనగును? (మొలనున్న ఖడ్గము విప్పి) ఇదిగో! దీనిని గైకొనుము.

క్రోధవివశుడనగు నేనా ఖడ్గమును గైకొని దాని మొన వాని వక్షమున మోపితిని. వాడించుకయును చలింప డయ్యెను.

నేను : కష్టుడా! నాచే హత్య చేయించెదవా యేమి? నా మేరీ యెచ్చట నున్నదో చెప్పుము. లేనిచో నీహృదయ మును ఈ ఖడ్గమున చీల్చెదను.

పీరట్ : (ప్రశాంతముగ) నీవు ప్రభువవు. నన్ను నీ యిచ్ఛవచ్చినట్లొనర్పవచ్చును. కాని నిన్నొకటి దోసిలియొగ్గి వేడుచుంటిని. నాకొక్క గంట గడువొసగి నా వెంటరమ్ము. నా కీ వర మిమ్ము. నీవు మూడుసారులు ప్రోచిన వానిని, మున్నొకప్పుడు నీవు 'అన్నా' యని పిలచిన వానిని, నమ్మ జాలవా? ఒక్క గంట యోర్చుకొనుము. నీకు అప్పటికినీ నాపై విశ్వాసము కలుగనిచో, నీ యిచ్ఛచొప్పున నన్నే చంపు దువు గాని, యింతలో మించిపోవునది లేదు. మేరీని—నీ భార్యను తలచుకొనియైన — (సంతాపకరమగు స్మృతిచే బాధనొందు వానివలె కొంచెమాగి, అల్లనల్లన) ఒక్క గంట

సైరింపుము, ఇదె నిన్ను ప్రార్థింతును. నాకొరకు గాదు, నీ కొరకే సహింపుము.

వాడంత కరుణముగా బ్రతిమాలుచుండ నాకేలనో వాని కోర్కె నంగీకరింప వలయునని బుద్ధి జనించెను. అది యేమి వింతయో కాని వాని మాట జవదాట జాలకపోతిని. నేనట్లంగీకరించుటకు వాని పైగల చెల్లుబడియే కారణమని అప్పుడెరిగి యున్నచో నెంత సిగ్గుచేటు!

అల్లనల్లన "మంచిది; అట్లే కానిమ్ము. గంట గడువొసగితిని. దారితీయుము, వచ్చెదను" అని వాని ఖడ్గమును వాని కీయబోవ. వాడు "వలదు, నీచేతనే యుండనిమ్ము, నీ కింకను సందియము తీరలేదు. రిమ్ము, ఇంక కాల హరణమేల?" అని బయలు దేరెను.

# 41

వేమము మాటాడుచున్నంతసేపును, ముందునకు సాగి పోవలయునని మాటి మాటికి సంభ్రమించుచున్న రాస్కు, మేము బయలు దేరుట చూచి సంతోషముతో నురకజొచ్చెను. అరగంటసేపు మే మొక కన్నెయడవినిబడి నడచి, పిమ్మట ఒక పచ్చిక బయలు చేరితిమి. దానికొక వంక విషమ శిలా తలమ్ముల దుముకుచు నర్తనము సల్పుచున్న జలపాతమును, తక్కిన దెసలయందు పురాతనారణ్య వృక్షసంతతులును చెలువొసగుచుండెను. అచట నొక పర్వతమధ్యమున తీవల చేతను చిన్న మొక్కల చేతను కప్పబడిన గుహ యొకటి గలదు.

దాని వెనుక రాస్కు మొరగుచు పరువులిడు చుండగా, వల దని సంజ్ఞ చేసి, పీరట్, నా కరమును గైకొని మెదలకుండ ఆ గుహాద్వారము చెంతకు గొనిపోయెను.

అందు చాపపై నొక యువతి అవ్వలి మొగమై కూరుచుండెను. మా యడుగుల సవ్వడి విని ఆమె వెనుకకు దిరిగెను. మిత్రులారా ! ఏమి చెప్పుదును!. ఆ యువతి మేరీయే! ! మా పెండ్లినాడు ధరించిన ఆ తెల్లదుస్తులతో, శిరమున గైసేసి కొన్న ఆ నారింజ పూలదండతో, నాకు కనుల పండువై యెదుట సాక్షాత్కరించినది. నన్ను వెంటనే పోల్చుకొని పట్టరాని యానందమున ఆమె నా చేతులలో వచ్చి వ్రాల ఆనందౌత్సుక్యములచే నాకు నోటమాట రాదయ్యెను. ఈ సందడివిని లోపలినుండి ఒక వృద్ధాంగన పసిబిడ్డ నెత్తుకొని వెలుపలి కేతెంచెను. ఆమె నా మేరీ దాది, ఆ శిశువు నా మామ కడగొట్టు బిడ్డ.

మేరీ ఆనంద పారవశ్యమున మూర్ఛమునుగుట గాంచి పీరట్ వడివడిగా నేగి దాపునగల చెలమనుండి జలము గొని తెచ్చి, ఆమె మోమున చిలకరించెను. వెంటనే తెలివి తెచ్చుకొని మేరీకనులు విప్పి, "లియోపాలా! లియోపాలా!" అనెను. నేనును "మేరీ" యంటిని. కాని నా మాట తియ్యతియ్యని ముద్దులలో సద్దుమణగి పోయెను. అంతట "నా యెదుటవద్దు. మీకు పుణ్యముండును" అని సంతాపవ్యగ్రమగు ఒక ధ్వని వీతెంచెను. మేము వెనుదిరిగి చూడ పీరట్ కాన్పించెను, మా ముద్దులాట వానికి దుర్భర సంతాప కారియై వేడి నిట్టూ

ర్పులు విడచుచు, మోమున చెమటలు గ్రమ్మ, ఒడలెల్ల వడకుచుండ, మోమునకు పాణితలము లక్ష్యము చేసికొని వేదనా సూచకమగు కంఠమున "నా యెదుట కాదు, నా యెదుట కాదు" అనుచు పీరట్ గుహావీడి పర్వెత్తెను.

నాకౌగిట నున్న మేరీ, వెలుపలి కేగుచున్న పీరటు నించుక మొగమెత్తి కనుగొని "లియోపాలా! పాపము! వానికి మన సౌఖ్యము సంతాపకారియై న్నట్లున్నది. నన్నితడు వలచి యుండడుగదా!" అనెను.

పీరటు సంతాపము గాంచి, వాడు నాకు శత్రుడను కొనుచుండ మేరీ పలుకులు నాకు వాడు ప్రాణమిత్రుడని తెల్ల మొనర్చెను.

అపారానందమును, గాఢ విషాదమును బెనగొన "మేరీ! నీ వెరుగవా?" అని యడిగితిని.

మేరీ ముద్దు మోమునకు లజ్జ ఒక వింత సొంపు సంపాదింప "ఈ క్షణమువరకు నే నెరుగనుసుమా! నిజముగా నీతడు నాకు మేల్పడినచో ఇన్నినాళ్ళు ఏల దాచెనో!" అనెను.

ఆనందోన్మత్తుడనై, మేరీని గాఢపరిరంభమున వక్షమున కద్దుకొని, "ప్రేయసీ! నేను ధన్యుడను. భార్యయు సఖుడును గూడ నాకు తిరిగి లభించిరి. కాని వానిని అనుమానించి నేను పాపము కట్టుకొంటిని." అంటిని.

మేరీ: (అక్కజమంది) ఎట్లు! పీరటు ననుమానించితివా? అక్కటా! ఎంత దోష మొనర్చితివి! లియోపాలా! నా కతడు రెండుసారులు ప్రాణదానము చేసెను. ప్రాణమే

కాదు. (అని మోము వంచుకొని మరల) పీరట్ లేనిచో ఆనాడు పామునోటనే పడియుందును. నీగ్రోలు నన్ను పరలోకగతుడగు మా అయ్య చెంతకు పంప యత్నము సల్పుచుండ మరల నీతడేగదా నన్ను వారి బారినుండి కాపాడెను! (కన్నీరు మున్నీరుగాగ, మరి మాటాడ దయ్యెను)

నేను : అయినచో నిన్ను పీరట్ కాపునగరమున నున్న నా చెంత కేల పంపడయ్యెను ?

మేరీ : పాపము! ఆతడు పంపజూచెను, కాని, సాధ్యము కాలేదు. నన్నాతడు నీగ్రోల కంటను తెల్లవారి కంటనుగూడ పడకుండ కాపాడవలసి వచ్చెను. అదియే ఆతని కెంతో శ్రమ యయ్యెను. మరి నీవెచ్చట నున్నదియును తెలియరాదయ్యె! ఆతడేమి చేయగలడు? కొందరు నీవు మరణించుట చూచితిమని కూడా వచింప, అది అసత్యమని పీరట్ నా కెంతయో ధైర్యము చెప్పెను. నాకును అట్లే తోచినది. ఏలయన నీవు మరిరొుక లాగైనచో నేనును మరణించియే యుందునని నాకు నమ్మకము.

నేను : పిమ్మట పీరట్ నిన్నిక్కడకు తీసుకొనివచ్చెను కాబోలు !

మేరీ : అవును ఇది చాల ఏకాంతప్రదేశము. దీని నీతడు తప్ప ఒరులెరుగరు. అప్పటికి శేషించియున్న ఈ నా చిన్న తమ్ముని, దాదినికూడ ఈతడే రక్షించి ఇచ్చట దాచి యుంచెను. ఈ ప్రదేశము అతిరమణీయము సుమా! మనకింక కాపునగరమున మాత్రమే మున్నది? ఇల్లా? వాకిలా? తోటలా?

దోడ్డా? ఈ యుద్ధమున నాశనమయ్యెగదా! మనమింక నిచ్చ టనే యుందము. మాకిచ్చట కావలసిన సంభారములెల్ల ఇతడే తెచ్చి ఇచ్చుచుండెను. శిరమున ఎఱ్ఱ ఈకల తురాయి చెరవి కొని ఈతడు తరచు వచ్చి మా సేవ నారసి చనుచుండెను. నీ మాటలే ఎప్పుడును జెప్పుచుండును. మరల మనము కలిసి కొందుమని చెప్పుచు నన్నూరార్చుచుండును. అట్టివాడు ఏలనో మూడునాళ్ళనుండి కానరాకపోవుట తలపోసి నేను అలజడి చెందసాగితిని. ఇంతలో నేవు నిన్నే వెంటబెట్టుకొని వచ్చెను. ఇన్నాళ్ళు నీకోసము వెదకుచుండెను కాబోలు! అవునా?

నేను: అవును.

మేరీ: అటులైన నన్నతడు వలచు టెట్లు? నీవ ట్లను కొనుట యెట్లు?

నేను: అనుకొనుట కేమి! ఆనాడు నీ గవాక్షముచెంత నన్ను పొడిచి చంప నుద్యుక్తుడయ్యె నీ సంతాపము గాంచి అట్లు విడిచిపుచ్చిన దీతడే! నీ విహార భవనముచెంత ఆ దిన మున స్పానిష్ గీతములు పాడినదియు నీతడే!

మేరీ: ఎట్లెట్లూ!! అటులైన నీ కీతడు సపత్నుడు కాబోలునేమి! (అని కల్లయక్కజము దోప) ఆ బంతిపూవుల దుండగీడు! ఈ పీరటేనా! ఏమో? నేను నమ్మజాలను సుమా నాయెడ నీతడు చూపు ఈ భక్తియేమి! ఈ శ్రద్ధయేమి! ఇంతటి భక్తిశ్రద్ధలు మున్నీతడు మన బానిసగా నున్నప్పుడు గూడ చూపియెఱుగడు. కాని, అపుడపుడు నావంక ఈత

డేమో వింతగా చూచుట మాత్రము కద్దు. అదియెల్ల మనకు వాటిల్లిన కష్టములకు జాలి చెందుట యని తలచితిని సుమా! కాని, లియోపాలా! నిన్నుగూర్చి ఎంత ప్రీతిగా మాట్లాడెడివాడని! నీ హౌగస్తలయెడ నా ప్రేమ ఎంత వాచాలమో వాని స్నేహము అంత వాచాలము!

మేకీ తెలిపిన యీ వివరములకు సంతసింతునా! సంతపింతునా! ఇట్టి మహోదారునిపట్ల—ఇసీ!— నే నెంతటి క్రూరుడనైతిని "నేనుగాను కృతఘ్నుడను" అని యిందాక పీరట్ సల్పిన మొత్తని విందలో నెంతటి భావావేగమున్నదో నాకప్పుడు తెలిసివచ్చెను.

ఆ సమయమున పీరట్ లోనికి వచ్చెను. వాని మోము విషాదచ్ఛన్నమై కన్పట్టెను. సత్యారక్షణముకొరకెన్నియో హింసలు పడియు, విజయ రేఖచే కలకల చెన్నారు మొహముతో నొప్పు ధీరునివలె నా కాతడు గోచరించెను. అంతట నాతడు నన్ను సమీపించి, నా మొలనున్న ఖడ్గమును వ్రేల జూపుచు 'గంట దాటినది' యనెను.

"గంటయా! యేమిగంట?" అంటిని.

"నీవు నాకిచ్చిన గడువు ముగిసినది. నిన్నిచటకి చేర్చుటకు నా కా గంట వ్యవధి కావలసి, అప్పుడు "నన్ను బ్రతకనిమ్ము" అని వేడుకొంటిని. ఇదె, యిపుడు 'చంపు'మని వేడుచుంటిని" అనెను. ప్రేమ, విశ్వాసము, స్నేహము మున్నగు కోమల భావములెల్ల ఏకమై నన్ను హింసింపుచుండ, నోట మాటరాక, వెక్కి వెక్కి యేడ్చుచు, నా బానిసీని పాదము

లపై బడితిని. నన్నాతడు తటాలున లేవదీసి "ఇది యేమి పని!" అనెను.

"పూజార్హుడవగు నిన్ను పూజించుచున్నాను. భవ్యమగు నీ మైత్రికింక నే నెట్లును అర్హుడగాను. కాని యీతని కృతఘ్నతను మరచుటకుగూడ నీ మైత్రి సమర్థమగునా !"

నేనిట్లు పలుక ఆతని మోము కొంతవడి చెక్కుచెదరక కాన్పించెను. కాని మనస్సులో నేమేమో భావ సంఘర్షణము మాత్రము చెలరేగు చున్నట్లుండెను. పిమ్మట నావంక కొక యడుగువైచి మరల వెనుకకు తగ్గెను. నన్ను పలకరించ బోయెనుగానీ, వానినోట మాట వెడలలేదు. అసతి కాలము ట్లాయాతన ననుభవించి పిమ్మట నన్ను కౌగిటజేర్చుకొనుటకు బాహువులు సాచి "నిన్నిక తమ్ముడా యనవచ్చును గాదూ?" అనెను.

వాని కౌగిట వ్రాలుట తప్ప నే నా మాటకు వేరు ప్రత్యుత్తర మీయలేదు. నన్ను కొంతసేపు కౌగిట అదిమి కొని పిమ్మట "కష్టములు నిన్ను నిష్ఠురుని గావించెనే గాని, నీ వెప్పుడును దయాపరుడవే."

నేను : నా యన్న నాకు మరల లభింపగనే నాకష్టము లన్నియు దీరినవి. కాని నేను పాపకర్ముడ నైతిని గదా!

పీరట్ : పాపమా ? తమ్ముడా ! నేనును పాపినే ! నీకన్న అధిక పాపినిగూడ; నీవు కష్టములైన గడచి గట్టెక్కితివి. మరి నా కష్టము లెన్నటికిని తీరునవి కావుగదా !

# 42

పరా పునః ప్రేమ సౌఖ్యముచే క్షణకాలము విప్పారిన వాని మోము మరల ఎప్పటియట్లు చెన్నుకోల్పడి విచార పరీవృత మయ్యెను.

ఔత్సుక్య లేశమేనియు లేక ఆత డిట్లు వచింప దొడగెను.

“నా కథ చెప్పెదను వినుము. నా జనకుడు ‘కాకాంగో’ దేశమునకు రాజు. తన కుటీరము ముంగిట ఆసీనుడై, అనుదినము తన ప్రజలకు తగవులు దిద్దుచు, తాత తండ్రుల ఆచారము ప్రకారము అతడొక్కొక్క తీర్పు చెప్పి, ఒక్కొక్క గ్రుక్కెడు మద్యమును గ్రోలుచుండెడివాడు. మే మట్లు సౌఖ్య ప్రాభవముల తులతూగుచుండ మా దేశమున తెల్లవారు వచ్చిపడిరి. నీకు పింతగొలుపుచుండు నా యీ విద్యలెల్ల నేను వారికడ నేర్చినవే. ఆ తెల్లవారిలో ముఖ్యముగ నొక స్పానిష్ కెప్టెన్‌తో మా కధికముగ పరిచయము లభించెను. తనతో వచ్చినచో ఇంతకన్న ఎక్కుడు రాజ్యము, సంపదలు, సేవకులు లభింతురని, మా తండ్రికాత డాసపెట్టుచుండెడివాడు. వాని మాటలు నమ్మి, నా జనకుడు సకుటుంబముగా వానివెంట బయలు దేరెను. తమ్ముడా! వాడు మమ్మందరను బానిసలగా అమ్మెను.”

పొంగివచ్చు భావోద్వేగము నణచుకొనుచుండ వాని వక్షము పైకుబికిపడజొచ్చెను. కన్నుల నగ్ని కణములు రాలు

చుండ తానేమి చేయుచున్నదియు నెరుగక, చెంతనున్న యొక మావిగున్ననుబట్టి విరిచివేసెను.

“అంతటి నుండియు కాకాంగో యేలికకు ఒక యేలిక సంప్రాప్తించెను. ఆ రేని కొమరునకు డామింగో పొలములలో దాస్యము చేయుగతిపట్టెను. ఆ సింహాకిశోరమును సులభముగా మచ్చిక చేయుట కొరకు తండ్రి నుండి వేరుచేసిరి. తల్లిదండ్రుల యంకముల నల్లారు ముద్దుగా బెరుగు చిట్టి కూనలను వారికెడ బాపిరి. ఆ బిడ్డలకు తల్లిదండ్రులకు బదులుగా, క్రూర కర్ముడగు యజమానియు, కుక్కలతోపాటు పడుకయు దాపురించెను.”

కథనంతట నాపియు, ఇంకను చెప్పుచున్నట్లే వాని పెదవులు కదలుచుండెను. పిమ్మట నా చేయి బిరాన బిగ్గపట్టుకొని వాడు మరల చెప్పదొడగెను. “తెలిసినదా, తమ్ముడా? బరువులు మోయు గాడిదవలె నే నెందరికో అమ్ముడు వడితిని. ‘ఓగీ’ ని శిక్షించినది నీకు జ్ఞప్తియున్నదిగదా! ఆనాడే మరల పెద్దకాలమునకు నా తండ్రి నా కంటబడెను. అయినను కొరత వేసిరి.”

నా కొడలు జల్లుమనెను. ఆతడు చెప్పుచునే యుండెను. తెల్లవారు నా పెండ్లమునకు మాన భంగము సల్పిరి. “అయ్యో! ఈ పగ నీగువారు నాకు లేరా?” అని విలపించుచు ఆ మానవతి మరణించెను. కాని నే నా యర్ధాంగి యెడల ద్రోహినై యింకొక కాంతను వలచితిని. అదియెల్ల నిపుడు త్రవ్వనేల? మావాళ్ళందరు తమ దాస్య విమోచ

నము సల్పి పగ నీకుమని నన్ను వేడ జొచ్చిరి. నా కావార రాస్కుచే నంద జేసిరి. కాని నీమామ వేయించిన చెరలో బడియున్న నే నపుడేమి సేయుగలను? నీవు నా చెర బాపిన దినముననే, క్రూర కర్ముడగు యజమాని బారినుండి నా బిడ్డ లను కాపాడుకొనుటకు పరుగెత్తితిని. నేను వెళ్ళుసరికి, కాకాంగో రేని మనుములలో కడగొట్టువాడు మాత్రము, తెల్లవాని కశాఘాతముల స్రుక్కి తుదియూర్పులు విడుచుచు మిగిలి యుండెను. ఆ పాపడును వెంటనే తక్కిన వారి ననుగ మించెను."

కథ నిలిపి, "తమ్ముడా! నీవైనచో నపుడేమి చేసియుం దువు?" అని అనుద్వేగముగా నన్ను ప్రశ్నించెను.

ఈ భయానక కథనముచే నా మేను కొయ్యబారు చుండ మాటలాడ నేరక, భయద సంజ్ఞా మాత్రమున వానికి బదులు పలికితిని. ఆతడద్దానిని గ్రహించి, వెడనవ్వు నవ్వుచు మరల చెప్ప మొదలిడెను.

"ఆ యజమానిపై బానిస లెల్ల తిరుగబడి, నా బిడ్డల దుర్మరణములకు ప్రతిక్రియ గావించిరి. వారందరు నన్ను తమ నాయకునిగా వరించిరి. పిమ్మట విప్లావకులు సల్పిన అత్యాచారము లెల్ల నీవు విననవే. నీ మామ బానిసలుగూడా తిరుగబడ నుండిరని నాకు తెలియ వచ్చెను. నేను వెంటనే బయలుదేరి, విప్లవము నాటి రాత్రికే 'ఆకల్' పురమును జేర తిని. ఆనాడు నీవచట లేవు. నీమామను నిద్రలోనే పక్కమీద పొడిచి చంపిరి. అప్పటికే మీపైరు పంటలన్నిటికిని చిచ్చు

పెట్టిరి. సీమామను సర్వనాశన మొనర్చినచో నాపగతీరునని వారి తలంపు. వారి యావేశమును నే నరికట్ట జాలక, చావగా మిగిలిన వారినైన రక్షించుటకు సమకట్టితిని. కోట గోడను గండి నొనర్చి తద్ద్వారమున లోన జొచ్చితిని. నీ భార్య దాదిని విశ్వాసపాత్రుడగు ఒక నీగ్రోను అప్పగించితిని. నీ మేరీని కాపాడుట నా కెంతయేని శ్రమయయ్యెను. ఇంకను మిగిలియున్న తన కడగొట్టు తమ్ముని వెలికి తెచ్చుటకు ఆమె మంటల లోనికి పోవుచుండ నీగ్రోలు చుట్టుముట్టి చంపుటకు సిద్ధపడిరి. నేను తటాలున వారి మధ్యనురికి 'ఈమెపై నేను కసి దీర్చుకొందును మీరు పొండు" అని ఆజ్ఞాపించితిని సరేయని వారు వెడలి పోయిరి. శిశువును రాస్కన కొప్పగించి, నీ భార్యను నే నెత్తుకుంటిని, ఇచట ఈ గుహాయున్న జాడ నితరులెరుగరు. కావున వీరినిటకు గొని వచ్చితిని. తమ్ముడా! ఇదీ నేను చేసిన తప్పిదము."

మరియు విశ్వాసానుతాపములు ఉత్తలపెట్ట నేను వాని కాళ్ళపై మరల పడబోవ, నన్ను వారించి, "తమ్ముడా నీ భార్యతో బయలుదేరుము. అందర మిటనుండి వెడలి పోదము" అనెను.

నే నక్కజముతో "ఎచటికి గొనిపోదువు" అని యడిగితిని. అడుగుటయు నాతడు తెల్లవారి శిబిరములకు; ఈ స్థల మింక భద్రముకాదు. ఇటనుండరాదు. రేపు తెల్లవారక ముందే బైసో శిబిరము ముట్టడింపబడును. గాన ఈ అరణ్యామునకు చిచ్చు పెట్టకమానరు. అదియటులుండ నేనింక ఇచట

తడయరాదు. నే నచట పదిమంది ప్రాణములను కుదువబెట్టి వచ్చితిని. మీరు బంధవిముక్తులై తిరిగాన మనమింక నేగ గలము; నేనింకను బంధితుడగాన, మనమేగి తీరవలయును" అనెను.

ఈ మాటలు నా యాశ్చర్యము నినుమడింపజేయ "నాకు తెలియజెప్పుము" అని వాని నడిగితిని.

ఈ అలౌకిక పురుషుని వచనమున ఏదియును ఆశ్చర్య విషయము కాజాలదు. కాని కానిస యగు పీరట్ కాకాంగో ప్రభువగుట మాత్రము నా కచ్చెరువు జనింప జేసినది. మరియు మోరన్ రూజ్ విప్లవకుల నాయకుడును, ధైర్యధనుడును, ఉదార మానసుడును అగు బగ్ జార్గల్ తానేయని ఆతని నోట వినినప్పుడు నాకు గలిగిన ఆనందమునకు మేరలేదు. కాకాంగో ప్రభువగు ఈ బగ్ జార్గల్‌కు విప్లవకులును బైసో కూడ పాదాక్రాంతు లగుటలో ఇంక ఆశ్చర్యమేమి కలదు ? నా మనమున పొడమెడి యీ భావము లాత డరయక, "నీవు బైసో శిబిరమున బందివై యుంటివని నిన్ను విడిపించుట కెంత తొందరగా నరుదెంచితిని" అనెను. నేను "ఇంతకు మున్ను నీవును చెరలోనే యున్నట్లు చెప్పితివే ?" అంటిని. నేని ప్రశ్న మడుగుట న్యాయమే యైనను నే నెందుల కడిగితినో యని ఆతడు నావంక సవిమర్శముగా చూచి యిట్లనెను—

"చెప్పుచుంటిని వినుము. నేటి ఉదయమున నేను నీ మిత్రుల చేతుల బందినైయుంట నిజమే. నేడు ప్రొద్దుగుంకక ముందే లియోపాల్ అవర్నీ అను బంధితుని బైసో చంప

నున్నాడను వార్త నా చెవులబడెను. మీ వారును ఈ వార్త విని, నేను తప్పించుకొనిపోకుండా తగిన కట్టుదిట్టములు సల్పి "మా అవర్నీని మీ వారు చంపగనే, నిన్నును మేము చంపుదుము. నీవు తప్పించుకొందువా, నీ బదులు మీవారిని పదిమందిని సంహరింతుము" అని చెప్పిరి కావున ఇంక నే నిట తడయరాదు."

నే నాతనిని విడువక "అయిన, నీవు తప్పించుకొని వచ్చితివన్నమాట" అంటిని. అనుటయు నాతడు: "ఔను, ఇచటికి వచ్చి, నా ప్రాణదాతవగు నిన్ను రక్షించుకొనుటకు గత్యంతరము లేదాయెను. రండు, మరి బయలుదేరి పోవుదము. తెల్లవారి శిబిరమును, బైసో శిబిరమునుగూడ ఇచ్చటికి గంట ప్రయాణము. చూడు మదే యీ నారికేళ తరుచ్ఛాయలపుడే దీర్ఘములగుచున్నవి. ఇంక మూడు గంటలలో సూర్యుడ స్తమించును. తమ్ముడా! రమ్ము పోదము. ఈ కాల మొకరి కొరకు నిలువదుగదా!" అనెను.

"ఇంక మూడు గంటలలో సూర్యుడ స్తమించును!" ఈ మాటలు నాపాలిటి పెనుభూతములై నా రక్తము గడ్డకట్టి దొడగెను. బైసోకు నే నొసగిన దురంతపు బాస జ్ఞప్తికి తగిలెను. నాకు లభించిన మేరీ పునర్దర్శనానందమున మాకు వాటిల్లనున్న శాశ్వతవియోగము మాట మరచితిని. మత్ప్రియా సాన్నిధ్య సౌఖ్యమున విశ్వమే మరచిన నాకు, మృత్యుదేవత నన్ను చేసన్నల బిలుచుచున్న మాట జ్ఞప్తికి రాకపోయెను. కాని నా మిత్రుని వాక్యములచే అంతయు మనోగోచర

మయ్యెను. ఇంక మూడుగంటలకు ప్రొద్దుకుంకును. బైసో శిబిర మిటకు గంట నడక. ఇక నేమి కలదు ? నా కర్తవ్యము స్పష్టమగుచున్నది. నాచే బాసచేయించు కొన్న ఆ దుర్జాతు నకు ద్రోహించివాని మాటపై ఇంకను నమ్మక మున్నది. ఆ నమ్మ కమును చెరచుటకన్న చచ్చుటయే మేలుగదా ? అటులని, సమయ పరిపాలన చేయుదు నన్న ఈ ప్రక్క భయంకరా గాధము కానవచ్చుచుండెను. నిజము చెప్పుచున్నాను, కర్తవ్యమున నొక క్షణము నేను వెనుకాడిన మాట నిజము. అందులకు మీరు మాత్రము నన్ను నిందింపగలరా ?

## 43

నా ముఖమున వెలుచున్న విచారమును గాంచుచున్న బగ్ జార్గల్ కు మేరీకి దీర్ఘవిశ్వాసపురస్సరముగా చెరియొక చేయి అందించి ఇట్లంటిని. "బగ్ జార్గల్ ! విశ్వమున నీకన్న కూడ నాకు ప్రియతమ ప్రాణియైన మేరీని నీ కప్పగించు చున్నాను. మీరిరువురును ఇక శిబిరమున కేగుడు. నేను మీ వెంట రాజాలను" ఈ మాటలచే భయభ్రాంతయై మేరీ ప్రక్క త్రిప్పుకొనలేక "దైవమా ! మరల నిదియేమి ఉపద్ర వము ?" అని యరచెను.

బగ్ జార్గల్ కూడ విషాదాశ్చర్యములచే ఒడలు వణక "తమ్ముడా ! ఇదియేమి ?" అని ప్రశ్నించెను. మరల నేదియో ముంచుకొని వచ్చుచున్నదని నామీది ప్రేమ పెంపున మేరీ కూడ కొంత ఊహింపజాలెను. ఊహామాత్రముననే అట్లు

భయభ్రాంత యగుచున్న ఆ యబలకు ప్రస్తుత మీ ఘోర వృత్తాంత మెరిగించుటకు మనసుగొల్పక బగ్‌జార్గల్ చెవిలో నిట్లు చెప్పితిని: “నేను బందీని. రెండుగంటల ప్రొద్దుండగనే మరల వాని అధీనమున నుందునని బైసోతో బాసచేసితిని. ఇంక మరుగుపెట్టనేల? తిరిగి మృత్యుముఖమున ప్రవేశింతునని ప్రమాణము చేసితిని.”

బగ్ : (క్రోధ పూర్వకముగ బిగ్గరగ) ఎంతపని చేసె నా రాక్షసుడు! నీతో చాటుగా మాటలాడినది ఇందులకా? నీచే ఈ దారుణ ప్రతిజ్ఞ చేయించుకొనుటకా! అక్కటా? ఆ నీచు నేలనమ్మితివి? వాడు నల్లవాడుకూడ కాడు. సంకరుడని యెరింగియు వాని ఈ కోర్కెలో ఏదియో మోసమున్నదని గ్రహింపజాలనైతిగదా!

మేరీ : (భయగ్రస్తయై వాపోవుచు) ఆ మోస మేమి? ఆ ప్రతిజ్ఞ యేమి? ఆ బైసో యెవడు? నాకేమియు తెలియుట లేదు.

నేను : (బగ్‌జార్గల్‌తో జనాంతికముగా) ఇశ్శో! మాటాడకుము. మేరీని భయపెట్టవలదు.

బగ్ : అటులనే కాని, నీవట్టి బాస యేల చేసితివి? వాని మాటకెట్లు సమ్మతింప గల్గితివి?

నేను : నీవు వంచకుడ వనియు మేరీ నాకింక దక్కదనియు ఎంచిన వాడను మరి యేమి చేయుదును? అపుడింక నాకు ఈ ప్రాణముండి యెందులకు?

బగ్ : పోనిమ్ము, అంతియేకదా; ఆ కొంపాటుకానితో

చేసినఈపాటి బాస నిన్ను బాధింప జాలదు.

నేను : నామాట మీాద ప్రమాణము చేసితిని.

బగ్ : (అవితార్ధుడై) నీమాటయేమి? ప్రమాణముసల్పుట యెట్టిది? మీారేమి ఒక్కపాత్రమున త్రావితిరా? ఒక్క పళ్ళెమున భుజించితిరా? ఏమియు లేని ఈ ప్రమాణ మెట్టిది?

నేను : నిజమే. మేమట్టి దేదియు చేయలేదు.

బగ్ : ఇక నేమి ? వానికి నీవు చెల్లింపవలసిన దేమి?

నేను : నామాట.

బగ్ : ఏమో, అది యంతయు నా కర్థమగుటలేదు. బైసోకు నీవేమియు చెల్లింప నక్కరలేదు. పోదము రమ్ము.

నేను : అన్నా! అట్లుకాదు. నేను నామాటచే కట్టు పడితిని. దాటజాలను.

బగ్ : (కోపముతో) లేదు. నీవు కట్టుపడలేదు. (మేరీ దిక్కై) చెల్లీ ! నేనెంత వేడుకున్నను నీభర్త వినకున్నాడు. నీవు కూడ బ్రతిమాలుము. చూడు! నేను విడిపించుకొని తీసి కొని వచ్చిన ఆ శిబిరమునకు మరల పోవునట. బైసో కేమో తన ప్రాణము లప్పగింతునని ఈతడు మాట ఇచ్చెనట.

నేను : (కోపముతో) ఎంతపని చేసితివి. !

ఇక నేనేమి చెప్పిన ఏమి ప్రయోజనము! తన సపత్నుడగు నన్ను ప్రోవుమని తా వలచిన వనితనే ప్రేరేపించిన ఈ మహోదారుని పలుకులు చేయవలసిన పనియెల్ల చేసెను. మేరీ దుఃఖముతో వెక్కుచు నా వక్షమున వ్రాలి, బాహులతికలు

నా కంఠమునకు పెనచి, నోటమాటయు ముక్కున ఊపిరియు లేకయుండెను. ఎట్టకేలకు కొంత ప్రాణము తేరుకొనగా, ఆ బేల "లియోపాల్! పలుకవేమి? అతను చెప్పినది నిజమేనా? నన్ను మోసగించుచున్నాడు కాదూ? మన మిప్పుడేకదా కలిసికొంటిమి! మరల ఇంతలోనే నన్నెడబాసి పోవలయునా? అయ్యో! బదులు పలుకవేమి ? నా ప్రాణము లింక నిలువవు. నా కొసగిన నీ శరీరమును నీ ఇచ్ఛవచ్చినట్లు చేయుటకు నీ కధికారము లేదు. మరల నా కగపడకుండ పోవుటకు నీ మనసొప్పునా? నీవు నా లియోపాల్డువు కావా?" అని విలపింప దొడగెను.

నేను : మేరీ! దుఃఖింపకుము. మనము మరల కలిసి కొందము—స్థలాంతరమున.

మేరీ : (గాద్గదికతో) స్థలాంతరముననా! ఎక్కడ?

నేను : స్వర్గమున.

ఆ విమలాత్మతో అసత్యమాడుటకు నాకు నోరెట్లు వచ్చును? ఈ తూరి ఈమె దుఃఖమూర్ఛిత కాగానే, ఆ యబల నెత్తుకొని కన్నుల నీరు పెట్టుకొనుచున్న బగ్‌జార్గల్ చేతులలో పెట్టితిని. అతడు "నీ పంత మెద్దానను విడువవైతివిగా! ఈ యబల దశయే నిన్ను చలింపచేయనపుడు నేనేమి చెప్పి నీ మనసు కరిగింపనేర్తును? నిర్దయుడా ! మేరీని త్రోసి పుచ్చుటకు నీకెట్లు మనసొప్పెను ? నాకైనచో ఈ విశ్వ సామ్రాజ్యమెల్ల ఈమె పలికిన ఒక్కమాట పాటి సేయదు. అట్టి ఈమె నీకు మృత్యువుపాటియు చేయదాయెగా !" అని నిందించెను.

నేను : నేను మాట తప్పజాలను. బగ్ జార్గల్ ! నాకు సెలవిమ్ము. అన్నా! నాకు సెలవు. మేరీని నీ చేతిలో పెట్టితిని.

దుఃఖభారమున క్రుంగుచున్న వానికి నా మాట లర్థమైనట్లు లేవు. అంత నాతడు నా చేతులు పట్టుకొని "తమ్ముడా ! తెల్లవారి శిబిరమున నీ బంధువులుందురు. ఈమెను వారి కొప్పగించెదను. అంతేకాని, నేనుమాత్ర మీ న్యాసము నంగీకరింపజాలను." అనుచు దూరముగా కాన్పించుచున్న ఒక పర్వత శిఖరమును వ్రేలితో చూపి, ఆ కాన్పించు పర్వతమును చూచితివా! దానికొననుండి నీ మరణ సూచి యగు తుపాకి మ్రోత వినిపించగనే ఈవలి దెసనుండి నా మరణ సూచకమగు మ్రోత దానికి ప్రతిధ్వని యగును." అనెను.

నేనా మాటల యర్థము విచారింపకయే వానిని మరల ఆలింగన మొనర్చుకొని—అరుణతా హీనములైన మేరీ పెదవులు కడసారి ముద్దిడుకొని, దాది ఉపచారములచే ఇంచు కించుక ఆ బాల తేరుటగాంచి, మరల నా ధైర్యము సడలునో యను భీతిచే వెనుదిరిగి చూడక, మృత్యు నగర గంటాపథమున బడి పరువిడితిని.

## 44

అతిరయమున నేగి, ఆ యడవి సొచ్చి, మున్ను నడచి వచ్చిన మార్గమరసి కొనుచు, వెనుదిరిగి చూడకయే చను చుంటిని. హృదయఫలకము లొరసి పైకి ఉబుకుచున్న దుఃఖము

నణచుటకు ఒక్క పెట్టున చెట్లును, పుట్టలు, రాళ్ళు, రప్పలనక శరవేగమున అరిగి తుదకొక్క కొండకొన చేరితిని. అచటికి బైసో శిబిరమెల్ల శకటసంఘములతో, కుటీరశ్రేణులతో జనసంకులమై పెద్ద చెదలపుట్టవలె కానవచ్చుచుండెను. అంతటితో నా ప్రయాణమును, జీవితమును గూడ ముగిసినట్లై, అచట కొంచెముసేపు ఆగితిని. శ్రాంతియు దుఃఖమును శరీరమును నీరసింప జేయ, కాళ్ళాడుకొని నిలువలేక, ఒక చెట్టునకు చేరగిలబడి ఎదుట గానవచ్చు నా మృత్యురంగముపై చూపు సారించి పరికించుచుంటిని.

నన్ను చుట్టుకొన్న కష్టములెల్ల ఎట్టెట్టో గడచిగట్టెక్కితి ననియె ఇంత దనుక భావించుకొంటిని. ఈ విషపాత్ర నాచే నిశ్శేష పీతమయ్యెనని ఇప్పుడేకదా సంతసించితిని. మరల ఇంతలో హాలాహల సన్నిభమగు ఈ ఘోర దుఃఖము దాపురింపవలెనా ? నిజమునకు ఇంతకుముం దనుభవించిన కష్టములెల్ల దీనిముందు కష్టములేకావు. అచ్చపు దుఃఖ మెట్లుండునో నా కిప్పుడుగదా తెలిసివచ్చినది ! కష్టంపు మేరను దాటి సుఖసీమ యందు అడుగుపెట్టునరికే, నోటిదగ్గరకు సిద్ధమై వచ్చిన అమృతపాత్రమును, సత్యమింపచే చేసేతుల బోరగిలదోసికొనుటకు సిద్ధమైన నాదుఃఖము మున్నెన్నడు కనివిని ఎరిగినది కాదు. కొలది గంటలకు పూర్వమేకదా ఈలోకమెల్ల నాకు పాడుపడిన ఇల్లువలెనై, బ్రదుకే భారమనిపించి, నిరాశోపహతుడనై మరణమే శరణమనుకొంటిని. అట్టివానికి మరల పెన్నిధివోలె మేరీ లభించి,

మృతప్రాయమగు సౌఖ్యలత మెండియు చిగిర్చి, మేఘచ్ఛన్న
మైన ఆశాచంద్రుఁ డపూర్వకాంతిప్రపూర్ణుఁడై వెలిఁగి, నూతన
జన్మము వచ్చి, జీవితమును మరల ప్రేమ మధుపూర్ణమై
భోగ భాగ్యములచే మోహజనకమై పొడచూపెను: నిరా
తంకమై, నిర్బాధమై, ఎట్టయెదుట తోఁచి, అసలు మొలపించు
చున్న ఆ యానందధామమున స్వేచ్ఛా విహారము సల్పుట
కాయత్తపడుచుండ, ఈ మాయదారి చావు నా కెటునుండి
దాపురించెను. ఆ స్వర్గ ద్వారమున ఇంచుక అడుగు పెట్టితినో,
లేదో, ఇంతలోనే ఈ ధర్మభూతము నా కడ్డమై అవతరించి,
వెనుకకు పడఁద్రోయవలయునా? త్రోసెపో, ఘోర మృత్యు
ముఖమునకే త్రోయవలయునా?

భగ్నమనోరథుఁడై, నిరాశాహతుఁడైన వానికి మర
ణము తృణప్రాయ మగునుగాని, ఇప్పుడే సంసారసుఖము చవి
చూడఁబోవు వాని కండ్ల యెదుట, దంష్ట్రాకరాళ వదనయగు
మృత్యుదేవత ప్రత్యక్షమైన ఎట్లుండునో వేరే చెప్పవలయునా?
నరకకూపమునుండి వెలికిలాగి, క్షణకాలము, సంసారభూత
ములగు ప్రేమ స్నేహ స్వాతంత్ర్యము లొక్కపరి అనుభవింప
నిచ్చి, నా దుర్విధి మరల ఘోరనరక ద్వారము తెరచి,
నన్నందు శాశ్వతముగా ద్రోచిన చందమయ్యె నా బ్రతుకు!!

## 45

దుఃఖోద్రేక మొకించుక చల్లబడిన పిమ్మట నా
కేదియో విపరీతావేశము పుట్టి చరచర ఆ లోయలోనికి దిగి

పోఁదొడఁగితిని. గ్రుడ్లు మిటకరించుకొని యెదుట కూరుచుండిన మృత్యువును గాంచుచు, బిక్కుబిక్కుమనెడి దురవస్థకంటె ఒక్క యుదుటున బోయి, దాని వివృత ముఖద్వారమున బడుట సుఖావహము. స్కంధావారపరిసరరక్షకుఁడగు దళవాయి నన్ను లోనికి ప్రవేశింపనీయ డయ్యెను. నా యీ మనోరథ పరిపూర్తికి వానిని బ్రతిమాలు నవసరముగూడ బట్టెకదా! ఎట్టకేలకు అచటి భటులిరువురు నన్ను పట్టుకొని బైసో సముఖమునకు గొంపోయిరి.

నేను గుహలో ప్రవేశించుసరికి ఏవియో హింసా సాధనములు పరిశీలించుచున్న బైసో, అడుగుల చప్పుడు విని మావంక జూచెను. నా పునరాగమనము వాని కించుకయు ఆశ్చర్యము గొల్పదయ్యెను. ఆ హింసా సాధనములు నాకు చూపుచు వాఁడు, "వీటిని చూచితివా?" అని ప్రశ్నించెను. ఆ 'అగతికగతికుని' ఘాతుకత్వము నాకు క్రొత్తకాదు. కావున, నేనేమియు మారు పలుకక ఉపేక్ష వహించితిని. చెక్కు చెదరకుండా వాఁడు చేయు పరీక్షయందు నెగ్గవలెనని సంకల్పించితిని.

మరల వాఁడు కుటిలహాసపూర్వకముగా "లియోగిరి అదృష్టవంతుఁడు గాన కేవలము 'ఉరి'తో తేలిపోయినది. ఏమందువు?" అనెను.

నేను వానికిని మారు పలుకక నిర్లక్ష్యముగా చూచుచు నిలచితిని.

వాఁడంతట నొక సైనికుని పిలిచి "బంధితుఁడు తిరిగి వచ్చెనని ఆచార్యునితో చెప్పుము" అని పంపెను.

పిమ్మట కొంతసేపు మాటయు పలుకును లేదు. వాడు మాత్రము నన్ను ఓరచూపుల కనిపెట్టుచునే యుండెను. ఆ సమయమున రిగాడ్ చిడిముడిపడుచు నరుదెంచి, బైసో చెవిలో నేమో చెప్పెను. బైసో అదియెల్ల విని శాంతముగా "దండనాయకు లందరిని రావింపుడు" అనెను. కొంతవడికి నానా ప్రకారములగు దండనాయకులెల్ల గుహలో గుమి గూడిరి. బైసో లేచి వారితో ఇట్లు చెప్ప మొదలిడెను:—

"అన్నలారా! వింటిరా? రేపకడ తెల్లబలము లెత్తి వచ్చునట. కావున మనమింక ఈ ప్రదేశమున నిల్చుట క్షేమముకాదు. ప్రొద్దుక్రుంకు వేళకు మన మీ చోటువిడిచి స్పానిష్ సీము చేరవలెను. మకాయా! నీవు నీ బలముతో ముందు నడువుము. పాడ్రిజన్! మనము పట్టుకొన్న ఈ ఫిరంగులెల్ల భగ్నము కావించు భారము నీది. ఈ కొండలపై మనము వీనినెల్ల తరలించుకొని పోజాలము. 'క్రాయిడిబో' కే బలములు మకాయా ననుసరించి పోవలెను. అవెనుక టౌజంట్ తన బలముతో నడువవలయును. గిరోటీ మూకలలో నెవ రైనా అల్లరి చేసినచో వారిని పట్టి నరకవలసినదిగా మా యాజ్ఞ. క్లాడ్ దండనాథుడు సంకర బలములకు మనకడనున్న ఆంగ్లేయుల తుపాకులను పంచి ఇచ్చి, వారితో విస్తా నదీతీరము వెంట, వంకదారులు పట్టిపోవలయును. ఇంకను మిగిలిన బందీ లను వధింపుడు. బాణాగ్రములకు విషము పూయుడు. మూడు పుట్ల పాషాణమీ నూతులలో గ్రుమ్మరింపుడు. అది చక్కె రగా నెంచి తెల్లవారు నిస్సంశయముగా ఈ నూతుల నీరు

త్రాగగలరు. మైదానపు దారుల కడ్డముగా రాళ్ళు దొరలింపుడు. కంచెల చాటున ఈటెకాండ్రు నిలిచియుండుడు. అడవికి నిప్పు దరికొల్పుడు.

రిగాడ్! నీవు నాతో నుండుము. కాండీ! నా అంగరక్షకుల పిలువుము. మారన్ రూజ్ సైనికులు మాత్రము రేపు ప్రొద్దుపొడుచు వరకు ఇచటనేయుండి, పిమ్మట బయలుదేరి రావలయును." అని రిగాడ్ దెసకు వంగి "వారు బగ్ జార్గల్ సైనికులు. ఇచట కడతేరిన కడతేరనిమ్ము. వారు చచ్చినచో వారి సేనానియు చచ్చినట్లే" అని మరల దండనాథుల నుద్దేశించి "అన్నలారా! పొండు; ఇక చెప్పవలసిన మాటలున్న కాండీ చెప్పగలడు." అని వార నందరిని పంపివైచెను.

ఈ ఆదేశము గైకొని దొరలెల్లరు గుహా వెడలిపోయిరి.

రిగాడ్, "సేనాని! స్థితిగతులు విషమించుచున్నవి. మనమింతటనైన ఆ సంధిపత్రమును పంపుట మంచిది. త్రోసికొని వచ్చు తెల్లవారు దానిని జూచి యైనను నిలువ గలరు" అనెను.

బైసో "ఔనౌను" అనుచు జేబునుండి ఆ పత్రమును దీసి, పెదవి విరచి, "ఇది యంతయు తప్పుల తడకగా నున్నది. చదువుకొన్న తెల్లవారు దీనిని చూచి నవ్వెదురు. (నన్నుద్దేశించి) ఓయీ! నిన్ను తుదిసారి యడుగుచున్నాను. నా అనుగ్రహమును ఇప్పటికైన దక్కించుకొనుము. (బదుకుపై ఆస కలదేని దీనియందలి తప్పులు దిద్ది, 'ముసద్దీ' వ్రాతగా సవరిం

వుము. ఇదిగో కైకొనుము!" అని దానిని నా కందీయరాగా, నేను తిరస్కార పూర్వకముగా తల త్రిప్పితిని.

బైసో: నీ పీపని చేయదలప లేదా?

నేను: ఔను. చేయదలపలేదు.

బైసో: (ఒకకంట నన్ను, ఒకకంట వధోపకరణము లను ఓరచూపుల జూచుచు) బాగుగా ఆలోచించుకొనుము. (తల పంకించెను.)

నేను: ఆలోచించుకొనియే నిరాకరించితిని. నీవు పందవు. ప్రాణభయమున తహతహ లాడుచు, ఈ లేఖయేని శ్వేతజాతుల శాంతింప జేయక పోవునా యని ఆశించు చున్నావు. అట్టి పందను నిన్ను బ్రదికించుటకై, నేను బ్రదుక జాలను. ఏల ఆలస్యము? నావధ ప్రారంభింపుము.

బైసో: (ఆ యుపకరణమును కాలదన్నుచు) ఔరా! డింభకా! నీ వప్పుడే ఈ ఆయుధ స్పర్శసుఖ మనుభవించు చున్నట్లున్నదే? ఔనా? అయ్యో; పాపము! నీ కట్టి సుఖ మను గ్రహించుటకు నాకు వ్యవధిలేదు. మేము చాల యెద్ద డిలో నున్నాము. ఎట్లో వెంటనే బైటపడ జూచుకోవలెను. ఇంతకూ నీవు నేను చెప్పినపని చేసిపెట్టవుగాదూ? కానిమ్ము. నీకు మంచిబుద్ధియే పొడమినది. తీరా, నీ వీ పని జేసినను, నిన్ను రక్షించుటయు సందేహాస్పదమే. ఏమన, నీ ప్రాణములు నా వశమున లేవు; మా గురువు చేతులలో నున్నవి. అవి యింతకుముందే వారికి దత్తము చేసితిని. ఏమైన నేమి, నా

రహస్య వర్తనముల గుర్తెరిగిన వాని నెవ్వనిని బ్రదుకనిత్తు ననుకొనకుము.

(అప్పుడే వచ్చిన మాంత్రికు నుద్దేశించి) ఆచార్యా! మీ భటులు సంసిద్ధులై యున్నారా?

మాంత్రి: ఆ! ఉన్నారు.

బైసో: వారు మోరన్ రూజ్ దళములోనివారేనా? ఇతరు లెవ్వరికని అంత తీరుబడి లేదు. తక్కిన దళములన్నియు కదలిపోవలసి యున్నవి.

మాంత్రి: (తలవంచి) ఔను అల్లే.

బైసో: (మూలనున్న ఒక నల్ల జెండా నాకు చూపి) ఆ జెండాయే సుమీ, నీ ఉద్యోగము నీ క్రిందివాని కీయ వచ్చునని నీ యధికారులకు తెలియచేయునది. మా కింక కాలయాపన తగదు. కదలిపోవలెను. అన్నట్లు మరచితిని. నీ విందాక కొంతదూరము షికారు పోయివచ్చితివే; ఆ ప్రదేశము లెట్లున్నవి? నీ మనకి నచ్చినవా?

నేను: నిన్నును, నీ దండునుగూడ వ్రేలగట్టి ఉరితీయుటకు తగినన్ని చెట్లు ఆ ప్రాంతమున నున్నవి.

బైసో: (క్రూరహాసము చేయుచు) ఓహో! అటులనా! కానిమ్ము, అచట నింకొక ప్రదేశము గలదు. నీవు దానిని చూచి యుండవు. దానిని మా గురువు నీకు చూపును లెమ్ము. శూరకిశోరమా! మంచిది, పొమ్ము, లియోగిరిని అడిగితినని మాత్రము చెప్పుము.

కొండచిలువ బుసకొట్టినటు లికిలించుచు వాడు నన్ను

వీడ్కొలిపెను. భటులు నన్నటనుండి లాగికొనిపోవుచుండ, ఆ మాంత్రికుడును ముసుగు సవరించుకొని, కేల జపమాల త్రిప్పుచు, మమ్ము వెంబడించెను.

## 46

చుట్టును నీగ్రోలు బలిసిరాగా, నేను రిత్తపెనగక మెదలకుండ నడచి పోవుచుంటిని. అట్లా మైదానము గడచి పడమటి దెసనున్న ఒకకొండ నెక్కితిమి. వారచట కొంత తడవు విశ్రమింప నేనును చదికిలబడి, నా జన్మకింక అదియే తుదిచూపు గాన అస్తంగతుడగుచున్న భానుని సాభిలాషుడనై చూచుచుంటిని.

పదపడి యటనుండి బయలుదేరి మేమొక లోయలోనికి దిగితిమి. అప్పటి నా యవస్థకు తగకుండెను గాని, ఆ లోయ రామణీయక మనన్యము. దాని యడుగున నిరుత్తుల పచ్చని పచ్చికలు మొలచి కనులపండువుసేయ, సన్నని సెలయేరొకటి దొనదొన పరువులిడుచు, అనతిదూరమున వినీలజలసుందరమై అలరారు నొక తటాకమునబోయి పడుచుండెను. ఆ డామింగో ద్వీపమునిండ అట్టి సరస్సు లెన్నియో కలవు. సుఖపూర్ణములై చెల్లిన తొల్లిటినాళ్ళలో, సంజవేళల నేనా చెరువులయొద్దున, శీతల సమీరాసేవనమున కన్నులరమోడ్చి ఆ భావపరంపరలకు చిక్కి ప్రొద్దుపుచ్చుచు, ఆ వినీల సరోవారిపై తరపి వెన్నెలలు వ్యాపించి, వెండి జలపోత మాడ్కి గావింప, అందు ప్రతిబింబించు తారాగణములు బంగరుతీగ యల్లిక బెడంగు లావ

టింప, తన్మనోహర దర్శనమున మైమరచెడివాడను. ఆయింపు
లెల్ల నా తలంపునకు తెచ్చుకున్న ఆ లోయసోయగమేమి
చెప్పను? అందందు దట్టములై ఆకసమంటుచున్న దిరిసెన
చెట్లును, వాని చెంగట చువ్వలవలె ఎదిగి తలలాడించుపోక
మ్రానులును, వాని కీవలివెస పచ్చనిపండు గెలలు వ్రేలు
ఖర్జూర నారికేళ తరువులును, ఇరుగట్టుల కలయ పెరిగిన గచ్చ
గోరంట పొదలును, నలుదెసల పరిపై సాగిన శాఖాగ్రముల
నెగయ విచ్చిన పూవుల కెంజాయలలో, ఆకులే కానరాకున్న
కింశుక తరువులును, విషమశిలామయములగు పర్వత సానువు
లను పొదివికొని అంతటను కలయ నల్లుకొని పువ్వునవ్వులు
వెదజల్లు నానా లతాప్రతానములును అందగింప, ఎన్నడును
హాలముఖ స్పర్శ యెట్టిదో యెఱుగక, కమ్మని వాసనలీను నేల
లతో ఆ లోయ యెల్ల పురాణపురుషావాసమగు 'ఈడెన్'
వనమో యన పంచేంద్రియములను తనుపుచుండెను.

ఆ సెలయేటి యొడ్డున ఒక కాలిదారిని బట్టి మేము
పోదొడగితిమి. పోను పోను నిడుపాటి గుట్ట యొకటి మా
త్రోవ కడ్డమై యుండెను. ఆ పర్వత పాదమున, సహజమై,
రవాకులు దిద్ది తీర్చినట్లున్న సొరంగములోనుండి ప్రవాహము
వచ్చి పడుచుండెను. ఆ గుహాంతరాళమునుండి, 'బొంయ్యి'
మని వీచు గాలితో కలసి జలపాత మంద్రధ్వనులు వినవచ్చు
చుండెను. అంత నా నీగ్రోలు ఆవలి దెసగా ఆ గుహలోనికి
త్రోవ తీసిరి. అచట ఎన్నడో వట్టిపోయిన తల్లిమడుగొకటి
కానవయ్యెను. పైకిచూడ ఆకులతో గడ్డితో సగము సగము

కానవచ్చు రాతికప్పు; సొరంగ మంతట జలపాత ధ్వని.

నేను సొరంగములో అడుగు పెట్టగానే మాంత్రికుడు నన్ను సమీపించి అల్లన నిట్లనియె, "నేను జోస్యము చెప్పు చున్నాను వినుము. మరల ఈ దారివెంట మన యిరువురిలో ఒక్కడు మాత్రమే బయటపడును."

వాని మాటలు నేనుసరకు సేయనైతిని. మే మా సొరంగపు చీకటిలోని కింకను జొచ్చి చనుచున్న కొలది, ప్రవాహ ధ్వనియు నధికమై, అందు మా పాద విన్యాసధ్వనులు అణగి పోవుచుండెను. నేనును జలపాతమును దరియుచుంటి మను కొనుచు ఆ చీకటిలో అట్లు పదినిముసములు పోవ, అచట అర్ధ వలయాకారముగనున్న పెద్దరాతి యరుగొకటి కన్పించెను పర్వత గర్భము నుండి మహా ప్రవాహమొకటి భీకర ధ్వనితో దుముకుచు వచ్చి ఆ యరుగుపై బడుచుండెను. ఆ పాతాళ చత్వరము పైకప్పు గోపురాకారమై యుండెను. అంతట దట్ట ముగ నాచు పెరిగియుండెను. ఆ గోపుర మధ్యమున ఒక పెద్ద రంధ్రముగుండ, లోనికి వెలుగు ప్రసరించుచుండెను. లోపలి చెట్టుచేమలపై తళతళ మెరయుచున్న సంధ్యారుణ కాంతు లప్పుడే మాసి పో దొడగెను. ఆ ప్రవాహము ఆ యరుగు రెుక్క ఉత్తరపు కొననున్న యగాధమున బడు చుండెను. పైనున్న రంధ్రముగుండ ఇంచు కించుక వెలుగు పడి అగాధోపరిభాగమున తేలియాడుచుండెనే గాని, ఆ వెలు తురులో దాని అట్టడుగు కొంచెమేని కాన్పించుటలేదు.

ఆ యగాధపు టంచున వృద్ధ తరుమూాల మొకటి

గలవు. దానిపై కొమ్మలు ప్రవాహ డిండీరమున మునిగి కొన రాకుండెను. వ్రేళ్ళు మాత్రము అగాధము లోనికి రెండు మూడడుగుల లోతున వ్యాపించి కాన్పించుచుండెను. ఇట్లు వ్రేళ్ళును కొమ్మలును ప్రవాహమున నానుచుండ, ఆ యగాధములోనికి వ్రాలియున్న ఆ చెట్టు, చాపిన మోడిచేయివలె నుండెను. ఆ చెట్టు జాతియేమో తెలిసికొందమన్న దాని ఆకులు కాన్పించవు. సతతము తేమలో నానుచున్న వ్రేళ్లు దానిని చావకుండ జేయ, పైనున్న ప్రవాహ వేగమున రెమ్మలును పిలకలును కొట్టుకొనిపోవ, ఆ మొరపిడికి తాళిన పెద్ద కొమ్మలు మాత్రము నిగిలి, ఆ చెట్టు భయముగొల్పుచుండెను.

# 47

ఆ భయంకర ప్రదేశమున నీగ్రోలెల్ల ఆగుటయు నేను నా కాలము తీరినదని గ్రహించితిని. నా ఆశలెల్ల భీకరమైన ఆ జలాఘాతమున అడుగంటిపోవచుండుట తలపగనే నేను చేసేతల త్రోసిపుచ్చిన జీవితానందము జ్ఞప్తికివచ్చి పశ్చాత్తాపముతోడి హృదయ వేదనను కలిగించెను. వారిని వేడుకొనుట నాకు తగని పనియే యైనను, నా మనోవ్యథ లెల్ల ఆ నీగ్రోలతో వెళ్ళబోసుకొనకుండ ఉండలేకపోతిని. "అన్నలారా! ఇరువది యేండ్ల యీ యెలప్రాయమున నాకు ప్రాణపదమై, నన్ను ప్రాణాధికునిగా నెంచుకొను ప్రియురాలిని బాసి, ఆమె హృదయమున ఎన్నటను చల్లారని చిచ్చు

దాకొల్పి, యిట్లు అకాలమరణమునోట బడుట యెంత కష్టము" అంటిని.

నే నట్లు వాపోవుచుండ మూర్తీభవించిన మాయయు, సాక్షాత్కరించిన దుష్టపిశాచమును అనదగిన ఆ మాంత్రికుడు నన్ను సమీపింప వచ్చి, పకాలున సెలవివార నవ్వుచు "హిం హిం హిం? నీకును ప్రాణముమీద తీపియేనా? చావనిన నీకు భయము లేదేమో యని నేను దిగులు పడుచుంటిని సుమీ" యనెను.

నే నింతకు మున్నెన్నియో సారులు వినిన ఆనవ్వే! నా జ్ఞప్తికి అందని ఆ కంఠధ్వనియే! "దుష్టుడా! ఎవడవురా! నీవు" అని అరచితిని. వాడును పుంజీభవించిన క్రోధముతో "నేనెవడనో నీకిప్పుడు తెలియదులే!" అనుచు తన వక్షమును సగము కప్పి యున్న ఆ రజత సూర్యఫలకమును తొలగించి "ఇదిగో! చూడుము" అనెను.

నేను ముందునకు వంగి చూతునుగదా రోమశమగు వాని వక్షమున వాతలు పెట్టిన పేర్లు రెండు కాన్పించెను. అందొకటి "ఎఫింగము", రెండవది నామామ పేరు. అది గాంచి నేను రిచ్చ వడితిని.

వాడు నామోము తేరిపారజూచి "లియోపాల్డ్ అవర్నీ! ఇపుడైన తెలిసెనా నేనెవడనో?" అని ప్రశ్నించెను.

వాడట్లు నాపేరు నుడువుట మరియు సహజమై, వాడెవ్వడు కానోపునోయని జ్ఞప్తి కెలయించుకొనుచు, "తెలియలేదు. ఈ పేర్లు రెండును నామామకడ నుండు విదూషకుని

రొమ్మున నుండెడివి. పాపము, వాడు మరణించెను. అదియును గాక వాడు మా కెంతయు విశ్వాస పాత్రుడు. కావున నీవా హెబ్రిబావు కావనుట స్పష్టము." అని వానితో నంటిని.

"వాడుగాక మరియెవ్వడను ?" అని అరచుచు వాడు తన మొగముపై నున్న ముసుగు తొలగింప హెబ్రిబావికృతాకారము ప్రత్యక్షమయ్యెను. కాని తొల్లి వాని మొగమున నిత్యము తాండవించు వెకిలినవ్వు ఇపుడు లేదు. వాని చూపులును, ముఖమును క్రూరములై భయంకరములై కన్పట్టు చుండెను. నేనాశ్చర్యము పట్టజాలక "దైవమా ! ఇదియేమి మాయ ! చచ్చిన వారెల్ల బ్రతికి వచ్చుచుండిరా ! వీడు మా మామ కడనుండు హాస్యగాడే! హెబ్రిబావు!" అని యరచితిని.

వాడు : "వట్టి హాస్యగాడనే కాదు. మీ మామపాలిటి మారిని గూడ.

నేను : (గుండె జల్లన) ఓరీ!పాపీ!ఎంతపని చేసితివిరా? ఆయన పాలిటి మారివైతివటరా ? కృతఘ్నుడా ! నిన్ను దయతో పోషించిన దానికి తగిన —

వాడు : (అర్ధోక్తిలో) దయతో పోషించిన దానికా ? అవమానించిన దాని కనుము !

నేను : ఆపోటు నీవు పొడిచిన దేనా ? తుచ్ఛుడా !

వాడు : అవును. పొడుచుటలో గూడ, కత్తి గుండియ లీపలినుండి ఆవలికి వచ్చి పోవునట్లు పొడిచితిని. నిద్రించు వానిని నిద్రించు చున్నట్లే పరలోకమునకు సాగనంపితిని. నీ మామ "హెబ్రిబా ! ఎచట నుంటివిరా !" అని మూలుగుచు

ఊపిరివిడచెను. పాపము, నేనంతకు మున్నే సిద్ధమైయుంటినని ఆతడెరుగ డయ్యెను.

ఈహత్యాకాండ యెల్ల చెక్కు చెదరక వినిపించు చున్న వాని మాటలు భరింపలేక నేను "నీచుడా! కసాయి పందా! ఎట్లుమరచితివిరా, ఆయన అనుగ్రహమెల్ల? ఆయన పెట్టిన యెంగిలి తిని, ఆయనపాదముల చెంత బడియుండి——"

వాడు: కుక్కవలెకాదూ? అవును, నీవు అనుగ్రహ మని చెప్పుచున్నావే, దానినే నేను అవమాన మందును. అందుకే వానికి తగిన శాస్తి చేసితిని. నీకును అట్లే కావింప నున్నాను! ఇంకచూడు! నీయుద్దేశమేమి? నేను సంకరుడను, విరూపుడను ఐనంతమాత్రమున మనుజుడను కాననుకొంటివా? నీవంటి ఆత్మయే నాకును గలదుసుమా! నేనిపుడు సుకుమార దేహమునుండి తొలగింపనున్న నీ యాత్మకంటె, నా యాత్మ యెక్కుడు దార్ఢ్యము, గాంభీర్యము, ధైర్యమును గలదని యెరుంగుము. నీ మామకు నేను పెంపుడు కోతిని, నవ్వుల బండిని. నేనాతనికి వినోదము కల్పింప, ఆతడు నన్నేవగించుకొనెడివాడు. ఇదియే కాదూ ఆతనికి నాపై గల యనుగ్రహము? నిజమే. అనుగ్రహము కాదామరి! ఆతడు నన్ను హృదయమున బెట్టుకొనెను. అవును. ఒకవంక పెంపుడు కోతిని, ఇంకొకవంక పెంపుడు చిలుకను, మధ్య నన్ను; ఆ హృదయమున నంతకంటె మంచిచోటు వెదకికొన్నది సుమీ నా బాను.

నాకీ మాటలు విన వణకు పుట్టుచుండెను.

వాడు : (అంతట తనివిసనక) అవును. నిజమే. అది యెల్ల చేసిన వాడను నేనే. మంచిది కాని లియోపాల్డ్ అవర్నీ— ఏదీ, ఒకసారి నా మొగము వంక తేరిచూడుము; ఈ మొగము జూచి మున్నెన్నిమారులో నవ్వితివి కాదూ? మంచిది. ఇపుడా మొగమే చూచి గజగజ లాడుము. నీ మామ యను గ్రహమెల్ల నాకడ చెప్పవచ్చితివా? సెబాసు. అంతకన్న నైచ్యము నాకు వేరొకటి లేదు. నేను ద్వారములో నుండగనే పగులబడి నవ్వలేదా? ఆ పకపకలే నాకెదురోలా? నా వికృతాకారము, నా చూపు, వేషము,—అన్నిటికీ నవ్వేనా? దిక్కుమాలిన నీ మామయు, వాని దిక్కుమాలిన స్నేహితులు నన్ను చూచి అట్లు నవ్వుచుండ, నేను నోరు మూసికొని ఊరకొనుటకైనను నోచనా? వారితో కూడి నన్ను నేను వెక్కిరించుకొనుటయా? ఇవియెల్ల తలచికొనిన నాకుక్రోధము పొంగి నురుగులు కట్టుచున్నది. నీయూహమేమి: నన్నింత అవమానము చేసి, నా బ్రతుకు రోత గావించిన నీ మాతుల హతకునిపై నే జాలి తలపవలయు ననియా? వాని నేమి చేసిన నా కసి దీరును? మధ్యాహ్నపు టెండలో మలమల మాడుచు, కాళ్ళ సంకెళ్ళతో వీపున కొరడా దెబ్బలతో పాటు పడు బానిసల బ్రతుకు నా బ్రతుకుకన్న నయము.

ఆ హేయ జీవనము, ఆ నికృష్టపు బ్రతుకు, ఆ నైచ్యము,నా హృదయమును యథాయథలు గావించి యెట్లు మెరుముచున్నవో, నాయెదలో నెట్టి ద్వేషాగ్ని రగులుచున్నదో నీ కేమి తెలియును ? నా యెదపైనున్న యీ వాతలైన

మానునుగాని, నా మొకలోని పరాభవాగ్ని చల్లారదు. నేను పడిన ఈ బాధలన్నింటికి నేను ప్రతిక్రియ సేయ గలిగితిని? ఇట్టి పోడువ అట్టె ప్రాణము విడిచెనే కాని; బాధయా? ఏమువా? ఏమియును లేదు. వత్సరములకొలది నే ననుభవించిన యాతనకు తగిన ప్రతీకార మొనర్ప లేకపోతిని. చచ్చుటకు ముందు, పరాభవ దుఃఖ మెంత దారుణమో తెలిసికొనకుండగనే, ఎప్పుడును ఇకిలించుచు కూర్చుండవలసిన సిగ్గడితన మెంతటి వ్యథాపాదకమో యెరుగకుండగనే చచ్చినవానిపై నా పగ యేమి తీరినట్లు? అవమాన దుఃఖమున ఎడద కుమిలిపోవ, ఇన్నిన్నాళ్ళు ఓర్చి యోర్చి, ప్రతిక్రియా నిర్వాహణము కొరకు ఇన్నిన్నాళ్లు వేచి వేచి, తుదకు అదను దొరకునప్పటికి ఒక్క బాకుపోటుతోనా, నా పగ తీర్చుకొనుట? పోనీ, పొడిచిన వాడెవ్వడో యెరిగియైన చచ్చెనా? అటులైనను నాకు కొంత దుఃఖోపశమన మయ్యెడిది. ఆ భాగ్యము కూడ లేదాయె. ఎప్పుడు చచ్చునా యనుత తరమున బాకు నిల్పకుండ నంట బొడిచితిని. ఆ పోటుతోనే యూలెను. నన్ను గు ర్తింప కుండగనే యూలెను. నిర్భాగ్యుడను, నా తొందరయే నన్ను పాడుచేసి నా కసితీరకుండ చేసెను. ఇంక ఈసారి నిన్నుమాత్ర మట్లు చేయను. పగ తుద ముట్ట తీర్పవలసిన దే. ఇదిగో, ఇటు చూడుము. నీవు నన్నెరుగుదువు కాదూ? ఈ నావింత వేషము నీకు క్రొత్తయై యుండ వచ్చును. తొల్లి నే నెప్పుడును నవ్వుచు త్రుళ్ళి పడుచుండుట మాత్ర మెరుగుదువు. ఇప్పుడట్లుగాదు, నా నిజస్వభావము

దోపకుండ దాచుకొన వలసిన యవసర మేమియు నాకిపుడు లేదు. కాన నేను మునుపటివలె లేను. నిజమే, మున్ను నీవు చూచినది నా మారుమోము. ఇపుడు చూచుము నా యచ్చపు మొగము.

ఈ మాట లనునపుడు నిజముగ భయంకరమై యుండెను.

నేను : రాక్షసుడా! నీవు పౌరపడు చుంటివిగాని యిప్పటికిని నీ మొగమున వీరముకన్న హాస్యమే బాగుగ ఘటితమగుచున్నది. నీ హృదయమున క్రౌర్యముకన్న అన్య మేమియు లేదు.

వాడు : నా క్రౌర్యమున కేమిగాని, నీ మామనొక్క—

నేను : తుచ్ఛుడా! నా మామ క్రౌర్యమునకుకూడ మూలము నీవేకదా? మందభాగ్యులగు ఆ బానిసల దురవస్థ కిప్పుడింతగా వగచువాడవు అపుడేల యూరకొంటివి? ఎన్నడైన నీ యజమానికి జాలి పుట్టించు ఒక్కమాట యాడిన పాపమున బోయితివా? ఒక్కమారైన వారి పక్షమున మాటాడి యెరుగుదువా?

వాడు : నాకేమంత యవసరము? నా యెత్తు ధనము పోసినను, తెల్లవాడు తన క్రూరతచే తాను నాశనమగుచుండ నే నడ్డము సెప్పుదునా? 'బానిసల నింకను శిక్షింపుము' అని నాశక్తికొలది రెచ్చగొట్టి, మీ పాపఫలము శీఘ్రముగా పండ జేయుట నాపనిగాని అడ్డము పోవుటకాదు. ఇది యెల్లనప్పటికి

కీడుగా శోధించియు తుదకు మావారికి మేలుగా పరిణమించు టకే చేసితినని యెరుగుము.

ఇంక వానికి నేనేమి బదులు చెప్పగలను? ఇంత తంత్రము పన్ని నేర్చిన ఆక్షుద్రుని జిత్తులమారి తనమునకు నేను రిచ్చవడి నిలువ, వాడు మరల నిట్లనియె.

"కావున నా కార్యఖడ్గ దక్షత నీకిప్పటికైన బోధపడి నదా? ఇప్పుడు చెప్పుము; విదూషకుడగు హెబ్రిబాను గూర్చి నీ యభిప్రాయమేమో? నీ మామగారి హాస్యగాడు ఎటువంటి వాడో యిపుడెరిగితివి కాదా?"

నేనింక వినలేక, "ఇంత చక్కగా మొదలిడిన పనిని పూర్తిచేయక, మాచెదవేమి? కానిమ్ము. నన్నుకూడ తుద ముట్టింపుము. వృథాకాలయాపన మెందులకు" అంటిని.

వాడు : అదియేమిమాట? ఈ ఆలస్యమెల్ల కావలయు ననియే చేయుచుంటినేమో? తెగీతెగని యీ మొండికత్తి కోతతో నీ ఆవేదన, కష్టముట్ట నీయకుండుటయే నా యభీష్ట మని యెంచుకొనరాదా? మొన్నటి కొల్లలాటలో నాకును భాగము రావలసి యుండెను. నీవు మా స్కంధావారమున నా కంట బడగనే నిన్ను నా వంతుక్రిందవోసగుమని బైసో నడిగితిని. ఆతడును సంతోషపూర్వకముగా నిన్ను నా కొస గెను. నీవింక నాసొమ్మైతివి కావున నీతో నించుక వినోదించు చుంటినే కాని వేరుగాదు. తొందరయేల? ఇదిగో, ఇప్పుడే ఆ ప్రవాహమార్గమున పాతాళమున కేగుదువులే. నిన్నటకు బంపుటకు ముందు నీతో ఒక్కమాట చెప్పవలసియున్నది. నీ

భార్య దాగియున్నచోటుకూడ నే కనుగొంటిని. అందులకే 'అడవికి చిచ్చుపెట్టు'మని బైసోతో చెప్పితిని. ఈపాటికా పనియు దీరియుండును. అంతటితో మీ కుటుంబము భూమిపై ఊడ్చిపెట్టుకొని పోయినట్లగును. నీమామకు కత్తి—నీ పెండ్లమునకు నిప్పు— నీకు నీరు బలిబలి!!

"రాక్షసుడా! రాక్షసుడా!" అని యరచుచు నేను వాని కంఠము నులిమి చంపవలయునని వానిపై కేగబోవ, వాడు చేసన్నచే నీగ్రోల చేరబిలిచి "వీనిని బంధింపుడు. మృత్యుముఖమున బడుటకు వేగిర పడుచున్నాడు" అనెను.

వారు నన్ను పాశబద్ధుని గావించిరి. అంతలో దవ్వుల నెచటియో కుక్క మొరుగువలె వినవచ్చెను. ఆ జలపాత ధ్వనియే నాకట్టి భ్రాంతిని కలిగించెనేమో!

బంధితుడనైన నన్నా అగాధప్రవాహమున పడద్రోయుటకు నీగ్రోలొడ్డునకు గొంపోయిరి. ఆ కుటిల కుబ్జుడు చేతులు కట్టుకొని ఘోరతరమగు పరమానందమున నాపాటు చూచుచుండెను. అక్కసు తీర్చుకొనుచున్న వాని యానందమును చూడలేక, తుదిమారు విసిలాకాశమును కన్నులార గాంచుటకు పైకప్పులోని వివరము వంకకు జూచితిని. నేనట్లు చూచుచుండగనే ఇందాక విన్న కుక్క మొరుగు మరియు స్పష్టముగా వినిపించి, మరు నిముషమున ఆ రంధ్రములో నుండి రాస్కు గండుమొగము కనిపించెను. నాకు వణకుపుట్టెను.

అంత ఆ గుజ్జు "ఊఁ! కానిండు" అని కేక వేయ, హోరుమని మ్రోయు జలవేగమున త్రుళ్ళింతలిడుచున్న ఆ నరక

కూపములో పడవైచుటకు నీగ్రోలు నన్ను చేతులపై నెత్తుకొనిరి. వారా కుక్కను చూడలేదు.

# 48

"అన్నలారా !" అని మేఘ గర్జనమువంటి పిలుపొకటి వినవచ్చెను. అందరము ఆ ధ్వని వీతెంచిన దిక్కునకు చూచితిమి. ఆ రంధ్రము వొద్దున, శిరమున నూగులాడు ఎఱ్ఱ తురాయితో బగ్ జార్గల్ నిలిచియుండెను.

మరల నాతడు "అన్నలారా ! ఆగుడు" అనెను. అంతట నీగ్రోలు భక్తిపూర్వకముగా నేలపై సాగిలబడిరి.

బగ్ : నేను బగ్ జార్గలును !

నీగ్రోలేవియో కేక లిడుచు తలలు నేలబెట్టి కొట్టుకొనుచుండిరి.

బగ్ : ఆతని కట్లు విప్పుడు.

తలవని తలంపుగా వచ్చిన బగ్ జార్గల్ రాకచే, ఇంతదనుక దిచ్చవడి నిలిచిన కుబ్జుడు అప్పటికి తేరుకొని, నా కట్టుత్రాళ్ళు విప్పుటకు సిద్ధమగుచున్న నీగ్రో చేయిపట్టుకొని నిలిపి, "ఏమురా ఇది ? ఏమి చేయుచున్నావు ?" అని గద్దించి, బగ్ జార్గల్ వంక తిరిగి, "మారన్ రూజీ నాయకుడా ! ఏమి పనిమీద వచ్చితివి ?" అని బిగ్గరగా అడిగెను.

బగ్ : నా సైనికులను ఆజ్ఞాపింప వచ్చితిని.

హెబిబ్రా: (కంఠపూర్తియగు క్రోధముతో) వీరు నీ దండులోని వారగుట నిజమే, కాని, నా ఖైదీజోలి నీ కేల ?

బగ్ : నేను బగ్ జార్గలును.

నీగ్రోలు మరల తలలు నేలకు తాటింప మొదలిడిరి.

హెంబి : బైసో ఆజ్ఞలను బగ్ జార్గల్ అడ్డజాలడు. ఆతడు ఈ తెల్లవానిని నా కొసగెను. నేను వీనిని చంపగోరితిని. చంపుదును. వీడు చచ్చును. (నీగ్రోల నుద్దేశించి) చూచెద రేమిరా? ద్రోయుడు వీని నా గుండమున.

సుపరిచితములగు ఆ మాంత్రికుని మాటలకు వారు మరల లేచి నా దెస కొక యడుగు వైచిరి. ఇక నా పని యైన దనుకొంటిని.

బగ్ : (గొంతెత్తి) విప్పుడు బంధితుని కట్లు.

ఒక్క క్షణములో నేను బంధవిముక్తుడనైతిని. అప్పటి నా యక్కజమునకు ఆ కుబ్జునకు వచ్చిన కోపమేసాటి. వాడు నాపై కురుకబోవ నీగ్రో లడ్డుపడిరి. వారిని వారింపలేక వాడు తిట్లు, బెదరింపులు మొదలిడెను.

హెంబి : తుచ్ఛులారా! నామాట కెదురుసేయుదురా? ఇంత యెడలు మరచితిరా! కానిండు. ఇంతకు నేను ఈ దుర్జాతుని ఒక్కమొగి నీటద్రోచి, జలచరముల పాలుసేయక, వృథా సంభాషణమున కాలహరణము సేయనేల? నా అక్కసు తుద ముట్ట దీరుననుకొంటిని గాని, యిట్లు మొదటికే మోసము వచ్చుట యెరుగనైతినిగా! మిమ్ము సైతాను మ్రింగ! ఇటు వినుడు. నా మాట విని వీనిని నీట ద్రోయరైతిరేని మిమ్ము శపింతును. మీ తలలు నరసిపోను! బ్రతికియుండగనే మిమ్ము ఈగలు దోమలు మెసవ! మీ కాలు సేతులు పడిపోను! మీ

యూర్పులకు మీ గొంతులు మాడి మసిగాను ! మీ నాకు పోగా లము రాను ! మీరు చచ్చి చాపరాళ్ళగాను ! నా మాట లక్ష్యము సేయరుగా ?"

ఆ వింత నేమని వర్ణింతును ? ఆ చీకటి గుహాలో నే నొక్కడనే తెల్లవాడను. పిశాచములవంటి నీగ్రోలు చుట్టు ముట్టి యుండగా, ఆ భయంకర నరకకూపమున త్రాసుముల్లు వలె వెనుక ముందాడు చుంటిని. ఒకవంక వికృతాకారుడగు ఆ గుజ్జు మాంత్రికుడు, గుడ్డి వెలుతురులో ఎట్లో కాన్పించు ఆ గిరల యంగితో, గోపురమువంటి ఆ కుళ్ళాయితో, నన్ను మాటిమాటికి భయపెట్టుచుండ, రెండవవంక ఆ గ్రుడ్డి వెలు తురునకు ఏకమాత్ర ప్రవేశమగు ఆ రంధ్రము ఒద్దున నిలిచి యున్న నిమ్నతాకారుడగు ఆ నీగ్రో నాయకు డభయ మొసగు చుండెను. అప్పటి నా యవస్థ నేమి చెప్పుదును ! సైతాను కింకరులును, దేవదూతలును, "మాకు మాకు" అని నా కొరకు పెనగులాడుచుండ, నా యాత్మకు మోక్షమే వచ్చునో, నాశమే యెదవునో అని నేను మృత్యుద్వారమున నిలిచి ఊరక చూచుచున్నవానివలె నుంటిని. ఆ మాయల మారి కుబ్జుడును తన శాపములు కా నీగ్రో లొకింత బెదరుట గాంచి యిదే యదనని, "నేనా తెల్లవాని చావు గోరు చున్నాను. వాడు చచ్చితీరును, నామాట వినుడు. కానిండు" అని హెచ్చరింపజొచ్చెను.

బగ్ జార్గల్ ఆ మాట యాలకించి. ప్రశాంత గంభీర ముగా నిట్లనెను. "ఆతడు బ్రతుకును. నేను బగ్ జార్గలును.

ఇంటిముంగిట ఆసీనుడై ధర్మ పరిపాలన సల్పిన కాకాంగో రేడు నా తండ్రి"

నీగ్రోలు మరల ఫాలములు నేల మోవ సాగిలబడిరి. బగ్ జార్గల్ మరల నిట్లనెను; "అన్నలారా! మీరేగి బైసాతో వచింపుడు. 'ఈతని మరణ సూచకమగు నల్ల జెండాను పర్వత శిఖరమున నెత్తవల'దని; ఈతడు బగ్ జార్గలునకు ప్రాణదాత. ఈతడు బ్రతికియుండుట బగ్ జార్గల్ యొక్క అభీష్టము."

వారు లేచి నిలిచిరి. బగ్ జార్గల్ తన శిరమున చెరివిన ఎఱ్ఱతురాయిని వారిచెంత బడునట్లు పైనుండి విసరెను. వారు దానిని భక్తిపూర్వకముగా కనుల కద్దుకొని, మెదలకుండ అచ్చోటు తొలగి పోయిరి. చురచుర చూచుచు హెబ్రిబా వారి వెంటబడెను.

అప్పటి నాచిత్తవృత్తి మీకు విప్పి చెప్ప జాలను. పైనుండి ప్రేమయు, కనికరమును జాలుకొను చూపుల నన్ను గనుచున్న బగ్ జార్గల్ దెస, బాష్పార్ద్రములగు నా చూపులు నిలిపి చూచితిని.

"తమ్ముడా! దైవానుగ్రహమున బ్రతికితివి. నీవిటకు వచ్చిన దారినే మరలిరమ్ము. నేనా లోయలో నుందును." అని నాకు చేయివిచి బగ్ జార్గల్ అంతర్హితు డయ్యెను.

## 49

నా సత్తువ నంతను పీల్చిపిప్పిచేసిన ఆ గుహనుండి బయటపడి, ఏరిముఖమున నాకై వేచియుండు నా ప్రాణరక్షకుని

చేతులలో ఎప్పుడు పడుదునా, అంత యాదృచ్ఛికముగా ఏ దైవము నా మిత్రుని నా ప్రాణరక్షణార్థ మచ్చటికి బంపెనో, ఆతని నోట ఎప్పుడు విందునా యను తహతహతో ఆ లోయ దారిని రెండడుగులు వేయునంతలో తలవని తలంపుగా గొప్ప ప్రతిబంధక మొకటి తటస్థించెను.

పరమ కుత్సితుడైన ఆ హెబ్రిబా నే ననుకొన్నట్లు నీగ్రోలతో కలిసి వెడలిపోలేదు. కసితీరని కడుపుమంటతో ఒక పెద్దరాతిబండ చాటున పొంచియుండి, తటాలున అదియే అదనని నా ఎదుటపడెను. సిలువగా నుపయోగించు పిడికత్తి చేత ఝళిపించుచు, చీకట్లు గ్రక్కునొక్క విషపునవ్వు నవ్వి, వాడు నన్ను దరియరాగా నేను రెండడుగులు వెనకకు వైచితిని.

"ఆ! నీ దుంపతెగ! నన్ను తప్పించుకొని పోయితినని కులుకుచున్నావా? నేను నీవనుకొన్నంత పిచ్చివాడనుగాను, ఇదిగో నాచేత చిక్కితివి. ఈ తూరియిక నాలసింపను. నీకై నీ మిత్రుడెంతోసేపు వేచియుండ నక్కరలేదు. శరవేగమున పారు ఈ ప్రవాహము, నిన్ను కనురెప్పపాటులో వానిచెంతకు గొని పోగలదులెమ్ము" అనుచు కత్తి యెత్తికొని నామీఁది కురికెను.

"ఓరీ! పెనుభూతమా! ఇంతదనుక నీవు హంతవే యనుకొంటిని. ఇప్పుడు కసాయివి కూడ నైతివా?" అని చీ కొట్టి నేనారాతి యరుగుపై కొదిగితిని.

వాడు "నేను ప్రతీకార నిరతుడ"నని పండ్లు పటపట నూరుచు, అగాధపు టొడ్డున కాలూది నిలిచియున్న నన్నందు

త్రోయనెంచి కాబోలు, కత్తియెత్తి నాపై బడవచ్చెను. దైవవశమున నేనా వ్రేటు తప్పించుకొనుటయు, ప్రాకుడువట్టి, సంతత జలధారలచే నునుపు దేరియున్న ఆ యొడ్డున కాలుజారి "మయ్యో! మొఱ్రో" యనుచు వాడే అందుకూలెను. ఇంతకు మున్నే చెప్పితిని గదా! మునిసిన పెద్దమ్రాను వ్రేళ్లు ఆ యగాధపుటంచున క్రిందికి దిగియున్నవని; అట్లుకూలుటలో, వాని యంగీ ఆ వ్రేళ్ళలో మెలివడి చిక్కుకొనుటచే హతాశు డగు వాడు ఆ వ్రేళ్ళ నాధారముగాగొని వ్రేలాడ దొడగెను. పట్టు బాగుగా చిక్కుటకు, చేతిలోని కత్తివిడువవలసి వచ్చెను. అంతకుమున్న తలపైనుండి జారిపడిన కుళ్ళాయితో గూడ కత్తియు ఆ ప్రవాహమున బడి మరల కానరాలేదు.

ఇట్లు, చెట్టువ్రేళ్లు పట్టుకొని నీళ్ళలో వ్రేలాడుచు, ఎట్లని ఒడ్డెక్క వలెనని, వాడు పడగలపాట్లు పడెనుగాని, వాని కురుచ చేతుల కాయంచు అందక కఠినమైన రాతిని ఒరసి గోళ్ళుకూడ బ్రద్దలయ్యెను. సర్వ విధముల విఫల మనోరథుడై వాడు పులివలె గాండ్రింప ఆస్థితిలో నేను వ్రేలితో నించుక కదలించిన చాలును, వాడా ప్రవాహమునబడి మునిగిపోయెడి వాడు. కాని అట్టి తుచ్ఛపు పనిచేయ మనసు గొల్పక నేను మిన్నక నిలిచియుండ, నన్ను జూచివాడు అక్కజ మంద జొచ్చెను. నేనును కరుణామయుండగు ఈశ్వరుని కొని యాడుచు కొంతవడి యట్లేనిలిచి 'వాని కర్మము వానిది. నాకేల' యని ఆచోటు బాసిపోవ సాగుచుండ, ఆ దీనుడు భయ కంపితుడై, జలాంతర్భాగము నుండి వెడలుచున్నదో యన

నొప్పు నెలుగుతో నిట్లు విలపింప దొడగెను. "ప్రభూ ! పోకుము, పోకుము. నీకు పుణ్యముండును. ఇంచుక చేయూత యొసగి యీద్రోహిని బ్రతికింపక మృత్యువున కొప్పగించి పోయెదవా? అయ్యో! నా ప్రాణము పోవుచున్నది! నా సత్తువ యుడిగినది, చేతులు పట్టు వదలుచున్నవి, చెట్ల వ్రేళ్ళు జారుచున్నవి. నాశరీర భారము నన్ను క్రిందికి లాగుచున్నది. నేనింక పట్టుపట్టలేను. నా భుజములు విరిగిపోవుచున్నవి. అయ్యో ! స్వామీ! దయలేదా ప్రభూ? భయంకరమైన ఈ అఖాతము నురుగులు గ్రక్కుచు నన్ను కబళింప నున్నది. మీ పూర్వ విదూషకునిపై నీకు కనికరములేదా ? నేను దుర్మార్గుడను; నిజమే, కాని మా సంకరుల కంటె మీ తెల్లవారే సర్వవిధముల నుత్తములు, దయాపరులని లోకము కొనియాడునట్లు చేయుము. నన్ను రక్షింపుము."

ఈ విలాపము విని నేను, వానికి కొంచెము దాపుగా నేగితిని. గుహోపరి రంధ్రమునుండి ప్రసరించు రశ్మి కిరణము వెలుగున తేరిపారజూతునుగదా, స్వాభావికముగ నసహ్యము గొల్పెడి వాని మోమున మున్నెన్నడు నేను చూచియుండని అనుతాప సంతాపములు కానవచ్చుచుండెను.

జాలి పెంపున నామది కరగినదిగా గ్రహించి, వాడు కొంచె మాశ తెచ్చుకొని, మరలనిట్లని వేడదొడగెను. "లియోపాల్డుబాబూ ! తోడిప్రాణి యిట్టి విపద్దశలో నుండ ఊరక చూచెదవేమి ? కొంచెము కేలూత యొసగలేవా? చేయి అందిచ్చిన చాలును. దాని యాధారమున బైట పడెదను. ఈ

మాత్రము సాయము చేయుము. చాలును. నేనెంత దుర్మార్గుడనో, అంత కృతజ్ఞుడనని కూడ ననిపించుకొందును."

నేను "దిక్కుమాలిన వాడా ! నీ దుర్మార్గములను నా తలపునకు దీసికొని రాకుము" అంటిని.

వాడు "వానిని గూర్చి పశ్చాత్తాపము కలిగి అవి తడవితిని. అయ్యో ! దయ తలపుము. దైవమా ! నా చేయిజారి పోవుచున్నది. నేనిక నిలువలేను బాబూ ! నీచేయి యిమ్ము- నీచేయి_ నిన్ను నవమాసములు మోసి కన్న మీా తల్లి మీాద ఒట్టు. చేయి అందిమ్ము" అని పరితపించెను.

హృదయవిదారకములగు వాని దీనాలాపము లిక నేను వర్ణింపజాలను.ఆ విపత్సమయమున వాని పాపకర్మము లెవ్వియు నా తలపునకు రాలేదు. వాడింక నాకు శత్రువు కాడు; ద్రోహియును కాడు, హంతయును గాడు; ఘోర దుర్మరణము నుండి బైటపడుటకు ఇంచుక చేయూత వేడుచున్న ఆర్తుడు. రాళ్ళు కరుగ వాపోవుచున్న వానిని తొల్లిటి పాపము లుగ్గడించి నిందించుట కది సమయము కాదు. ఒక్కక్షణ మాలసించినచో వాడీ లోకమును బాయును.

నేనా గుండము నొడ్డున మోకాళ్ళనాన్చి, ఒకచేత ఆ చెట్టు మొదలు గ్రహించి, లోనికి వంగి, రెండవచేయి హెబ్రా కందించితిని.

నాచేయి యందుకొని ఆ దుర్జాతు డేమి చేసె ననుకొంటిరి ? అంతకుమున్ను పట్టుకొనిన చెట్టువ్రేళ్ళను వదలి, రెండు చేతులతో నా చేయి గట్టిగా పట్టుకొని, కాళ్ళను రాతిగోడకు

తన్నిపట్టి, తన సత్తువకొలది నన్ను లోనికి గుంజ దొడగెను. తన్ను పైకిలాగుట కనువొసగుటకు మారు వాడు చేసినపని చూడుడు! నేనా తెరుస్కంధమును గట్టిగా నవలంబించితిని గాన సరిపోయెగాని, లేనిచో తలక్రిందుగా ఆ గుండమున కూలియుందును.

నే నది గాంచి "ఇది ఏమిరా? పాపకర్ముడా!" అంటిని. వాడును, పిశాచమువలె వికటహాసము సల్పుచు "ఏమియు లేదు. నా పగ తీర్చుకొనుచుంటిని. వెఱ్ఱివాడా! మరల నాచేత చిక్కితివి; ఇంకెందు పోగలవు? అదృష్టముచే బ్రతికి బైట పడినవాడవు మరల బుద్ధిపూర్వకముగా, అధః పతితుడనగుచున్న నా చేత బడితివి. బుసకొట్టి, బుసకొట్టి తుద కేడ్పు మొదలిడిన కొండచిలువనోట మరల తలదూర్చి తివి. ఇక నేను చచ్చినను చింతలేదు. నా పగ తీరుచున్నది. నా కదియే చాలును. మిత్రి బోనులో పడితివి. నీతోగూడి యింక ఈ జలచరములకు నిశ్చింతగా ఆహార మగుదును." అనుచు నన్ను గుంజుచుండెను.

బలముకొలది వానిపట్టు విడిపించుకొన పెనగుచు "ఎంత పాపము తలపెట్టితివిరా? విశ్వాస ఘాతకుడా! పున్నెమునకు బోయిన పాప మెదురయ్యె ననునట్లు చేయుదు వటరా?" అంటిని.

"నిజమే. ఇపుడు మన మిరువురము బ్రతికి బైటపడ వచ్చును. నే నది యెరుంగుదును. కాని యంతకన్న మన మిరువురము జంటగా చచ్చుటయే నా కభీష్టము. నా ప్రాణముల

రాకకంటె, నీ ప్రాణములపోక కనులార గాంచుటయే నాకు పండువు. రమ్ము. లోనికి రమ్ము" అని పలుకుచు వాడంత కంతకు ఇనుమడించిన సత్తువతో కనులు నిప్పులురాల, నోట నురుపులు గ్రమ్మ, నన్ను లోనికి గుంజదొడగెను. అంతకు మున్ను 'ప్రాణము పోవుచున్న'దని యేడ్చిన ఆ రాక్షసునకు పగ దీరుచున్నదను నాశ వేయి మడుగుల శక్తి నొసగ బోలును. చెట్టువ్రేళ్ళతో పెనగొనియున్న వాని యంగి, యింకను నట్లె మెలివడి యున్నది. ఎట్లయిన నా మెలిక తప్పించిన, నన్నింకను గట్టిగా లోనికి లాగవచ్చునని, వాడు పడగల పాట్లెల్ల పడుచు, అంతకంతకు నుత్కటమగు క్రోధ మున ఎడనెడ నా చేతులు కరచుచు, పెద్దపులివలె గోండ్రించు చుండెను. ఆ భయంకరాఖాత నివాసియగు పెనుభూత మేదియో, తనచేత చిక్కిన యెరను, ఆ చీకటికూపములోనికి ఈడ్చుకొని పోవదొడగు నట్లుండెను.

అదృష్టవశమున నా యెడమ మోకాలు ఆ రాతి బండలోగల చిన్న గుంటలో పాదుకొనెను. అదియె బాసటగా చెట్టుమొదలు గట్టిగా పట్టుకొని, ఆ రాక్షసుని పట్టు విడిపించు కొనవలయునను ప్రాణభరణాతురతచే క్రొత్తబలము చేకూర శ్రమపడజొచ్చితిని. మధ్య మధ్య నూపిరి తెచ్చుకొని గుండెలు బ్రద్దలగునట్లు, బగ్‌జార్గల్ ! ఓ బగ్‌జార్గల్" అని ఆసమై ఆక్రోశించుచుంటినే కాని, ఆత డెంత దవ్వున నున్నాడో యేమో. ఆ ప్రవాహపు హోరులో నా కూత ఆతనికెట్లు విన బడును ?

నే నంతగా పెనగుటకు అక్కజం పడుచు ఆ గుజ్జు రక్కసి, ద్విగుణీకృతోత్సాహమున హుమ్మని గుంజుచుండెను. నాకును శక్తి క్షీణింప దొడగెను. నేనిపుడు చెప్పినంత సేపైనను మేము పెనగలేదు. అట్లయ్యు నా చేయి కొంచెము చచ్చుపడ జొచ్చెను. కనులు తిరుగుటయు, చెవులు గింగురుమనుటయు మొదలిడెను. జవజవమను చెట్టువ్రేళ్ళ చప్పుళ్లును, కహాకహామను ఆ రక్కసి వికటహాసమును, గింగురుమను నా చెవుల బడుచుండెను. గుండములోని నీరు నన్ను వేగముగా మ్రింగి పొట్టబెట్టుకొనుటకు పైకి వచ్చుచున్నట్లుండెను. పూర్ణముగా నిరాశ చేసికొనుటకు మున్ను, శేషించిన శక్తి లేశము నొక్కపరి కూడదీసికొని ? తుదిసారి యొక్కగుంజు గుంజి, మరల ఒక్కసారి "అన్నా ! బగ్ జార్గల్ !" అని యరచితిని.

నా యార్తనాదమునకు రాస్కు బదులు మొరుగుట వినవచ్చి పైకి చూచితిని. రాస్కుతో బగ్ జార్గల్ పైన ప్రత్యక్షమయ్యెను. ఆతడు నా నీరసించుట కనిపెట్టి "పట్టు విడువకు, పట్టు విడువకు భయములేదు" అని ప్రోత్సహించెను.

హెబిబ్రా ఇదిజూచి, నేను తనచేయి జారిపోవుదునేమో యను భయమున అలౌకిక శక్తితో "పదు. ఊ. పదు" అని లాగజొచ్చెను.

ఇక నిలువ జాలక పోతిని. వృక్షమూలము నందలి నా పట్టువదలెను. మరి నాపని ముగిసినదని తలచి కన్నులు మూసికొంటిని. ఇంతలో వెనుక నుండియెవరో నన్నుపట్టు కొనినట్లైతె, మరలి చూతునుగదా, రాస్కు; స్వామి యానతిని

ఆ శునకరాజము, మీాదినుండి ఆ యురుగుపైకి దుమికి, బలిష్ఠములగు కోరలతో, నా యుడుపులను గట్టిగా కరచి పట్టి లాగజొచ్చెను.

తలవని తలంపుగా వచ్చిన ఈ యాధారము వలన నేను బ్రతికితిని. హెబిబ్రా పనియు నయిపోయినది. అనుక్షణ పరి క్షీణమగుచున్న అల్పబలముతో వాడు తుదిసారి గుంజి చూచెను. వెనుకనున్న కుక్కపట్టు నాకు దృఢతరాలంబన మయ్యెగాన, నేనును శక్తికొలది విదిలించుకొని, వాచిచచ్చి పడిన వాని చేతుల నుండి నా చేయి యూడబెరికికొంటిని. అంత కుమున్నే కదల జొచ్చిన చెట్టు వేరుగూడ అప్పుడే నేలపట్టు వదలెను. రాక్షసతటాలున నన్ను వెనుకకు లాగగ వెస మూలిన ఆ కుజ్జుడు భయంకరమగు ఆ ప్రవాహపు నురుగులో పడి మరల కానరాడయ్యెను. పడిపోవునపుడు వాడు నన్నేమో తిట్టెనుగని, ఆ తిట్టుగూడ ఆ ప్రవాహ ఘోషములో లీనమై వినరాదయ్యెను.

మా మామగారి విదూషకుని జీవిత చరిత్ర యింత ఘోరముగా ముగిసెను.

## 50

అప్పటికి రెండు మూడుగంటలనుండి నేను పడుచున్న ఆవేదనయు, భయంకరమగు ఈ పోరాటమును, అంతకంటె భయంకరమగు దాని పరిణామమును నన్ను పూర్ణముగా నిస్సారుని గావింప, సోలిపోయి, ఆ మడుగు వొడ్డుననే

సగము మైమరచి పడియుండ, బగ్ జార్గల్ "తమ్ముడా! లెమ్ము. ఇంక నిద్రపోట తగదయనేల? అదే ప్రభాకరుడింక ఒక గంటలో అస్తమింపనున్నాడు. లెమ్ము. రాస్కు తీయు దారిని రమ్ము. లోయలో నేను కలిసికొందును" అని పిలిచెను. ఆ పిలుపుతో మరల నాకు ప్రాణమువచ్చెను. ప్రాణము వచ్చుటయేకాదు, మేనికి సత్తువయు, మనమునకు నాశా ధైర్యములును గొప్పక లేచి నిలిచితిని. రాస్కు గుహా మార్గమున పరుగిడుచుండ, దాని యరపులే నాకా చీకటిలో దారిచూప నరుగుచుంటిని. కొంతవడి కించుక వెలుతురు గోచరించెను. పిమ్మట ఆసొరంగము గడచి బైటపడి మరల నిండుగా ఊపిరివిడిచితిని. ప్రాకుడు పట్టి పచ్చనైయున్న ఆ చీకటి గొందివిడచి వచ్చినప్పుడు, నాకు హెబిబ్రా చెప్పిన జోస్యము జ్ఞప్తికి వచ్చెను. "మరల ఈ దారివెంట మన యిర్వురిలో నొకడు మాత్రమే వచ్చి బైటపడును" అని వాడు చెప్పినమాట నిజమేమయ్యెగదా!

# 51

లోయలో నాకొరకు ఎదురు చూచుచున్న బగ్ జార్గల్ యొక్క అక్కునపోయిపడితిని. వానిని నే నెన్నియో ప్రశ్నము లడుగ వలసియున్నను ఒక్కటియు నడుగ జాలనైతిని. అతడే యిట్లువచించెను, "నా చెల్లెలు, మీ శిబిరమున సేమముగా నున్నది. అచట మీబంధువట, ఒకఉద్యోగి కలడు. మేరీని ఆతని కప్పగించి "నన్ను తిరిగి బంధింపుడు" అని కోరితిని.

దానిపై నాతడు "వలదు, నీవు తిరిగి అచటికేగి యెట్లయినను అవర్నీని కాపాడుటకు వీలుకలదేమో ప్రయత్నింపుము. అవర్నీ మరణ సూచకమగు నల్లజెండాను బైసో పర్వతాగ్రమున నెత్తించ నంతవరకును, ఇచట నీకు బదులుగా నున్న పదిమందిని వధింపము. పొమ్ము" అని చెప్ప, నేనును 'మంచిదని' తిరిగి వచ్చితిని. రాస్కు నీ వున్నచోటికి దారి తీసెను. ఈశ్వరానుగ్రహమున మేము సమయమునకు రాగలిగితిమి. మరి నీవు బ్రతికితివి. నేనును బ్రతికితిని." అని తన చేయి నా కందించి "తమ్ముడా! నీ కిపుడు తృప్తియైనదిగదా!" అనెను.

నాకు నోట మాట రాక; వానిని మగల అక్కున నదిమికొంటిని. నన్నింక వదలిపోక నాతో కలసి తెల్లసేనలతో నుండుమని వేడుకొంటిని. రాష్ట్ర సైన్యమున నుద్యోగ మిప్పించెదనంటిని. ఆతడు నా మాటల కడ్డము వచ్చి, కోపముతో "నిన్ను మా సైన్యమున చేరుమంటినా?" అనెను.

నా తప్పు నేను తెలుసుకొని మిన్నకుండ, ఆతడు లేని సంతసము తెచ్చుకొని "రమ్ము శిబిరమున కేగుదము. నీ భార్య యలజడి మాన్పి కన్నులు చల్ల చేయుదము" అనెను.

నాకును అదియే కోర్కెగాన, వెంటనే బయలు దేరితిమి. బగ్ జార్గల్ దారితీయ, నేనును, రాస్కును వెంట నరుగుచుంటిమి.

(అవర్నీ తటాలున కథనాపి, నలుదెసల విచారదృష్టులు పరుపసాగెను. ఆతని ఫాలమెల్ల చెమట ముత్తెములతో

నిండెను. ఆతడు మొగమునకు చేతు లడ్డ మిడుకొని విచారపడు చుండ, ఏమియు తోచక, రాస్కు ఆతనివంక దిగాలుపడి చూడదొడగెను.

"చూడుము, రాస్కు! అట్లె చూడుము. మరియేమి సేయుదును?" అని గొణుగుకొనుచు, అవర్నీ ఆసనము డిగ్గి ఖిన్నవదనుడై అచ్చోటు వదలిపోయెను. సార్జెంటును, రాస్కునుగూడ ఆతని వెంటనే చనిరి.)

# 52

అవర్నీ సానుచరుడై యిట్లు వెడలి చనగా, అచటి వారెల్ల ఆతని గూర్చియు ఆతని కథనుగూర్చియు ఎవరికితోచి నట్లు వారు పరిపరి విధముల నాడుకొన జొచ్చిరి.

హెన్రీ: నాటకము ముగియవచ్చు చున్నటు లున్నది. పాపము బగ్ జార్గల్ ఏమగునోకదా? వాడు నిజముగా మహా పురుషుడుగా ఎన్నదగినవాడు.

పాస్కల్: అపుడు, బగ్ జార్గల్, మద్యమెల్ల ఒక్క గ్రుక్కను త్రావి వట్టిదికావించిన ఆ కొబ్బరిచిప్ప యెంతపెద్ద దియో? దానిని తెచ్చి చూపినవారికి పండెండ్రు డజనుల వైను బుడ్ల నిచ్చెదను.

ఆల్ఫ్రెడ్: బగ్ జార్గల్ నా మనసువచ్చినవాడు. వానికి మంచి మంచి పాటలు వచ్చును.

పాస్కల్: బైసో యెంత దుష్టుడో! దుష్టుడయ్యు వాడు

ప్రేమించివాని మాటవిలువ ఎరుగును. కాఠిన్యమున కేమిలే? వాడు నా ఋణదాతలకంటె కఠినుడా?

హెన్రీ: ఇంతకును కథ యెట్లున్నది?

ఆల్ ఫ్రెడ్: కథను నేను శ్రద్ధగా వినలేదు. కాని అవర్నీ ఇంతకన్న మంచికథ చెప్పుననుకొంటిని. బగ్ జార్గల్ పాటలు ఏ రాగములతో పాడెడివాడో అవర్నీని అడుగవలెను. నిజము నకు కథ నాకు విసువు పుట్టించినదిసుమా!

పాస్కల్: ఆ మాట నిజము. ఈ పొగాకు గొట్టము, బ్రాందీబుడ్డి లేనిచో నేను నిద్రకు బడియుందును. కథగూడ నసందర్భముగా నున్నది. ఆ పొట్టి విధవ – వాని పేరేమి? వాడు పగ సాధించుటకోసమని తన చావునకుగూడ తెగించె నట! ఇది నమ్మదగినదియేనా?

హెన్రీ: వీని యన్నిటి కేమిగాని, కథలో బగ్ జార్గల్ పేరు వచ్చినపుడెల్ల ఈ కుంటికుక్క తలయెత్తి చూచుచుండుట మాత్రము చిత్రముగా నున్నది.

ఇంతలో అవర్నీ కాలి చప్పుడు వినవచ్చి వారి సంభాషణ నిలిచిపోయెను. అవర్నీ లోనికి వచ్చి కొంత తడవు మాటయు పలుకును లేక చేతులు కట్టుకొని అటునిటు తిరుగుచుండెను.

ఆతని వెంబడినే వచ్చిన తాడ్యూ్యాసు, బాష్ప కలుషిత ముగు తనమోము కెప్టెన్ చూడకుండవలయునని, మాటి మాటికి రాస్క ఒడలుదువ్వుచు దానిని ముద్దుగొనుచుండెను.

అవర్నీ ఎట్టకేలకు తన్నుతానే సముదాయించుకొని మరల కథ చెప్ప మొదలిడెను.

# 53

రస్కు మా వెంబడినే వచ్చుచుండెను. అచటి కొండలలో నెల్ల ఎత్తయిన కొండపై ఏదియో తళుక్కున మెరసినట్లయ్యెను.

బగ్ జార్గల్ నాచేయి పట్టుకొని "వినుము వినుము" అనెను. దూరమున నేదియో ఫిరంగి ప్రోగినట్లు చప్పుడై లోయ ప్రతిధ్వనించెను.

బగ్ జార్గల్ ఖేదగద్గదమగు స్వరమున "వింటివా? అది ఫిరంగి మ్రోతయే కదా? అదియే గురుతు" అనెను.

'ఔను' అని నేను తల యూచితిని. అంత నాతడు రెండంగలలో అచటి కొండనెక్కెను. నేనును వెంట నేగితిని. ఆతడు చేతులు కట్టుకొని నిలిచి మోమున విషాద హాసము దోప "నీకది కాన్పించుచున్నదా?" అనెను.

నే నాతడు చూపిన దెస పరీక్షించి చూచితిని, సూర్యుడస్తంగతుడగుచుండ ఈరెండ వెలుగున నల్లని పెద్దజెండా యొకటి సముత్తుంగ మహీధర శృంగముపై గాలికి కొట్టుకొనుచు ముడుతలువడి కానవచ్చెను.

(అవర్నీ మరల కథ నించుక యాపెను)

బైసో ఆ లోయనుండి తరలిపోవు తొందరలో, నన్ను వధించుటకు తాను పంపిన నీగ్రోలు తిరిగి రాకుండగనే, ఆ నల్లజెండా యెత్తించెనని, నేను పిమ్మట వింటిని.

బగ్ జార్గల్ కొంతవడి యట్లే చేతులు ముడుచుకొని, ఆ పతాకముపై చూపు నిలిపి, హఠాత్తుగా నులికిపడి,

అందుండి డిగ్గ గమకింపుచు "అయ్యో! దైవమా! దురదృష్టవంతులగు నా చెలికాండ్రేమైరోగదా ?_ ఆ తుపాకి చప్పుడు వింటివా ?" అనెను.

నే నేమియు బదులు చెప్పనైతిని. మరల నాతడు "వారిని వధ్యస్థానమునకు గొనిపోవుచున్నారు. ఆ తుపాకి మోతయే దానికి గురుతు" అనెను.

పిమ్మట రొమ్ముపై నెమ్మోము వ్రాల కొంత వడి యూరకనిలిచి యాతడు "తమ్ముడా! నీ భార్యచెంత కేగుము. రాస్కు నిన్ను గొనిపోగలదు" అని ఒక యీల వైచెను. రాస్కు దానిని గ్రహించి, తోక నాడించుచు పయనమయ్యెను.

ఆతడు నా హస్తమును గ్రహించి, మొగమునకు లేని తెలివి తెచ్చుకొనుచు, వెరగుగొలుపు చూపులతో, మొగము బిగియబట్టి "సెలవు_మన కింక ఇంతే" అని అరచి అచటి పొదలలో మాయమైపోయెను.

నేనొక కొయ్యనై నిలిచితిని. నాకర్థమైనంతవట్టు విచారించి చూడ, స్థితి విషమించినట్లు తోచెను.

తన స్వామి అట్లంతర్హితుడుకాగా, రాస్కు కొండ యంచున కేగి తలయెత్తి 'కుయ్యో'యని జాలిగొలుప మొరిగి నావంకకు దిరిగి, తోక రెండుకాళ్ళమధ్య నిముడ్చుకొని, నీరు గ్రమ్మ కనులతో, సలజడి నెక్కొన్న చూపులు పరపుచు, స్వామిమాయమైన దిక్కునకు తిరిగి పలుమరు కుయ్యాడ జొచ్చెను. దాని యలజడి నేను గ్రహించితిని. నేనును అదియే

శంకించి భయపడుచుంటిని. అంత నున్నట్లుండి రాస్క, స్వామి యేగిన దెసకు రివ్వున పరుగిడెను. నేను దానిని కనుగొనలేక పోయెడివాడనేగాని, అది మధ్యమధ్య నా కొరకు నిలుచుచు, నేను కన్పించిన పిమ్మట, మరల పరచుచుండెను. ఈ రీతి నెన్నియో లోయలు, వనములు, అతిక్రమించిపోతిమి. మే మెక్కినగుట్టలు, దాటిన వాగులు, లెక్కలేదు. ఎట్టకేలకు—

(పిమ్మట అవర్నీకి నోటమాట రాదయ్యెను. ఆతని మొగమున ఖేదనైరాశ్యము లలముకొనెను. "ఇంక నా వల్ల కాదు. తాడ్యూసూ! నీవు చెప్పుము" అనెను.)

వృద్ధుడగు ఆ సార్జెంటు మాత్రము స్వస్థచిత్తముతో నుండెనా? ఎట్లో ఆతడు చెప్పదొడగెను.

"అయ్యలారా! ఆలకింపుడు. ఏమిస్వామీ! చెప్పవలసిన దనియే సెలవా?—అయ్యలారా! చిత్తగించితిరా? ఈ బగ్ జార్గల్—ఈతనికే 'పీరటు' అని మారుపేరు. సమున్నతాకారుడు, మహాభుజుడు, సాధుహృదయుడు, జగదేక సాహసుడు—చిత్తము స్వామీ! మీరొకరు తక్క—అయ్యలారా! వింటిరా? ఈ పీరట్పై నాకు తగనికోపము. ఈ అనుచిత క్రోధమునకు మీరు క్షమించినను, నా మదికి మాత్ర మీ జన్మమున నూరట కలుగదు.

కావుననే, స్వామీ! మిమ్ములను మరునాడు వధించెదరని తెలియగనే, నేను వానిపై మండిపడితిని. "నా కెప్టెన్ ప్రాణములకు, నీ ప్రాణములు చెల్లుపెట్టెదను" అని వానితో చెప్పినప్పుడు నా క్రూర మానసము సంతోష పరవశ

మయ్యెను. "ఒకవేళ నీవు తప్పించుకొని పోయెదవా, నీ బదులు మీ వారిని పదిమందిని వధింతును" అంటిని వాడే మియు బదులు పలుకలేదు. పిమ్మట నొకగంట తాళిపూచు నప్పటికి కారాగారమున బగ్ జార్గల్ లేదు. గోడకు పెద్ద కన్నము మాత్ర ముండెను.

(అవర్ని చిడిముడి పడజొచ్చెను. తాద్యూసు చెప్పు చుండెను.)

సరే, పిమ్మట ఆ కొండపైన నల్లజెండా కాన్పించు టయు, ఈయన తిరిగి రాకుండుటయు—ఒకప్పుడు మాత్రము తిరిగి వచ్చునని యనుకొంటిమి గనుకనా ?—ఈయన తిరిగి, రాకుండుటయు చూచి, అధికారులు, గుర్రుకొరకు తుపాకి ప్రేల్పు ఆజ్ఞ ఇడిరి. ఆవల ఆ పదిమంది నీగ్రోలను వధ్యస్థలము నకు గొనిపొమ్మని నాకు ఆనతిచ్చిరి. ఆ స్థలమునకు 'రక్కసి మొగ'మని పేరు. అది సుమారు శిబిరమున కెంత దూర మున్నదియు ఇప్పుడు మన కక్కరలేదు—ఇంక మీకు తెలి యని దేమున్నది? నేను పారి నచనటకు గొనిపోయినది విడిచి పుచ్చుటకు గనుకనా ? మరియేమి ? పిమ్మట ఆచారము ప్రకా రము ఆ పదిమందిని ప్రాణబద్ధస్థలను గావించి, ప్రేల్చవలసిన సైనికులను వరుసగా నిల్పుచుంటిని. అపుడేమి చిత్రము జరి గిన దనుకొంటిరి ? ఉన్నతాకారుడగు ఆ నీగ్రో—పీరటు—హఠాత్తుగా మా యెదుటవచ్చి నిలిచెను. ఎంత వేగముగా వచ్చెనో యేమో, ఊరకరోజుకొనుచు, "తాద్యూసుగారూ ! కుశలమా ? నేను సమయము వేళకే వచ్చితిని" అనెను. అంతే ఆ మాట

మాత్రమని, తన ప్రాణమిత్రుల పాశములను చరచర విప్ప దొడగెను. నేను రిచ్చవడి చూచుచు నిలిచితిని. పిమ్మట– స్వామీ ! తమ సెలవా ?– ఆ పదియుంది నీగ్రోలకును వానికిని విచిత్రమగు జగడము ప్రారంభమయ్యెను. వలదని వారు; కాదని యాతడు. ఆ వాద మల్లెంతసేపు సాగెడిదో కాని, ఇంకదాచి యేమిఫలము ?– నేనే దానిని ఆపితిని. ఎట్లయిన నేమి, వారి స్థానమున వాడు నిలిచెను. అంతలో పాపము ! గండుకుక్క రాస్కు వచ్చిపడెను. ఒక్క ఉదుటన అది నా కంఠమున కురికెను. ఆ పట్టును, ఒక పట్టున వదలకపోయెడిదే కాని, పీరటు సంజ్ఞ చేయుటచే విడిచెను. నన్ను విడిపించుట మాత్రము సాధ్యమయ్యెనే కాని, స్వామి పాదముల చెంత నిలువకుండ దాని నెవరు మాన్పగలరు ? పిమ్మట—స్వామీ ! మీరు మరణించిరని యే నమ్మియుంటినిగాన, – ఆగ్రహావేశముతో "ప్రేల్చుడు" అంటిని. ప్రేల్చిరి. బగ్ జార్గల్ పడెను. ఒక తూటా తగిలి కుక్కకాలును విరిగెను.

అది మొదలు పాపము ! రాస్కు కుంటిదయ్యెను. పిమ్మట చేరువ అడవిలో ఆ రథ్వని వినవచ్చుటయు, అచటి కేగి మిమ్ముగాంచితిని. ఆ నీగ్రో పీరుని కావాడు ఆతురతతో మీరు పరుగున వచ్చుచుండ, తప్పిపోయిన తూటా యొకటి మీకుకూడ తగిలియుండును. అవును, మీకు గాయమయ్యెనే గాని బగ్ జార్గల్ మరణించెనేగదా !

అంత మిమ్ము శిబిరమునకు గొనిపోతిమి. గాయ మంతగా ప్రమాదమైనది కాదు గాన వైద్యులు వెంటనే

మాన్పిరి. మేరీయమ్మగారి ఉపచారములే చాలవరకు గాయములు మాన్పెనని నా నమ్మకము సుడీ!

అంతటితో సార్జెంట్ కథముగిసెను. అవర్నీ దుఃఖగంభీర స్వరమున "బగ్ జార్గల్ మరణించె గదా!" అనెను.

తాడ్యూసు తలవంచి "నిజము స్వామీ! నన్నాతడు రక్షించెను. నేనాతనిని జంపించితిని" అనెను.

( ఉ ప సం హా ర ము )

తరువాతి కథ మా వంతునకు వచ్చినది. దానిని చెప్పక మానుద మన్నను అతికుతూహల పరులగు పాఠకులు మాననీయరు.

బగ్ జార్గల్ వంటి మహావీరుల నెందరినో ఆహుతిగొనియు శాంతింపని ఆ ప్రళయాగ్ని మిక్కిలి ప్రదీప్తమై, అనంతరము ప్రవర్తిల్లిన కాపునగరపు ముట్టడిలో మేరీనికూడ తన పొట్టనిడికొని, దుఃఖభాజనమగు అవర్నీ జీవితమును కాష్ఠప్రాయ మొనర్చెనని, ఈ భయద విషాదకథ ముగించి, విధివిలాసము అవిలంఘనీయ మని అబ్బుర మందుటకన్న, అన్యమగు మంగళాచరణ మొనర్పజాలని మమ్ము పాఠకలోకము మన్నించుగాక!!

:: సమాప్తము :—